

# షాజహాను





అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారు

సరస్వతీ గ్రంథమండలి

రాజమహేంద్రవరము

1927

 [వెల 1—0—0

DEDICATED

TO

THE HALLOWED MEMORY

OF

HIS HOLINESS SWAMY SRADDHANANDA,

THE SOUL OF "**Gurukulamahavidyalaya,**"

THE LEADER OF **Suddhi** AND **Sangathan**

MOVEMENTS,

THE GREAT APOSTLE OF **Sanathanadharma,**

(*One of*)

The Stanchest of Indian Nationalists,

AND

THE BEACON-LIGHT OF

Young India.

AS

*A Humble Token of Admiration*

*For His*

*Glorious Career*

AND

**Great Martyrdom**

BY

**The Author.**

# కృతిసమర్పణము

సీ. నెహ్రూలజపతుల • నేస్తకాఁడైయుండి
విద్యానొక్కఁడఁగొన్న • వేధయెవఁడు?
న్యాయవాది పథముఁ • బాయశంకింపక,
త్యాగముసూపిన • యోగి యెవఁడు?
సర్వశాస్త్రములను • చక్కఁగఁ బఠియించి,
హైందవత్థాన • మరసె నెవఁడు?
స్వస్థుఁడగుచునుండి • స్వగృహమున ఁరషిద్దు'
రాత్మజేఁబడ్డ మ • హాత్ముఁడెవఁడు?
గీ. అట్టివిన్నాణి మేధావి • యార్యశ్రేష్ఠు,
వీరశ్రీశ్రద్ధానందు ప • విత్రస్మృతికి
నిత్తుఁ గృతికుసుమాంజలి • బత్తిమీఱ
అశ్రుధుసి వెడలంగ నా • యత్మీనుండి.

# పీఠిక

క్రీస్తుశకమునకు బహుశతాబ్దములకుఁ బూర్వము సాహిత్యమున, వసుమతిఁ బ్రతీతివడసిన భాషలు లెక్కకు మిక్కిలి తక్కువగనుండెను. వానియందాంధ్ర మొక్కండని పలు నిదర్శనములవలన నెఱిఁగి మన మెంతయు గర్వపడుచుంటిమి. ఆసేతుహిమాహార్యపర్యంతమకుంఠిత విక్రమమునఁ బాలన మొనరించిన నాంధ్రమహీక్షితుల ననుగమించి, జంబూద్వీపమందే గాక బూర్వపృథ్వియం దెల్లకడఁ గడలేని ప్రతిభఁగాంచి, పశ్చిమావనిఁ బ్రసిద్ధివడసిన గ్రీకులేటిన్ భాషలకుఁ దగ్గైనదై యుండెడిది. కాని, యిత్తఱి ఆంధ్రమగ్రస్థానచ్యుతమై, స్వీయరాష్ట్రాంతరసీమలఁ బేరు లేనిదైయుండెను.

ఇఁక వంగమో? సుమా రేఁబదివర్షములకుమున్ను కడు నికృష్టావస్థనున్న నది నేఁడుత్కృష్టస్థానము నలంకరించి, ప్రాక్పశ్చిమ ఖండములం దనర్ఘమగు యశమునంది, అవనిగల ప్రధానవిశ్వ విద్యాలయములఁ బఠనీయభాషయాయెను!

వంగభాషకుత్థానమును, మనభాషకుఁ బతనమేల వాటిల్లెను?

విశేషముగఁ బౌరాణికప్రథలనే గణించుచు, మన తెల్గులు భాషాస్యందనమును కాలనేమిపై సముచితరీతి బరిచాలిత మొనరింప గడంగకుండుట కాంధ్రభాషాపతనమునకును, అన్యభాషల ననుకరించి వంగనివాసులు భావవికాసమున కనువగు క్రొత్తవన్నెలఁ గల్పింప దొరకొనుట వంగభాషోత్థానమునకును హేతుకములు. కాని యిరుభాషల పతనోన్నతులకుఁ గారణభూతులు కేవలముభాషారచయితలే కారు. ప్రయోజనయుతమగు బీజము ఫలసమన్విత మృత్తునందే యంకురించులీల మేధావులగు కవులుగూడ సాహిత్యమహత్త్వమును పూర్ణ

ముగ హృదయంగమముఁ గావించుకొనఁజాలు ప్రజానీకమందే వన్నెకెక్కఁదురు. అట్టిజనవితానమందే కవితాచార్యుల యశోబీజములు మొలకలెత్తి ఫలసమన్విత కుజములగును. ఆంధ్రజన సామాన్యము సాధారణ సంగవాపులకంటె—తజ్ఞులు కాకపోయినను యున్నింతురుగాక—సాహిత్యరసాస్వాదన మొనరించుటందు దక్షుల నెర్పరులగుటచే వసురాయాది కవీంద్రవరులు తామందఱు వాసికెక్కక యుండనేరకుండిరి. పృథుకవీంద్రుఁడగు రవీంద్రుని "గోరాచప్పనైయున్న" దని యాంధ్రులువల్లరు ననుటకుఁగూడ నిదియే హేతువని నా యభిప్రాయము — తెల్గువెన్కఁబడుటకుఁ దెల్గుకవులకంటెఁ దెల్గుప్రజలెక్కుడుత్తరవాదులని తోఁచెడిని. దానంజేసియే ద్విజేంద్రునంతటి కవీంద్రునిఁగూడ నాంధ్రవసుంధర విడచుచు, ఆమనీషునుద్దేశముల నుచితరీతి మనవారలు హృదయంగము మొనరించుకొనఁ జాలరేమోయని నేశంకించుచుంటిని. ఈశంకకిప్పుడు ద్యోతకము కారణము నూతనఫక్కిని వెల్వడు గద్యనాటకములకింకను వలయు సమాదరణము ప్రాపింపకపోవుటే! "మేవారుపతనముఁ" జదివిన మనవారలది కడుంగడు దీర్ఘమైయుండెననియు, మూఁడునాల్గు గంటలకాలమున రంగస్థానమునఁ బ్రదర్శింప ననుకూలంబగు నాటకమె ప్రజాప్రమోదకరంబై సర్వజనాదరణార్హంబై యుండుననియు దానంజేసి ద్విజేంద్రుని నాటకముల నాంధ్రీకరించు నవసరమునఁ జాలగ్రంథమును తగ్గించుటుచితమనియు వాక్రుచ్చిరి. కొలఁది ఘంటలలో నాటకముఁ బూర్తియగుటయుఁ బొత్తము చిన్నదియై యుంటయు గ్రంథరచనప్రధానోద్దేశములని తలంచువారలట్లు ననుటకర్హమైతోఁపదు. వంగవిషయమున షేక్స్పియరని వాసిగాంచిన ద్విజేంద్రుని యుద్దేశ్యములివియై యుండవని నొక్కివక్కాణింపఁగలను. కావుననే యామహాప్రతిభాశాలి తననాటకములను వేఱుతీఱున లిఖించి, తనస్వాతంత్ర్యభావము నన్యుల యసంగతా

భిప్రాయములకు బలియొనఁగలేను ఆమహనీయుని నుడువులఁ దెల్గున నీనాటకములం దుచ్చరించు భాగ్యము నాకలవడుటఁజేసి, ఆతనియుద్దేశముల ననుకరించుటయే నాకర్జముగాని, అనాయాస ప్రదర్శనకుతూహలుల యభీష్టానుసారము వర్తించుట కాదని యెఱిఁగి ద్విగుణీకృతోత్సాహుఁడనై నాకర్తవ్యము నేఁ గావించుచుంటిని. ఇపుడు కాకున్న కాలక్రమ మందైన నాచెయ్వులు నాజతన మసంగతంబైనది కాదని గ్రహింతురుగాక!

ఉపోద్ఘాత విస్తరభీతినిఁక నీవిషయమున విశేషముగ లిఖింపగడంగను. కాని, యిందచటచట షేక్స్పియరు ద్విజేంద్రులకుఁ గల పోలికలఁదెల్పుచు నాంగ్లమున విమర్శరూపకముగ నేఁదెలిపిన యంశములే నాపూర్ణభూమికా విషయములని నుడువుచు, దీనినాంధ్రసోదర సోదరీమణుల కరములనప్పన మొనరించుచు, నిందులకు సాయపడిన మిత్రులు శ్రీదిలీప్‌కుమార్ రాయ్‌గారికిని, శ్రీయుత అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయుఁడుగారికిని, నాకృతజ్ఞత దెలుపుచుంటిని.

| | |
|---|---|
| కలకత్తా | ఇట్లు విన్నవించు సుధీవిధేయుఁడు, |
| 21—12—26 | జొన్నలగడ్డ సత్యానారాయణమూర్తి. |

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు

పురుషులు.

| | |
|---|---|
| షాజహాన్ | భారతచక్రవర్తి. |
| దారా<br>సుజా<br>ఔరంగజీబ్<br>మురాద్ | షాజహాను కుమారులు. |
| సులేమాన్<br>సిపార్ | దారాయొక్క కుమారులు. |
| మహమ్మద్‌సుల్తాన్ | ఔరంగజీబు తనయుఁడు. |
| జయసింహ | జయపురాధీశ్వరుఁడు. |
| యశవంతసింహుఁడు | యోధపురపతి. |
| దిల్దార్ | ఛద్మవేషియైనజ్ఞాని [దానేశ్మంద్] |

స్త్రీలు.

| | |
|---|---|
| జాహానారా | షాజహాను కూతురు. |
| నాదిర | దారాభార్య |
| పియారా | సుజాభార్య |
| జహారతున్నిసా | దారా కూతురు. |
| మహామాయ | యశవంతసింహుని భార్య |

శ్రీరస్తు.

శ్రీ పరమాత్మనేనమః

# షాజహాన్

# SHAJAHAN.

## (A Historical Drama)

## ప్రథమాంకము.

### ప్రథమదృశ్యము

ఆగ్రాదుర్గము—షాజహాన్ మందిరము.

అపరాహ్ణకాలము.

పర్యంకముపై షాజహాను చేతిపైఁ దల నానుకొని ప్రక్కకొదిగి పరుండి యేదియో యాలోచించుచు నడుమ నడుమ హుక్కా పీల్చుచుండును. సమ్ముఖమున దారా నిలచియుండును.

**షాజహాన్**—తనయా! ఈ దుర్వార్త నన్ను మిగుల దూపిల్లఁ జేయుచున్నది.

**దారా**—వంగదేశమున విద్రోహమునకు దిగిన సుజా యింకను సామ్రాజ్యపదము వహించలేదు. కాని మురాద్ ఘూర్జరసీమయందుఁ బాదుషా తానేయని ప్రకటించెను. దక్షిణదేశమునుండి యౌరంగజీబు బరుదెంచి వలయుపాయము సలుపుచుండెను.

**షాజహాన్**—అటులనా! తనయా! ఒకించుక యాలోచింపనిమ్ము. ఇట్టి విషయముల భావించుట యెన్నడు నా కభ్యాసము లేదు. దానంజేసి నా కేమియు బోధపడుటలేదు.

[ధూమపానముఁ గావించును.]

దారా—సుజా సైన్యములఁ బ్రతిఘటింపుమని నే నింతకు ముందే నందనుఁడైన సులేమానునకుఁ గమ్మలిఖించి, యతఁ డిపుడున్న ప్రియాగకు దాని సంపితిని తనయునకుఁ దోడ్పడ వికనీరుపతిని సైన్యాధ్యక్షులైన జయసింహ దిలీర్ఖానుల నిప్పుడ బంపుచుంటిని,

షాజ—(ముఖము వంచి నేలఁ జూచుచు ధూమపాన మొనరించు చుండును.)

దారా—మురాదు నెదుర్కొన యశవంతసింహు నంపుచుంటిని.

షాజహాను—పంపుచుంటివా!—పంపుచుంటివా! [హుక్కా బీల్చును.]

దారా—తండ్రీ! మీరు చింతింపకుఁడు. ఈ విద్రోహాగ్ని నెట్లు చల్లార్పవలయునో నే నెఱుంగుదును.

షాజహాను—తనయా! నే నందులకై చింతిల్లుటలేదు. అన్నదమ్ములకు యుద్ధము పొసగునంచు విచారించుచుంటిని (మరల రెండుగ్రుక్కలఁ బీల్చి) దారా! వారలపైఁ గోపపడఁగూడదు. నయంబున వారలకు నీతిఁ గఱపుడుము. కావున నిరాటంకముగ వారలను రాజధాని లోనికి రానిమ్ము.

(జాహానారా వేగముగఁ బ్రవేశించును.)

జాహానారా—అట్లనుమతి నొసంగకుఁడు. దాన నష్టము వాటిల్ల గలదు. రాజును జంపుటకై యేదురాత్ముఁడు గత్తినెత్తెనో యా దురాత్ముని కంఠమందే యాకత్తియే పడవలయును. ఖలునకు కరుణ చూపరాదు. సుజా ఖలుఁడు! ఔరంగజేబ్ ఖలుఁడు! మురాద్ ఖలుఁడు!

షాజహాన్—బిడ్డా! అట్లనుచుంటివేమి! వారలు నా పుత్రులు!

జాహానారా—పుత్రులైన నేమి మిత్రులైననేమి. పుత్రులు మిత్రులు కూడ శత్రులైనపుడు దండనార్హు లగుదురు. పసిపాపలవగిది వ్రుత్రు లజస్రమల్లారు ముద్దుగఁ బెనుపబడుచుండవలయునా? జనకు

లోకప్రౌఢులైన వారలకు భయము గొలుపరాదా! దుండగులైన తనయులను దండ్రులు శాసింపఁగూడదా?

షాజహాను—నాయెడద యొక శాసనముచే యెఱుంగును—అది ప్రణయశాసనము. అమ్మా! మీరందఱు తల్లిలేని బిడ్డలు. అట్టి యభాగుల శిక్షించుటకు నాచిత్త మెట్లొప్పును?—నాకుఁ జేతు లెట్లువచ్చును? స్ఫటికశిలాఘటిత దీర్ఘనిశ్వాసము నాఁడోచు, ఆ తాజమహాలును వీక్షించి తదుపరి తనూజుల దండింపుమని వచింపుము.

జాహానారా—జనకా! మీ రీతిఁ బల్కఁదగునా? భారతసామ్రాట్టైన షాజహా నిట్టి దౌర్బల్యము నూపవచ్చునా? సామ్రాజ్య మంతఃపురమా? బాలకుల యాటవస్తువా! రాజ్యమేలుట నవ్వులాటకాదు. మీపై నొక ప్రకాండశాసనభారము పడియున్నది. ప్రజలు విద్రోహులగుచోఁ బుత్రులని తలంచి చక్రవర్తి వారల నాలింగన మాచరించుకొనుట మంచికార్యము గాదను విషయము మీ రెఱుంగరా? ప్రేమవ్యాజమునఁ గర్తవ్యము నణఁగఁ ద్రొక్కుట ధర్మమా! యుక్తిచేఁ దనూభవుల స్వాధీనపఱచుకొనుఁడు.

షాజహాను—బిడ్డా! తర్కింపకుము. నే నేయుక్తి నెఱుఁగను. నే నెఱింగిన యుక్తి యొక్కటియే! అది యనురాగము! (దారా నుద్దేశించి) [ఈ యుద్ధమం దేపక్షము పరాజయ మొందినను నాకు మాత్రము విచారము సమానమే—నీవు పరాజయ మొందుచో నీ మ్లానముఖమును వీక్షించి విచారింపవలయును. పరాజితులై వారలు వెనుదిరిగి పోయిరేని నా యంతర్దృష్టియందు వారల మలినముఖంబులు పొడసూపి నాకు వంతఁగొలుపును. తనూజుల దండింప నే సాహసింపఁజాలను. నీ సోదరులను దిరుగ రాజధానికి

రానిమ్ము. సామదానోపాయముల వారలకు బుద్ధిఁ గఱపెదను.

దారా—తండ్రీ! మీయిచ్చవచ్చిన తెఱంగున నాచరింపుఁడు.

జహానారా—సోదరా! నీ వీచందముననే వృద్ధజనకునకుఁ బ్రాతినిధ్యము నలుపుచుంటివా? మనతండ్రి శాసింపసమర్థుఁడై యున్న నీకరములందతండు రాజ్యాంగతంత్రమును వదలిపెట్టియే యుండెడు— దుర్మతులైన తనయులు ముప్వురు విద్రోహధ్వజము నెత్తి ఢంకానినదంబులతో నాగ్రాయందుఁ బ్రవేశించుతఱి, జనకుని ప్రతినిధివయ్యు, చిరునవ్వునవ్వుచు నూఱకసిలిచి వేడుకఁ జూచుచుందువా!—బాగు! బాగు!!

దారా—సోదరీ! నీవట్లు దలంపకుము. (జనకు నుద్దేశించి) తండ్రీ! భవదాజ్ఞకై వేచియుంటిని.

షాజహాను—ఈశ్వరా! జనకుల హృదయముల నట్టి ప్రేమరసంబుతో నింపివైచితివేమి? వారల హృదయములు లోహనిర్మితములుఁ గావింపలేదేమి?—

దారా—తండ్రీ! నే నీసింహాసనమును వాంఛించుచుంటినని తలఁపకుఁడు. స్వౌన్నత్యార్థమై నేనీ కదనమును నలుపుటలేదు. నాకీ సామ్రాజ్యమక్కఱలేదు. దర్శనోపనిషద్గ్రంథములందింతకంటె ఘనంబగు సామ్రాజ్యమును పొందితిని. మీ సింహాసనమునకు రక్షణమొసఁగఁ దలంచియే యీ కర్యములు కియ్యకొనుచుంటిని.

జహానారా—పితృసింహాసనమునకు రక్షణ మొసఁగుటకును, విద్రోహము నడంచుటకును, నిరీహప్రజాకోటుల నరాజకాత్యాచారానుభవమునుండి కాచుటకును, చనుచు, నీకర్తవ్యమును నెరవేర్చుచుంటివి. రాజ్యమందుఁ బ్రబలిన తాదృశ దుష్ప్రవృత్తుల నడంపకున్న మొగలుసామ్రాజ్యలక్ష్మి యచిరకాలముననే విగతజీవయగును.

దారా—తండ్రీ! భ్రాతృత్రయమును పీడింపక, బంధించిమాత్రము భవచ్చరణతలము జేర్చెదనని ప్రతిజ్ఞగావించుచుంటిని. మీరిచ్చగించుచో వారల క్షమింపుఁడు. కాని షాజహాను చక్రవర్తి స్నేహశీలుండయ్యు, దుర్బలుండు కాఁడని వారల కెఱుంగఁజేయ వలయును.

షాజహాను(లేచి)—మంచి దట్టులే కానిమ్ము! షాజహాను జనకుఁడే గాక చక్రవర్తియనికూడ నాకుమారులు తెలిసికొందురుగాక.- తనయా! ఈయాజ్ఞాపత్రముఁ గైకొని నీవిఁకఁ బోయిరమ్ము! న్యాయధికారమంతయు దీనిమూలమున నీకిచ్చివైచితిని. తగురీతి విద్రోహకులను దండింపుము. (ఆజ్ఞాపత్రము నొసంగును).

దారా—తండ్రీ! మీ యాజ్ఞాప్రకారమాచరించెదను.

షాజహాను—కాని యీ దండనము వారికి మాత్రమే కాదు. నాకు కూడ నిందు పాలున్నదని యెఱుంగుము. జనకుఁడు తనయుని దండించుతఱి, అతఁడు కడు దురాత్ముఁడని నందనుఁడు దలంచి నను, పితృవేత్రతాడనమందలి యర్ధభాగము తండ్రి పీవుపైఁ బడుటయే నిక్కము గదా!

(నిష్క్రమించును.)

జహానారా—సోదరా! వారల యాకస్మికవిద్రోహమునకుఁ గారణమరయఁ గలిఁగితివా?

దారా—జనకుఁడు రోగగ్రస్తుఁడై యుండుట మిథ్యయనియుఁ, బితృమరణంబు కతన నేనే జనకుని పేరఁ బాలనక్రియలఁ గావించుచుంటిననియు వారలు బలుకుచుండిరి.

జహానారా—నీవట్లొనరించిన దోస మేమున్నది! నీవు చక్రవర్తికి జ్యేష్ఠపుత్రుండవు. భావిసామ్రాట్టువు.

దారా—నేను సామ్రాట్టు నగుటకు వారలియ్యకొనరు.

(సిపార్ సహితయై నాదిర ప్రవేశించును)

సిపార్—జనకా! మీ యాజ్ఞను శిరసా వహింప వా రిచ్ఛగింపరు.

జాహానారా—(మందహాసమున) కుఱ్ఱా! వారల దుండగమును నీవు కూడ నెఱుంగుదువా?

దారా—(నాదిర నుద్దేశించి) ప్రేయసీ! తలవంచుకొని యుంటి వేమి? ఏమైనఁ జెప్పఁ దలంచితివా!

నాదిర—ప్రభూ! నా యనురోధ మొక్కటి గలదు.

దారా—అదేమియో యెఱింగింపుము. ఎల్లపుడు నేను నీ కోరికల విన నువ్విళ్లు లూరుచుందునని యెఱుంగవా?

నాదిర—ఎఱుంగుదును. దానం జేసియే పలుక సాహసించు చుంటిని. ఈ యుద్ధమును విరమింపుఁడని నేఁ గోరుచుంటిని.

జాహానారా—ఏమి?

నాదిర—నా చిత్తము మిగుల వ్యత్త—

దారా—అట్లూరకుంటివేమి?—సతీ! కదనమునకు బోవలదని యేల వారించుచుంటివి?

నాదిర—కడచిన రాత్రి నే నొక దుస్స్వప్నమును గాంచితిని.

దారా—ఆ దుస్స్వప్న మేమి?

నాదిర—ఏమియో బలుక నోరాడకున్నది. ఆ స్వప్నము మిగుల భయానకమైనది. నాథా! మీ రీకదనమునఁ గాలిడకుఁడు.

దారా—సతీ! నీ వట్లు వారింపవచ్చునా?

జాహానారా—రమణీ! నీవు పరభేజు సంపనివి గావా! భండన భయంబున నీ విట్లుమ్మలింపఁదగునా?—ఈ యశ్రుజల మీ శంకాకులదృక్కు లీ భయవిహ్వలోక్తులు వీరదుహితకుఁ దగునా?

నాదిర—వదినా! అదెట్టి స్వప్నమో నీ వెఱుంగవు!—అది మిగుల

## ప్రథమాంకము

భయానకమైనది జామీ!

జాహనారా—సోదరా! విన్నబోయిన మోమున నీ వేమియో యాలోచించుచుంటివి! నీ పిట్టితరల స్వభావుఁడవైతి వేమి? నీ స్త్రీస్వభావము ననాశ్చర్యమున ముంచుచున్నది. పితృసమ్మతి బడసియుఁ, బ్రియురాలి సమ్మతికై యాలసించుచుంటివా? కఠోర కర్తవ్యము నీ యెదుట నుండెనని యెఱుంగవా! నీరవుఁడవై భావించుట కిదియా సమయము?

దారా—సోదరీ! నీ పలుకులు నన్ను మిగుల నుత్సాహించుచున్నవి. ఇప్పుడు యుద్ధ మనివార్యము. తండ్రి యానతిఁ దలఁదాల్చి కార్యాచరణమునకుఁ గడంగెదను.

(నిష్క్రమించును)

నాదిర—వదినా! నీ వెంత క్రూరురాలవు!—బిడ్డా రమ్ము.

[సిపార్ సహితముగ నాదిర నిష్క్రమించును.]

జాహనారా—ఈమె యిట్లు భయాకులచిత్తయగుటకు హేతు వేమో యెఱుఁగజాలకుంటిని.

(షాజహాను మరలఁ బ్రవేశించును)

షాజహాను—అమ్మా! నీ సోదరుఁడు వెళ్ళినాఁడా?

జాహనారా—అవును!

షాజహాను—(క్షణకాలము నిస్తబ్ధుఁడై) బిడ్డా!

జాహనారా—ఏమి జనకా!

షాజహాను—నీవు-కూడ-నిందమునిగొనుచుంటివా!

జాహనారా—ఎందు?

షాజహాను—భ్రాతృకలహమందు.

జాహనారా—వారికలహముతో నాకు బని యేమున్నది?

షాజహాను—అమ్మా! ఆత్మజుల దండించుట క్రూరకృత్యమే! కాని

వేఱుపాయమేమియు లేమి, నిప్పుడిట్లొనరించు టనివార్యమయ్యెను. ఈకర్మమక్రియయుఁ దీవెట్టి జోక్యమును గలుగఁ జేసికొనకుము. ప్రేమ, భక్తి, కారుణ్యంబులే నీయుపి. ఈదుర్గంధపంకిల మందీవడు గిడకుము—పవిత్రపిత్తవై యుండుము.

ద్వితీయదృశ్యము.

నర్మదాతీరమందు మురాదుశిబిరము—రాత్రికాలము.

దిల్దారేకాకియై యుండును.

దిల్దారు—మూరాదు విదూషకుఁడ నగుటంజేసి నేనలుపు హాస్యము వ్యంగ్యధూమమై పరిణమించును. మూర్ఖులు నాపలుకుల యర్థమును గ్రహింపఁజాలక నావచనము లసందర్భములని దలంచి నవ్వుదురు. అట్టివారిలో మురాదగ్రగణ్యుఁడు. యుద్ధోన్మత్తుఁడయ్యు నామూఢుఁడు సంభోగ పంకిలమందు సర్వదా మునిఁగి యుండఁగోరును. మనోరాజ్య మతనికొక యనాపిష్కృతసీమ—అం దేమున్నదో యతఁడెఱుంగఁడు—అదుగో! ఆ మూఢుఁ డిచ్చ్యెడకే వచ్చుచున్నాఁడు.

(మురాదు ప్రవేశించును.)

మురాదు—దిల్దారూ! మనము రణమందు జయించితిమి. సంతసమున నీవొకపాట నాట్యమొనరింపుము. అచిరకాలముననే జనకుని సింహాసనచ్యుతునిగావించి మహావైభవమున నేను సార్వభౌమ పదవి నందఁగలను—దిల్దారూ! నీవేమియో భావించుచున్నట్లు దోఁచుచున్నది—తల పంకించుచుంటి వేమి?

దిల్దారు—స్వామీ! నేఁడు నేనొక నూతనవిషయమును గ్రహించితిని.

మురాదు—ఏమది!

దిల్దారు—క్రూరజంతువులు తమ కన్నబిడ్డలఁ దామే చంపితినునని వింటిని—అదినిజమేనా?

మురాదు—అవును నిజమే!—అయ్యో!

దిల్దారు—తలిదండ్రులు బిడ్డలం జంపితినుటయే గాని, బిడ్డలు తలిదండ్రులఁ జంపితినుట క్రూరజంతువు లెఱుంగవు.

మురాదు—నిజము గ్రహించితివి.

దిల్దారు—చూడుఁడట్టి గుణంబును ఘాతుకమృగంబులకీయకున్నను భగవానుఁడు మనుష్యుల కొసఁగెను. జనకుని జంపు తనూభవుల నిప్పుడుజూచు చున్నారము. రెండువిధములుగా నుండవలెననియే భగవానుఁడు మానవునికీ గుణమును జంతువునకా గుణమును బ్రసాదించెను! ఆహా! దేవుని బుద్ధిబల మెంతటిది!

మురాదు—అవునవును. అల్లా బుద్ధిచాలపెద్దది! వహవ్వా! నీవు మా మంచిసంగతి చెప్పితివి దిల్దారూ!

దిల్దారు—కాని మనుష్యబుద్ధి యెదుట నీశ్వరుని బుద్ధియెంత! మానవుఁడీశ్వరుని తలఁదాటిపోయినాఁడు.

మురాదు— ఎట్లు?

దిల్దారు—ఎట్లో చూడుము!—దయామయుఁడు మానవులకు దంతముల నొసఁగినదెందుకు?-నిజముగ, నమలుటకేగాని యిగిలించుటకుగాదు. కాని మానవుఁడీశ్వర ప్రదత్తదంతములతో నమలుటయేగాక యొకప్పుడు వానిని బయలుపఱచి యిహ్వీహ్వీ యను వింతశబ్దముఁ గావించును. ఈశ్వరుని ప్రజ్ఞకంటెఁ దన ప్రజ్ఞ యెక్కుడని మనుజుఁడిందు మూలమున నిరూపింపలేదా?

మురాదు—అవును! నీవనునది నిక్కువమే!-

దిల్దారు—హాసము కొరకు మనుజుఁడెన్నియో యత్నములఁ జేయుచుండును. నవ్వుటకై యతఁడెన్నని వింతతలంపులఁ దలంచును! నవ్వ వేడుకపడుచు సమయాసమయములం దతఁడు తదర్థమై యత్నముఁగూడ వ్యర్థముగఁ బెట్టించును.

మురాదు—అవునవును! అహ్హా హ్హా హ్హా హ్హాః.

దిల్దారు— ఈశ్వరుఁడు మనుజునకు జిహ్వ నొసఁగెను. రుచి నెఱుంగుట కేదానిని పరమేశ్వరుఁడు ప్రసాదించెనని స్పష్టముగఁ దెలియుచున్నది. కాని మానవుఁ డాజిహ్వామూలమున భాషాసృష్టిఁ గావించెను!—భగవానుఁడు నరునకు నాసిక నేల యొసంగెను? నిశ్వాసముగ నూపిరి విడుచుటకేగదా?

మురాదు—అవునందులకేగాక వాసనజూచుటకు గూడ.

దిల్దారు—కాని మనుజుఁ డానాసికపైఁ దన చమత్కారమునంత యుజూపెను. ఆముక్కుపై నతఁడొక ముక్కద్దమును నిలిపి, యద్దమునఁ దనముఖమును జూచికొని ముసిముసి నగవులు నవ్వుచు మిగుల మురియుచుండును. సులోచనుఁడగు భగవానునకు సులోచనోపయోగము గోచరింపలేదు.—స్వామీ! మనుష్యనాసికము నిద్రాసమయ మందొక వింత ధ్వనిజేయును గదా!

మురాదు—అవును. కాని నాముక్కు మాత్రమట్టిధ్వని నెన్నఁడు చేయదు.

దిల్దారు—కాని స్వామివారి నాసికము సాధారణుల నాసికమురీతి సామాన్యధ్వనిని గావింపదు. పరిసరప్రదేశములు మాఱుమ్రోగునట్లు దేవరముక్కు ధ్వనిజేయును. శ్రోతల గుండియలవియఁ జేయును. రాత్రులందేఁ గాకుండ ప్రభువువారి నాసిక యపరాహ్ణ సమయములందుఁగూడ భీషణస్వనము సలుపును!

మురాదు—మంచి దీమాఱు నాముక్కు మట్టి శబ్దము సలిపినపుడు నాకుం దెలిపి సత్యాసత్యముల స్పష్టపఱుపుము!

దిల్దారు—స్వామీ! అది సిరాకాశేశ్వరుని వంటిది! దానిని బాగుగ నెఱుంగుట కష్టము. తెలుపవలసిన సమయమందది యడంగిపోవును.

మురాదు—సరే దిల్దారూ! భగవానుఁడు మనకుఁ గర్ణముల నొసఁగెఁగదా! దానిపై మనుజుఁడెట్టి చమత్కారము చూపెను?

దిల్దారు—ఓ! చూపలేదని తలఁచుచుంటిరా యేమి! కర్ణముల ద్వారా మానవుఁ డొకదార్శనిక సత్యమును నావిర్భవింపఁ జేసెను. కర్ణపశ్చాద్భాగమున నుత్తమాంగమూఁడుచోఁ గర్ణముల ముందునకు లాగినప్పుడపై గూడ వాని ననుగమించును. కాని యిక్కాలమం దనేకుల కౌదల లేదనుట నిక్కముగాదా?

మురాదు—లేదా యేమి! వహావ్వా! హా హా హా—ఇదుగో! అన్నయైన యౌరంగజీ బిచ్చోటకే వచ్చుచున్నాఁడు. నీవిఁక వెళ్ళుము.

దిల్దారు—చిత్తము మహాప్రభూ!

[నిష్క్రమించును.]

(రెండవవైపునుండి యౌరంగజీబు ప్రవేశించును)

మురాదు—అన్నా! రమ్ము. నిన్నాలింగన మాచరించుకొనియెదను. నీ బుద్ధిబలంబువలననే మన మీ రణమున విజయము నందితిమి.

[ఆలింగనము]

ఔరంగజీబు—జయోపేతుఁడ వగుట నీ శౌర్యబలంబునఁ గాని నా బుద్ధిబలంబునఁగాదు. తమ్ముఁడా! నీ శౌర్యబల మెంత యద్భుతమైనది! మృత్యువన్న నీ కిసుమంతయైన వెఱపులేదు.

మురాదు—మృత్యువునకు వెఱచువారు బ్రదుకుటకంటెఁ జచ్చుటే మేలని యుపన్యాసము వచించుచుండుట నాకింకను జ్ఞప్తియం దున్నది. నా శౌర్యము మాటటుండుము—యశవంతసింహుని నలువది వేల మొగలుసైనికులను నీ వెట్టి మంత్రబలంబున వశపఱచుకొంటివి! నీ ప్రోత్సాహముచేతనే యా మొగలులు తుదకు యశవంతసింహుని రసపుత్రసైనికులనే యెదుర్కొనిరి. అది నిక్కముగ భౌతికకృత్యము సుమీ!

ఔరంగజీబు—రేపు యుద్ధము జరుగు ననగా నాపవుపున( గొందఱు సైనికులు ముసల్మాను ఫకీర్లవలె ప్రచ్ఛన్న వేషులై యశోవంతుని మొగల్సైనికుల కడకరిగి కాఫరుల యధీనమందుండి, కాఫరులతో( గలసి, కాఫరైన వారాపక్షము నవలంబించి, యాహవము నలు పుట మిగుల హేయమైన కార్యమని యునవద్దానిని ఖురాను నిషే ధించెననియు, నా మూర్ఖులకు( బ్రబోధించిరి. వార లావచనముల విశ్వసించిరి.

మురాదు—ఆహా! నీ కౌశల మెంత యాశ్చర్యమైనది!

ఔరంగజీబు—కార్యసిద్ధి కొఱకొక్క యుపాయముపై నాధారపడి యుండుట యుచితము గాదు. బహు మార్గోపాయముల( బన్నినంగాని సఫలమనోరథులము కాంజాలము.

(మహమ్మదు ప్రవేశించును)

ఔరంగజేబు—తనయా! విశేషము లేమి?

మహమ్మదు—తండ్రీ! యశోవంతసింహుండు నిజశకటము నధిష్ఠించి, సైన్యసమేతముగ మన శిబిరమునకు( బ్రదక్షిణ మొనరించు చున్నాడు—మేము వానినిబట్టి బంధింతుమా?

ఔరంగజీబు—వలదు. అట్లు గావింపకుండు.

మహమ్మదు—అతండిట్లు ప్రదక్షిణము నేయుద్దేశ్యమున గావించు చుండెను?

ఔరంగజీబు—ఉద్దేశ్య మేమియు లేదు. యశోవంతుండు నిజకుల దర్పమును వెలిగించుచున్నాడు. ఆదర్పంబు కతననే యతండు పరాజితుం డయ్యెను. సైన్యసమేతముగ నేను నర్మదానదీతీర మును సమీపింపగనే యతండు నన్నాక్రమించినచో నాకు పరా జయము తప్పక గల్గెడిదే—నీవప్పటి కచటికి( జేరలేదు. నా సైని కులు మార్గశ్రాంతులై యుండిరి. అందుచే రిసపుత్రులు నన్ను

డీకొనుటకది తగినయదనై యుండెను. అట్లయ్యు, నట్టిస్థితియందు నన్ను ముట్టడించుట వీరోచితకార్యము గాదని చెప్పి యశవంతుఁడు నీయాగమనము కొఱకై ప్రతీక్షించియుండెను. తాకృశదర్పము గలవాఁడు నిక్కముగఁ బతితులగుదురు.

మహమ్మదు—మేమిపుడు యశవంతుని బట్టుకొనవలెనా?

ఔరంగజీబు—వలదు మన శిబిరప్రవేశనము యశవంతున కొకించుక యూఱట గల్గుచో, నొకమాటేమి, పదిమాఱు లట్లుగావింపనిమ్ము. తనయా! ఇక నీవరుగుము.

[మహమ్మదు నిష్క్రమించును]

ఔరంగజీబు—యుద్ధమనినఁ గుమారునకెంతయో యిష్టము. సోదరా! మనమహమ్మదు నిక్కముగ నిర్భీకుఁడుసుమీ. సరళోదారగుణములుకూడ వానియం దున్నవి... సరే, ఇఁక నేఁబోయి వచ్చెదను, నీవు విశ్రమింపుము.

మురాదు—మంచిది. దౌవారికా! తెమ్ము! సురఁదెమ్ము! వారిజాక్షిని గొనిరమ్ము!

[తెరపడును]

తృతీయదృశ్యము

వారణాసియందు సుజాసైన్య శిబిరము—రాత్రికాలము సుజా యాతని ప్రియురాలు పియారాయు, ప్రసంగించుచుందురు.

సుజా—సతీ! వింటివా? దారాపుత్త్రుఁడైన సులేమాను యుద్ధమందు నన్నెదుర్కొనవచ్చెను.

పియారా—మీ యగ్రజుండైన దారా నందనుఁడు ఢిల్లీనుండి వచ్చెనా? నిజమే? అట్లైన నతఁడు నిక్కముగఁ దనతో ఢిల్లీ లడ్డూలనుఁ గొనితెచ్చి యుండును. బిడాన మీరు వానికడకు సేవకు నంపుఁడు. ఊరక వెఱ్ఱిచూపు చూచుచుంటిరేమి? ఎవనినైన వెం

టనే బంపుఁడు.

సుజా—లడ్డూలతో యుద్ధమా!

పియారా—వానికిఁదోడు జిలేబికూడ నుండిన మఱియు బాగుగ నుండును. జిలేబిపైఁ గూడ నాకు మిగుల మక్కువగలదు. కాని ఢిల్లీ లడ్డువములు నా ప్రాణాధికములు. వాని మాధుర్య మనిర్వాచ్యమని వింటిని. ఒకమాఱు వానిని రుచిఁ జూచినవారు విడిచిపెట్టలేక వానిని దొరకినంతవఱకుఁ దినుట కూటలూరుచుందురు. ఎన్నఁడును వానిని దిని యెఱుఁగనివారు రేయింబవళ్ళు వానినే దలఁచుచు మునిశ్రేష్ఠులవలె ఘోరతపం బాచరించి బహుపర్యాయములు భగ్నమనోరథు లగుదురు. కావునం జేసి యవి లభ్యమైనచో మరల గావలయునను చింతయు, లభ్యము కానిచో వానికొఱకై నోఁచిపుట్టలేదను వంతయు ప్రాప్తంబగును. ఏవిధమున నైనను లడ్డువములబాధ యనివార్యమై యుండును. అందుచేఁ దినకుండ విచారించుటకంటెఁ దినియే యుమ్మలించుట శ్రేష్ఠతరము. కనుక బిఱాన లడ్డువములఁ గొనితేర భృత్యు నొకని నిప్పుడ బుత్తెంచుఁడు.

సుజా—ఊపిరి విడువకుండ నీవు లడ్డూలను గూర్చి గంభీరోపన్యాస మొసంగుటచే నా యభిప్రాయమును దెలుపుట కవకాశమే యింతవఱకు దొరకదయ్యె.

పియారా—తెలుపుటకు మీ కేమున్నది! మీ రెఱిఁగినది రణవిద్య యొక్కటియే!

సుజా—ఇఁకఁ దెలుపవలసినదాన వీవొకర్తుకవే గాఁబోలును!

పియారా—అవును. వనితలమగు మే మెట్లు పొందికగఁ జెప్పఁగలమో పురుషులగు మీ రట్లు వచింపనేరరు. ఏదేని వృత్తాంతము నెఱింగింప దొరకొని పలువిషయములఁ దాఱుమాఱుగఁ గల

గలువుజేసి వ్యాకరణదోషంబులఁ గుప్పతిప్పలుగ వెదఁజల్లుదురు. అందుచే—

సుజా—అందుచే ?

పియూరా—అందుచే నిఘంటువునందలి శబ్దంబులలో సగంబైనను మీర లెఱుంగరని విదుషీమణులమగు మేము మిమ్ముల నపహాసించుచుందుము. ప్రసంగించుచుండియే దెలుపవలసిన దాని నాకస్మికముగ మీరలు మఱచుచుందురు. అర్థవ్యక్తిశబ్దముల కంధవ్యాకరణముఁ దోడుపఱచి భాషామతల్లికంధత్వము దయచేసి మీరలు కాలక్రమమున నామెను గుంటెదానిం గావింతురు.

సుజా—నీ వక్తృత్వము మహాసముద్రమువలె నాకుఁ దోఁచుచున్నది.

పియూరా—మాగంభీరభాషణంబుల యర్థగాంభీర్యము నెఱుంగుటకు మీకు సామర్థ్య మెక్కడిది! మేధస్వినులమగు మమ్ముల మూఢులకు వ్యక్తులకు సంటఁగట్టి జనకులు మాకెంతయో యరిష్టము గూర్చుచుండిరి! మూఢులలోఁ గాఁపురము సేయుటకంటెఁ గాంతలకు సలసలఁ గ్రాగు నూనెలోఁ బడుట సుఖప్రదము.

సుజా—(విసుకిన గడ్డము సవరించుకొనుచు) ఇఁక నీ వాగ్ధోరణి యుగాంతమువఱకు ముగియదాయేమి!

పియూరా—కంఠీరవమునకు దంతములందును, ఏనుఁగకుఁ దుండమునందును, మహిషంబునకు శృంగములందును, అశ్వమునకు వెనుక కాళ్ళయందును, పంగవాసికిఁ బృష్ఠమునందును, ఆంధ్రునకుఁ బిక్కలందును, పల్లవాధరలకు జిహ్వయందును బలముండును.

సుజా—అంగనల బల మపాంగావలోకనమందే గాని జిహ్వయందు గాదు.

పియూరా—ఊరకొనుడు మీ కేమి తెలియును! అపాంగమువలనఁ

ప్రథమమునఁ గొంచెము కార్యము జరిగినను, దరువాత, మరణ పర్యంతము ప్రియునకుఁ దగు భయము గొలుపునది జిహ్వాయే కదా?

సుజా—ఇఁక నీవు నన్ను మాటలాడ నిచ్చునట్లు దోఁచుట లేదు. ఒకమా ఱూరకుండి చెప్పిన దేమియో వినుము.

పియారా—ఇదే పురుషుల దోషము! దీర్ఘోపోద్ఘాతము నొసఁగుచుఁ దుదకుఁ దెలుపవలసిన విషయమును మఱచి వెఱ్ఱిచూపులఁ జూచుచుందురు.

సుజా—మఱికొంతసేపటివఱకు నీ విట్టు లదే ధోరణిగ మాట్లాడు చున్నచో నే వనిసయట్లు చెప్పవలసిన విషయమును నేను బూర్తిగ మఱచిపోవుటకు సందియము లేదు.

పియారా—అట్లైన మీరు జెప్పిన దేమో గబగబ చెప్పుఁడు.

సుజా—ఇఁక—

పియారా—ఇఁక, గికయని యాలసింపకుఁడు. నుడువున దేమియో యతి సంక్షేపముగఁ దెలుపవలయును. ఒక్క గ్రుక్కలో నంతయు ముగింపవలయును.

సుజా—దారాపుత్రుఁడైన సులేమా నిఘను నన్ను నెదుర్కొన నరు దెంచెను. జయసింహ దిలీర్ఖానులు వాని ననుగమించి వచ్చిరి.

పియారా—ఒకమాఱు వారల విందునకుఁ బిలిచి, రసోపపన్నము లయిన శాల్యన్నంబుల మెక్కబెట్టుఁడు.

సుజా—చాలుచాలు! నీ కిదంతయుఁ బరిహాసంబుగఁ దోఁచుచున్నది కాఁబోలు. యుద్ధమువంటి భయానక కృత్యమునీకు నవ్వులాటవలెఁ గన్పట్టుచున్నదా యేమి?

పియారా—పిండివంటలఁ గావించుటలో నేను మిగుల నప్రమత్తనై యుందును. లేకున్న పాప మతిథు లజీర్ణ బాధచేఁ బీడింపబడుదురు.

ఇఁక మీరు చెప్పఁదలఁచిన దేమో జెప్పుఁడు.

సుజా—మహారాజా! జయసింహుఁ డిప్పుడే నా కడ కరుదెంచి షాజహాను చచ్చిపోలేదని చెప్పెను. చెప్పవలసిన దే మున్నది? చక్రవర్తి సంతకముగల యొక పత్రమునుగూడ నతఁడు నా కొసంగెను. ఆ పత్రమం దేమున్నదో యెఱుంగుదువా?

పియారా—త్వరగా జెప్పివేయుఁడు. ఇఁక నా కోపిక లేదు.

సుజా—ఇప్పుడైన నేను వంగదేశమునకు మగుడి చనినచో, నతఁడు నన్నుఁ దత్సమాధిపత్యమునుండి తొలఁగింపఁడఁట. లేకున్న—

పియారా—లేకున్నఁ దొలఁగించివేయును. ఇంతేనా! సరే! మన పీడయే వదలిపోవును! మీరు వచింపవలసినది ముగిసినదిగదా? ఇఁక నన్ను పాడుకొన నిండు.

సుజా—నే నేమి ప్రత్యుత్తర మొసఁగితినో యెఱుంగుదువా! సమరము సలుపకయే వంగదేశమునకుఁ దిరిగి పోదుననియుఁ, బితృప్రభుత్వమున కియ్యకొని, పిత్రాజ్ఞ శిరసావహింప సంసిద్ధుఁడను గాని దారాప్రభుత్వమునకు నే నొప్పుకొనువాఁడను గాననియు నుత్తరం బొసంగితిని.

పియారా—మీరు నన్నుఁ బాడనిచ్చునట్లు లేదు. మీ యిచ్చవచ్చిన తెఱంగున నేవియో వాగుచుంటిరి మీరు నాగానమును వినఁ దలఁచుకొనలేదా యేమి?

సుజా—పాడుము పాడుము. నే నూరకుంటిని.

పియారా—మీ రట్లే యుండి మాట నిలుపుకొనుఁడు. ఏమి పాడవలయునో చెప్పుఁడు

సుజా—నీ యిష్టము వచ్చిన ప్రేమగాథనుగూర్చి పాడుము. భాషారీతి, భావభంగి, బాగుగానుండి ప్రేమరసము దొలుకాడు గీతమును బాడుము. నీ గానామృతమును వీనులారఁ గ్రోలెదను.

(పియూరా గానము నారంభించును)

సుజా—ఉండు ముందుము! దూరమునుండి యేదియో శబ్దము వినవచ్చు చున్నది. అది మేఘసంఘర్షణ నిర్ఘోషమని తోచుచున్నది.— విను విను! ఏమి యీ రవము!

పియూరా—మీరు నన్నుఁ బాడనీయరు. నేను వెడలిపోవుచుంటిని.

సుజా—వలదు వలదు! నేనూరకుంటిని పాడుము.

పియూరా—

నిను నెడబాయకుండదవ నీరజలోచన! మోహనాంగ! నీ
వనయము నింద్రజాల మొకటూదర మొప్పఁగఁ బన్నినావు, నే
ననయము ప్రేమపూర్ణహృదయాంతరమందున నిన్నెఁ గొల్వఁగా
మనమున శాంతిఁబూనికను మానిమహానస ప్రోవుమా సఖా !॥

సుజా—ఈజీవన మొకసుషుప్తి. ఒకానొకస్వప్నము స్వప్నమురీతి స్వర్గమునుండి యవతరించిన యొకభంగిమ సూనుషుప్తి జాగరణము నతిమధుర మొనరించును! సంగీత సూనాకమండలి ఝుంకారము కాకున్న నింత మధురముగ నుండనేరదు!

(నేపథ్యమున ఫిరంగిశబ్దము వినఁబడును).

సుజా—(చకితుఁడై) అదేమి!

పియూరా—అవును! అదేమి! ఇంతరాత్రివేళ నింతసమీపమున ఫిరంగి శబ్దము వినఁబడుచున్న దేమి!—శత్రువు లింతలోనే వచ్చిరా!

సుజా—విను! విను! మరల వినఁబడుచున్నది! నీవిచట నుండుము! నేఁ బోయి చూచివచ్చెదను.

[నిష్క్రమించును]

పియూరా—ఏమి యీ ఫిరంగిధ్వానము-లు! ఎడతెగక వినంబడుచున్నవి! ఈ నిశీథమున నిట్టి సమున్కోలాహలము వినవచ్చుచున్న దేమి! ఏమి యీయస్త్రఝణఝణత్కారము!—గభీర రజనీకాంత

యాకస్మికముగ నుచ్చైస్స్వనమున నార్తనాద మొనరించు చున్న టులున్నది.!—ఓ! కర్ణపుటములు గింగురుమను చున్నవి!

(వేగముగ సుజాముపెలఁ బ్రవేశించును)

సుజా—సఖీ! ఆమహారాజు విశ్వాసఘాతుకుఁడాయెను! చక్రవర్తి సైన్యము మన శిబిరము నాక్రమించెను! నేను రణమునకుఁ బోవు చుంటిని. నీవు శిబిరాభ్యంతరమున కరుగుము. భయమేమియు లేదు.— [నిష్క్రమించును.]

పియారా—కోలాహలము క్రిమక్రమముగ నెక్కుడగు చున్నది—ఏమిది! ఏమిది! [నిష్క్రమించును.]

(నేపథ్యమునఁ గోలాహలము వినఁబడును.)

సులేమాను దిలీర్ఖాను లిరువైపులనుండి ప్రవేశింతురు.

సులేమాను—సుబాదారేడీ?

దిలీరు—అతఁడు నర్మదానదివైపునకుఁ బరువెత్తెను.

సులేమాను—వెంటనేపోయి వానినరికి పట్టుకొనుము!

(దిలీర్ఖాను నిష్క్రమించును. జయసింహుఁడు ప్రవేశించును).

సులేమాను—మహారాజ్! మనము విజయులమైతిమి.

జయసింహుఁడు—మీరు రాత్రియందే నదినిదాఁటి శత్రుశిబిరమును ముట్టడించితిరా?

సులేమాను—అవును. నేనట్లొనరింతునని యూహింపక పోవుట వారి దోసమే! కాని మన మీ యల్పకాలమందే విజయము నందఁగల మని నేఁ గలనైనఁ దలఁప లేదు.

జయసింహ—సుల్తాను సుజాసైనికులు రణసన్నద్ధులై యుండలేదు. సగముమంది సైనికులు నిహతులైనను, తక్కిన సగముమంది నిద్రించుచుండిరి.

సులేమాను—అది మన దోషముకాదు. ప్రకృతి యోధుఁడైన మా

పినతండ్రి నిశాసనమయాక్రమణ మసంభవము కాదని యెఱిఁగియుండ వలసినది.

జయసింహ—చక్రవర్తి పనుపున నేను వానితో సంధిగావించితిని. యుద్ధములేకుండ నతఁడు వంగసీమకు మగుడి పోవ సమ్మతించెను. ఇఁకఁ జెప్పునదేమి! వెడలిపోవుటకై యతఁడు పడవలను సిద్ధపరచుకొనెను—

(దిలీర్ఖాను పునః ప్రవేశము)

దిలీరు—సాహోజాదా! (అయ్యో!) సుల్తాను సుజాపరివారముగఁ బడవనెక్కి పలాయన మొనరించెను.

జయసింహ—ఆయలంకృత జలయానము వాసిదేనాయేమి!

సులేమాను—వెంబడింపుము—సైనికుల వెంటఁగొని బిఱానవానిం బట్టుకొనుము. [దిలీర్ఖాను నిష్క్రమించును.]

సులేమాను—మహారాజ్! ఈసంధినిమీ రెవరియాజ్ఞననుసరించిసలిపితిరి?

జయసింహ—చక్రవర్తి యాజ్ఞ ననుసరించి.

సులేమాను—ఈసంగతి జనకుఁడు నాకుఁ దెలుపలేదు! మీరుకూడ నాతో నేమియు వచింపలేదు—

జయసింహ—అదియుఁ జక్రవర్తియాజ్ఞయే.

సుజా—మీరొనరించిన దుష్కార్యమునకుఁ దోడనృతముఁగూడఁ బలుకుచుంటిరా!—ఇఁక నిటనుండి వెడలిపొండు!

[జయసింహుఁడు నిష్క్రమించును.]

సులేమాను—చక్రవర్తియాజ్ఞయొకటి, నాతండ్రిగారియాజ్ఞ వేరొకటియా! ఇదిసంభవమా!—అట్లేయగుచో, మహారాజును నిష్కారణముగ నిందించితిని. చక్రవర్తి నిజముగ నిట్టిశాసనము చేసి యుండునా!— "సుజానుబంధించి వెంటగొని ర"మ్మని జనకుఁడు నాకువ్రాసెను. ఏమైనఁ గానిమ్ము! నేను పిత్రాజ్ఞనే శిరసావహించెదను! పితాజ్ఞ

యీశ్వరాజ్ఞ కాదా!

[చతుర్థదృశ్యము]

యోధపురదుర్గము—ప్రభాతకాలము

(గాయకురాండ్రతోఁ గూడి మహామాయ నిలువంబడి యుండును.)

మహామాయ—చారణికాంతలారా! పాడుఁడు.

(గాయకురాండ్రతోఁ గలిసి మహామాయ పాడును.)

ఆ యశవంతసింహుఁడు, మహత్తర ధైర్యముఁబూని యేగె నా
నాయుధసాధనంబులను హస్తమునందు ధరించి నేర్పుమై
యాయుధముల్ ధరించిన మహా బలశౌర్యపరాక్రమాఢ్యులన్
సాయముగాఁ జేసికొని సంగరరంగమునందున్ బహూ
పాయములం బొనర్చుచును బ్రాణములందలి తీపి వీడి శౌ
ర్యాయితమూర్తియై యరిచయంబుల గొఱ్ఱెలరీతిఁ బట్టడం
జేయుచుఁ గాన, నాఁకొనిన సింగమువోలెను బొబ్బలెట్టుచున్
వాయుతరంగ సంచయమునన్ రణనాదము నేల నింగినిన్
మూయఁగ, శాస్త్రఖడ్గచయ భూరి ఝణంఝణ నాదమొప్పఁగా
నాయుధపాణులం దఱిమి యబ్బురపాటునఁ గూల్చె నెచ్చెలీ!
సాయకు ధీర భావమును బాయకు శౌర్యపరాక్రమక్రమం
బాయువు శాశ్వతంబె? భువి నాపద కాపుర ముండనోవునే?.

(దుర్గ ద్వారపాలకుఁడు ప్రవేశించును)

ప్రహరి—మహారాణీ! నమస్కారము.

మహామాయ—సేవకా! వార్తలేమి?

ప్రహరి—మహారాజు తిరిగివచ్చెను.

మహామాయ—జయోపేతుఁడై వచ్చెనా?

ప్రహరి—లేదు, పరాజితుఁడై యరుదెంచెను.

మహామాయ—ఏమి! పరాజితుఁడై వచ్చిన మానిసి యెవండు!

ప్రతీహారి—మహారాజు!

మహామాయ—ఏమి! యశస్సింహుఁడైన యశవంతుఁడు పరాజితుఁడై మగుడివచ్చెనా! ఇది నిక్కమేనా! యోధపురాధీశ్వరుఁడు!— యోధాగ్రేసరుఁడు—నావల్లభుఁడు యుద్ధమునం దోడి వెనుదిరిగి యరుదెంచెనా! క్షత్రియశౌర్య మిట్లధోగతి పాలైపోయెనా! అసంభవ మసంభవము! క్షత్రియవీరుఁ డెవఁడును రణంబునఁ బరాజితుఁడై మగుడిరాఁడు. నాప్రియుఁడు క్షత్రియకులచూడా మణి! ఆ వీరాగ్రణి పరాజితుఁడగుట కలలోనివార్త. పరాజితుఁడే యైనచో నాహృదయేశుఁడు కదనాంగణమందు మడిసియే యుం డును! మేటిమగండగు నామగఁడు సిగ్గిలుఁడై, ప్రాణముల నిల్పు కొనఁడు! మగుడి వచ్చిన భీరుఁడు వీరుఁడగు యశవంతుఁడు కాఁడు—నా పతిరూపముఁ దాల్చివచ్చిన మాయావి. ఆతని లోనికి రానీయకుము. పరాజితులకు నానిలయమున జోటులేదు. దుర్గ ద్వారమును మూసివేయుము—గాయకులారా! మీర లింకొక మాఱు పాడుఁడు.

ఆ యశవంతసింహుఁడు మహత్తరధైర్యము బూని యేగె నా నాయుధసాధనంబులను హస్తమునందు ధరించి నేర్పుమై

* * *

* * *

పంచమదృశ్యము

పరిత్యక్తప్రాంతరము—రాత్రికాలము.

ఔరంగజీ బేకాకియై యుండును.

ఔరంగజీబ్—ఆకాశభాగమంతయు జలధరాచ్ఛన్నమై యున్నది. జంఝామారుతి మింక వీవఁ దొడంగును. ఒకనదిని దాటితిని. ఇంకొక స్రవంతిభీషణమై యుల్లోలకల్లోలసంకులమై సమ్ముఖమున

గన్పట్టుచున్నది. ఈ మహాస్త్రసంతతి కద్దరిద్దరియొద్దు గాన్పించుట లేదు. ఈనావ మిగులఁ జిన్నదైనను, నెట్టులో మావలియొడ్డు సేర వలయును.

(మురాదు ప్రవేశించును)

ఔరంగజీబు—తమ్ముఁడా! విశేషములేమి?

మురాదు—లక్షమంది యశ్వారోహకుల తోడను, నూఱు ఫిరంగుల తోడను దారా సమరసన్నద్ధుఁడై యున్నాఁడు.

ఔరంగజీబు—అటులైన నే వినినవార్త నిక్కువమేనా?

మురాదు—నిక్కమే. వేగువాండ్రందఱ జీతీయుననే వార్తఁదెచ్చిరి.

ఔరంగజేబు:-(విచారము జేయుచు) అటులనా! ఏమి! మంచిది!

మురాదు—ఈ కొండ యవతలివైపున దారా తనసైన్యములు నిలిపి యున్నాఁడు.

ఔరంగజీబు—అవతలివైపుననే!

మురాదు—అవును.

ఔరంగజీబు—ఏమి! ఒక లక్షమంది యాశ్వికులును—

మురాదు—మన కెల్లి ప్రఖ్యాతమందే—

ఔరంగజీబు—ఉండు ముండుము. ఇపు డేమియు మాటాడకుము. కొంత తడవు నన్నాలోచించుకొననిమ్ము—దారా కింత సైన్య మెట్లు లభించెను! నూఱు ఫిరంగులా! సరే! మురాదూ! నీవిపు డరుగుము. నన్నాలోచించుకొననిమ్ము.

(మురాదు నిష్క్రమించును)

ఔరంగజీబు—ఇప్పటుల మగుడి చనినఁ జేటు మూడును! పరాక్రమించినచో నాశము తప్పదు. ఎదుట నరిష్టము, వెనుక ననర్థము! ముందు నూయి వెనుక గోయి! నూఱు ఫిరంగులా! ఒకవేళ— కాదు కాదు! అదిమాత్ర మెట్లగును! ఏమేమి! (దీర్ఘనిశ్వాసమును

విడిచి) ఔరంగజేబూ! ఈ మాట ప్రాపించునది నీ యుత్థానమా లేక పతనమా? పతనమా? అసంభవము. ఉత్థానమా? కాని యింకను దేనిని నాలోచింపవలయును? ఏమియు బోధపడుట లేదేమి?

(మురాదు ప్రవేశించును)

ఔరంగజేబు—నీవు మరల వచ్చితివేమి?

మురాదు—అన్నా! శత్రుపక్షమునుండి సమస్తఖాను నీ దర్శనము కోఱకై వేచియున్నాడు.

ఔరంగజేబు—అటులా? మంచిది. సనమ్మానపూర్వకముగ గొని రమ్ము. వలదు వలదు! నేనే స్వయముగ బోయెదను.

(నిష్క్రమించును)

మురాదు—ఈ సమస్తఖాను మా శిబిరమునకు రాగత మేమి! అన్నగారి మనసున నెట్టి యూహాలు పొడముచున్నవో దెలియ రాకున్నది. సమస్తఖాను విశ్వాసఘాతకుడు కాడుగదా! పవిత్ర చిత్తుడైన నా యన్న మోసగింపబడడు గదా! చూచెదగాక.

(పచారు చేయును)

(ఔరంగజేబు ప్రవేశించును)

ఔరంగజేబు—సోదరా మురాదూ! సైన్య సమేతముగ మన మీ మహూర్తమందే యాగ్రాకు బోవలయును.

మురాదు—ఏమి! ఈ రాత్రియందే?

ఔరంగజేబు—అవును! ఈ నిశీథమందే! మొల్లున్న శిబిరము నట్లే యుంచుము. దారా సైన్యముల మన మాక్రమింప వలదు. ఈ పర్వత పార్శ్వమున నాగ్రాకు బోవు మార్గ మొండుగలదు. ఆ మార్గమున నిరపాయముగ మనము పోగలము. దారా యేమియు శంకింపజాలడు. వానికంటె ముందుగ మన మాగ్రా

జేరవలయును. ప్రయాణ సన్నద్ధుఁడవు కమ్ము.

మురాదు—ఈ రాత్రియందే?

ఔరంగజేబు—ప్రశ్నోత్తరములకిది సమయము గాదు. సింహాసనము గావలయునేని రెండవమాట లాడకుము. కాలయాపనమైన మన యాశలన్నియు నడుగంటిపోవును. ఇది నిక్కమని నమ్ముము!

(ఉభయులు నిష్క్రమింతురు.)

## షష్ఠమదృశ్యము

ప్రయాగయందు సులేమాను శిబిరము—ప్రాహ్ణకాలము

జయసింహ దిలీర్ఖానులు ప్రసంగించుచుందురు.

దిలీర్ఖాను—మహారాజ్! ఇదపటిదినమందుఁ గూడ నౌరంగజేబే జయించెనను విషయము మెఱుంగుదురా?

జయసింహుఁడు—అతనికి జయలక్ష్మి ప్రసన్న యగునని నే నీవరకే యెఱుంగుదును.

దిలీరు—వమస్తఖాను విశ్వాసఘాతుకుఁ డయ్యెను. దానం జేసి యాగ్రాసంగరమున జరిగిన సమరమందుఁ బరాజితుఁడై దారా దోయారాభిముఖముగఁ బలాయన మొనరించెను. ముప్పదిలక్షల రూకలఁ గొని నూఱుగురు సేవకులు మాత్ర మతని ననుగమించిరి.

జయసింహ—అతని కట్టి పరాజయము ప్రాప్తించునని నేను బ్రథమమునందే యెఱుంగుదును.

దిలీరు—మీ రన్నియు నెఱుంగుదురు! పలాయన మొనరించు సమయమునఁ దత్తరపాటువలన దారా విశేషధనమును గొంపోవఁ జాలకపోయెను. కాని తరువాతఁ జక్రవర్తి యనేక స్వర్ణముద్రల నేఁబదియేను ఘోటకములపై భద్రముగ నిడి వానిని దారాకిఁ బంపి నాశ్వికులఁ బుత్తెంచెనుగాని మధ్యేమార్గమున జాట్లను

దస్యులు వారలఁ జంపి సొమ్ము విత్తమును హరించిరి.

జయసింహ—దారా దురదృష్టమువలన నట్లు జరిగెను; కాని వాని కట్టి దురవస్థ ప్రాప్తించునని నే నీవఱకే యెఱుంగుదును.

దిలీరు—విజయగర్వముతో నౌరంగజేబు మురాదు లిరువు రాగ్రాఁ బ్రవేశించిరి. దీనికి ఫలితము, ఔరంగజే బిపుడు చక్రవర్తి యని చెప్పవచ్చును.

జయసింహ—అవు నతఁడే చక్రవర్తి యగునని నేనీవఱకే యెఱుంగుదును.

దిలీరు—ససైన్యముగ సులేమానును కదలివచ్చినచోఁ దగుపురస్కార మొసఁగుదునని యౌరంగజేబు నాకుఁ గమ్మలిఖించెను. మీకు కూడ నతఁడట్లు లిఖించెనని తలంచెద.

జయసింహ—అట్లే యతఁడు నాకొక జాబువ్రాసెను.

దిలీరు—మహారాజ్! ఈయుద్ధఫలితము తుదకు రణమందెట్లుండునని మీయభిప్రాయము?

జయసింహ—నిన్నటిదినమున నేనొక జ్యోతిష్కునడిగి యుద్ధఫలము నిర్ణయింపఁ గలిగితిని. భాగ్యనభమునం దిపు డౌరంగజేబు తారయే యూర్ధ్వమున నున్నదనియు, దారా తార క్రమక్రమముగ నధోముఖముగ దిగిపోవుచున్నదనియు నామహిమంతుఁడు వాక్రుచ్చెను.

దిలీరు—మహారాజ్! అటులైన నిపుడు మనకు కర్తవ్యమేమి?

జయసింహ—కర్తవ్యమునకై నీవు విచారింపకుము. నేఁజేయున దంతయు నప్రమత్తుండవై వీక్షించుచుండుము.

దిలీరు—మంచిదట్లే కావించెదను. ఈవిషయములందు నాబుద్ధి చొరదు. కాని—

జయసింహ—ఉండు మూరకుండుము. సులేమానిటు వచ్చుచున్నాఁడు.

(సులేమాను ప్రవేశించును.)

జయసింహదిలీర్ఖానులు—వందేగీ సాహెజాదా! (అయ్యా! సలాము)

సులేమాన్—మహరాజ్! జసవంతుఁడు పరాజితుఁడై పలాయన మొనరించెను—ఇదిగో చక్రవర్తి పత్రమును చదువుఁడు.

[పత్ర మొసఁగును]

జయసింహ—(పత్రమును జదివి) అవును! మీరనినది నిక్కువమే!

సులేమాన్—జనకునకుఁ దోడ్పడ సైన్యసమేతముగఁ లాహోరుపొమ్మని సామ్రాట్టు లిఖించెను. దానంజేసి మనమిప్పుడే యిటనుండి కదలిపోవలయును. గుడారము నెత్తి సైనికుల కాదేశ—

జయసింహ—నిజంబంతయుఁ దెల్లంబగునంతదనుక నిందే యుంట యుచితమని నేఁదలంచెద. ఖాన్సాహెబూ! ఏమందువు?

దిలీరు—నాయుద్దేశ్యముకూడ నట్లే.

సులేమాన్—ఇంతకంటె నిక్కంబేమి కావలయును? స్వహస్తాక్షరములతోఁ జక్రవర్తి పత్రము లిఖించెనుగదా!

జయసింహ—చక్రవర్తి హస్తాక్షరములతో నీపత్రము నొరులెవ్వరో లిఖించియుందురు. సామ్రాట్టు ధైర్యరహితుఁడు—సామర్థ్యహీనుఁడు! దానంజేసి యతనియాజ్ఞ యొకయాజ్ఞ యని దలంపవలను పడదు. మీజనకుని యాదేశముల్లంఘించి మేమిటనుండి యొకయడుగైన గదల్పజాలము. దిలీర్ఖానూ! ఏమందువు.

దిలీరు—అవునవును! నిక్కమునిక్కము! మీరనినట్లే!

సులేమాను—పలాయితుఁడైన జనకుఁడెట్టియాజ్ఞనైన మీకెట్లీయఁ గలఁడు?

జయసింహ—అతఁడీసులేమానుచో వానిపైబడియుందున్న యౌరంగజేబు పనుపునకై మనమిపు డపేక్షించియుండవలయును. కాని యీవార్త సత్యమో యసత్యమో మేముముందుగ నెఱుంగవలయును.

సులేమాను—ఏమి! ఔరంగజేబుపనుపునకై—నాజనకునిశత్రుని పనుపునకై నే నపేక్షించియుండవలయునా?

జయసింహ—మీరపేక్షింప నిచ్చగింపనిచో నిక్కముగ మేమపేక్షించియుండవలెను. ఏమందువు దిలీర్ఖానూ!

దిలీరు—అవునవును! నిక్కము నిక్కము! మీరనిన ట్లే!

సులేమాను—జయసింహా! దిలీర్ఖానూ! అటులైన మీరిరువురు కుట్ర జేయుచుంటిరా?

జయసింహ—మాదోష మావంతయైన లేదు. సముచితశాసనము లేనిదే, యెట్టికార్యమునైన మేమెట్లు గావింతుము? యువరాజునకుఁ దోడ్పడ మేమెట్టియాజ్ఞను బొందియుండ లేదు.

సులేమాను—అట్టులైన నే నేయానతినొసఁగుచుంటిని.

జయసింహ—మీయాజ్ఞకులోఁబడి యుండుము. మీ జనకునియానతి నతిక్రమింపఁజాలము. ఏమనియెదవు ఖాన్సాహెబూ!

దిలీరు—అవునవును! నిక్కము నిక్కము! మీరనిన ట్లే!

సులేమాను—బోధపడినది, మీరలొక చక్రాంతమును గావించుచున్నారు. మీభావములందొక షడ్యంత్ర మిమిడియున్నది. మంచిది! నేనే స్వయముగ సైనికులకాజ్ఞ నొసఁగుచుంటిని.

[సులేమాను నిష్క్రమించును]

దిలీరు—మహారాజ్! ఇపుడిఁక నేమనెదరు?

జయసింహ—ఖాన్సాహెబూ! భయపడకుము. వెఱపొందుట కేమియు హేతువు లేదు. సైనికుల నందఱ నిదివఱకే వశపఱచుకొంటిని.

దిలీరు—మీవంటి విచక్షణాకర్మఠ వ్యక్తిని నేనెన్నఁడును వీక్షించియుండలేదు. కాని మనమిట్లాచరించుట విశేషమా?

జయసింహ—ఊరకుండుము. నీరవుఁడవై యిచ్చట జరుగనున్నదేమో నిలువఁబడి వీక్షించుచుండుము. అపుడే యౌరంగజేబుపక్ష

ముసకు బూర్తిగ నొసగియుంటిమని దలంపకుము. ఇంకను మఱి కొంతతడవు మనము వేచియుండవలయును. లేకున్న—

(సులేమాను ప్రవేశించును)

సులేమాను—సైనికులుకూడ నీకుబ్రియుండుగలిసిరి. మీయాజ్ఞనొసంగినగాని వారలొకడయినగదలరట!

జయసింహ—అవునది సహజమే!—ఏమనెదవు ఖాన్సాహెబూ!

దిలీరు—అవునవును! సత్యము నిత్యము! మీ రనిన ట్లే!

సులేమాను—జనకునకుం దోడుపడుమని చక్రవర్తి నాకు లిఖించెంగదా! దానంజేసి యెట్టులైన జనకుని జేర నాడెందము తొందరపడు చున్నది. ఈదీనుని మొఱాలకింపుండని మిమ్ముం వేడుకొను చుంటిని కదలి వచ్చుటకు మీ కిష్టములేనిచో నావెంట వచ్చుటకు సైనికుల కానతిండు. కరములజోడించి దారా తనయుండు మిమ్ముల వేడుకొను భిక్ష యిదియే! రాజ్యాపహారియైన యౌరంగజీబు శౌర్యమెట్టిదియో జూడ నువ్విళు లూరుచుంటిని. జయశీలము లైన నా సైన్యములవెంటం గొని యిప్పుడు కర్మక్షేత్రమందు నిలచినచో—మహారాజ్! ఖాన్సాహెబూ! ఆనతీండు! మీకు నాపైంజూపు కృపకుం గృతజ్ఞతాపూర్వకముగ నామరణము వరకు మీకు దాసుండనై యుందును.

జయసింహ—చక్రవర్తి యాజ్ఞలేనిదే మే మిచటనుండి యొకయడుగైన గదపంజాలము.

సులేమాను—దిలీర్ఖానూ! యువరాజునందనుండు నీకడ మోకరించి వేడుకొను భిక్షను నీవైన బ్రసాదింపలేవా?

(మోకరించును)

దిలీరు—సాహెజాదా (స్వామీ!) లెండు! మహారాజానతి నొసంగనిచో నే నొసంగకుచుంటిని. దారా యుప్పుడిని చేత జీవించుచుంటిని.

ముసల్మానులు విశ్వాసఘాతుకులు కారు. ప్రభూ! రండు. నా యధీనమున నున్న సైన్యమునంతయు వెంటఁగొని లాహోరుకు మీ వెంట వచ్చెదను. మీరు నన్నుఁ ద్యజింపనిచో మిమ్ము నేను ద్యజింపనని శపథ మొనరించుచుంటిని. అవసరంబగుచో యువరాజునందనునికొఱకై నేను నాప్రాణముల నైన విడువ సంకోచింపను. ప్రభూ! రండు! నే నీ మహామార్తమందే భటవర్గంబున కాజ్ఞ నొసఁగుచుంటిని.

[సులేమాను దిలీర్ఖాను లిరువురు నిష్క్రమింతురు]

జయసింహ—మూర్ఖుఁడా! దిలీర్ఖానూ! ఒక్క యల్పజలకణ మాత్రముననే కరగిపోతి వేమి! నీమంగళమును నీవే యెఱుంగఁజాలవైతివి! నే నేమిచేయుదు! నీకర్మము! ఇఁక నాయధీనమం దున్న సైనికులఁ దోడ్కొని నే నాగ్రాకు బోయెదను.

[నిష్క్రమించును.]

సప్తమదృశ్యము.

ఆగ్రాప్రాసాదము—ప్రాతఃకాలము

షాజహాను జాహానారాలు ప్రసంగించుచుందురు.

షాజహాను—తల్లీ! మిగుల నాత్రముతోనే నౌరంగజీబు రాకకై యెదురు జూచుచుంటిని. అతఁడు నానందనుఁడు. ఉద్ధతుఁడైనను అతఁడు నాయాత్మజుఁడేగదా! (కొంచెము నేవూరకుండి) లజ్జాకారకుఁడైనను పుత్రుఁడగుటచే నతఁడు గౌరవదాయకుఁడు కూడ గదా!

జాహానారా—తండ్రీ! అట్టి మిథ్యావాది, యట్టి విశ్వాస ఘాతుకుఁడట్టి పితృద్రోహి మీకు గౌరవదాయకుఁడగునా? ఆనాఁడు నేను వానిశిబిరాభ్యంతరమున కరిగినపు డతఁడు మీయందుఁ బ్రగాఢ భక్తిం జూపి, తాను ఘోరపాపము సేయుచుంటినని వాక్రుచ్చి బాష్పపూరితుఁడై చనుండయ్యెను. దారాపక్షావలంబకులైన శక్తి

మంత్రుల నామంబుల నెఱిఁగించినచో, సంశయమువీడి తాను పిత్రాజ్ఞ నౌదలఁ దాల్చి మురాదును ద్యజించి, దారాపక్షము నవలంబించెదనని వచియించెను. సరళస్వభావ నగుటచే మాయావియని యెఱుంగక విశ్వసనీయుఁడని తలఁచి, యభాగ్యుఁడైన దారాయొక్క హితైషుల నామధేయముల నాతనికిఁ దెలిపితిని. ఆక్షణమందే యాకూళ్ళ బిలబిల బోయువారలనందఱఁ గారాగారమందుంచెను. ఆవిషయమును దెలుపుచు, నేను దారాకొకజాబు వ్రాయ, వాఁడా కమ్మను మార్గమధ్యమున, చేజిక్కించుకొనియెను—అతఁడెట్టి ధూర్తుఁడో, యెట్టిదురాత్ముఁడో మీరెఱుఁగక పోలేదు.

షాజహాను—అమ్మా! అతఁడట్లొనర్పఁజాలఁడు. నీసోదరుఁడట్టిధూర్తుఁడని తలంపకుము. నీవచనముల నేను విశ్వసింపఁజాలను.

జహానారా—వానినొక మాఱీదుర్గమునకు రానిండు. నేర్పున నా ధూర్తుని బంధించెదను. ఈయాగారమందు, ఖడ్గహస్తులైన సైనికులు నూర్గురు రహస్యముగఁ గాచియుండిరి. మీయెదుటనే యాకూళను గట్టివైచెదను.

షాజహాను—అమ్మా! నీవట్లనరాదు. అతఁడు నాయాత్మజుఁడు! నీసోదరుఁడు. వాని నియ్యెడకు రానిమ్ము. ప్రేమ పూర్వకముగ నేను వానిని వశపఱచుకొందును. అందునఁగూడ వాఁడు వశుఁడుగాకున్నచో జనకుఁడనైన నేను నాతనూజుని మ్రోలమోకరించి ప్రాణభిక్ష వేఁడెదను. మనమేమియుఁ గోరమనియు, జీవములతో నిలువనిమ్మనియుఁ, బరస్పర ప్రణయమున నవకాశ మొసంగుమనియు నేను వానిని వేఁడెదను.

జహానారా—అట్టి యవమానమునుండి మిమ్ము నేను గాపాడెదను.

షాజహాను—అమ్మా! పుత్రుని భిక్షవేఁడు టవమాన మెట్లగును!

(మహమ్మదు ప్రవేశించును)

షాజహాను—నాయనా! రమ్ము. నీ నాయన యేడి?

మహమ్మదు—తాతగారూ! నే నెఱుంగను.

షాజహాను—అట్లనుచుంటివేమి! అతం డిచ్చోటకు వచ్చుటకై యశ్వారూఢుం డయ్యెనని వింటినే!

మహమ్మదు—అట్లని యెవరు వచించిరి? తురగము నారోహించి మహారాజుం గావింప జనకుం డక్బరుమసీదున కరిగెను. ఇచటకు రావలెనను నభిప్రాయ మతనికి లేదని నేం దలంచెదను.

జహానారా—అటులైన నీ విచటకు వచ్చుటకుం గత మేమి?

మహమ్మదు—ఈ ప్రాసాద దుర్గము నాక్రమించుకొనుటకు!

షాజహాను—నాయనా! తాతగారితోం బరిహాసము లాడుచుంటివా?

మహమ్మదు—దాదాజీ! ఇది సత్యముగాని పరిహాసము కాదు!

జహానారా—మంచిది! అట్లైన నేను నిన్నే బంధించెదను.

(ఈల వేయును. వెంటనే శస్త్రధారులైన సేవకు లైదుగురు ప్రవేశింతురు)

జహానారా—మహమ్మద్! అస్త్రము నొసంగుము.

మహమ్మదు—ఎందులకొసంగవలయును?

జహానారా—నీవు నా ఖైదీవి. భటులారా! వీనికడనున్న యస్త్రము నూడబెఱుకుండు!

మహమ్మదు—అటులైన నేనుకూడ నా సేవకులం బిలచెదను.

[ఈల వేయును. తోడనే పదిమంది దేహరక్షకులు ప్రవేశింతురు].

మహమ్మదు—రక్షకులారా! నా వేయిమంది సైనికుల నిచటికిం బిలుచుకొనిరండు!

జహానారా—వేయిమంది సైనికులా! దుర్గాభ్యంతరమునం బ్రవేశింప వారికనుమతి నెవరొసంగిరి?

షాజహాను——అమ్మా! యనుమతి నొసఁగినవాఁడను నేనే! దోషమంతయు నాయదియే! పత్రమంజారంగజేబు వాంఛించినవాని నన్నింటిని ప్రేమవశమున నేనొసఁగివైచితిని. మహమ్మదూ! ఇట్లగునని నేఁగలనైనఁ దలంపలేదు సుమీ!

మహమ్మదు——తాతగారూ!——

షాజహాను——ఇపుడు నేను బంధితుఁడనని గ్రహింపవలయునా?

మహమ్మదు——దాదాజీ! మీరట్లు భావింపకుఁడు. కాని మీరు వెలుపలికిమాత్రము బోరాదు!

షాజహాను——నాకేమియుబోధపడుటలేదు! ఇదియొక సత్యఘటనమేనా? లేక స్వప్నమా? నేనెవండను! నేను షాజహాను సార్వభౌముండనే? నాసమక్షమున కృపాణహస్తుండవై నిలచిననీవు నాపౌత్రుఁడవే? ——ఇదేమి! ఒక్కదినమందే ప్రపంచమందలి నియమమంతయుఁ దలక్రిందయ్యెనా! ఒకప్పుడెవని రోషకషాయితనేత్రములఁ గాంచి, యగ్గలంపు భీతినిఁదనయుఁడు నేలఁబొర్లాడెనో నేఁడు శృంఖలములతో నతనిబంధింప——(డగ్గుత్తికతో) ఏమి యీవైపరీత్యము! ఏమి యీదుర్నయము! అమ్మా! ఏది? తల్లీ! నీవిచటనే యుంటివా? జననీ! నీపెదవులట్లు కంపించుచున్నవేమి? పలుకుటకు నోరాడుటలేదా? ఇదేమి నీనేత్రములనుండి ప్రభారహిత స్థిరశూన్య దృష్టి బయలుదేరుచున్నదేమి? నీకపోలయుగము బూడిదవలె వెల్లనైయున్నదేమి!——ఇట్లుంటివేమి తల్లీ?

జహానారా——తండ్రీ! నాకొఱకై విచారింపకుఁడు——కాని అతఁడెట్లిటుగఁగలిఁగెను!——నేను దానినిమాత్రమే భావించుచుంటిని.

షాజహాను——మహమ్మదూ! ఇట్టిదురంతము, నిట్టి యత్యాచారము, నిట్టిశాఠ్యమును, నిస్సహాయుఁడనై యిట్లు కూర్చుండియుండి సహింపఁగలుఁగుదునని తలంచితివా? జరాభారమునఁ గృశించి

యున్న యీ కేసరిని నిర్భీకుఁడవై కాలితోఁ దన్నిపోఁగలుఁగుదు ననియే యోచించితివా? నేను ముదుసలినగుట నిక్కువమే! అట్లయ్యు, నీషాజహాను షాజహానే? యని ఎఱుంగుము!—ఎవరురా యచట? నాకత్తిని, డాలును నిటుగొనిరండు!—ఏరి? ఎవరునువచ్చుటలేదేమి!

మహమ్మదు—దాదాజీ! మీరక్షకులందఱు కోటవెలుపలికిఁ దఱిమి వేయఁబడిరి.

షాజహాను—వారలఁ దఱిమివైచినవాఁ డెవఁడు?

మహమ్మదు—నేను!

షాజహాను—ఎవరియాజ్ఞననుసరించి?

మహమ్మదు—పితౄజ్ఞననుసరించి! ఇపుడు నావేయిమంది సైనికులు మీకు రక్షకులై యుందురు.

షాజహాను—మహమ్మదూ! విశ్వాసఘాతుకా!

మహమ్మదు—నేను నాతండ్రిశాసనమును మాత్రమే పాదలఁబూనితిని!

షాజహాను—ఔరంగజేబూ! కాదుకాదు! నేఁడు వాఁడెక్కడ, నేనెక్కడ!—కాని బిడ్డా! ఇత్తఱి దుర్గము వెలుపలికరిగి యొకమాఱు నాసైనికులముందు నిలువంబడినచో, నాకై వెలువడు జయజయధ్వనులనువిని సహింపఁజాలక నిజశాత్యానలమం దౌరంగజేబు మ్రగ్గిపోఁగలఁడు!—ఒక మాఱావలికరిగిన యుత్తమముగనుండును!—వెలుపలికిఁబోవు టెట్లు!—మహమ్మదూ! ఇన్నొకమాఱు విడిచిపెట్టుము. ఒకమాఱే సుమీ!—ఒకమాఱే!

మహమ్మదు—దాదాజీ! నాదోషమేమియు లేదు. నేను జనకునియాజ్ఞానువర్తిని మాత్రమే!

షాజహాను—నేను నీజనకునకు జనకుండనుగానా? అతఁడు తన తండ్రికట్టిక్రూరత్వమును జూపుతఱి నీవేల నీపితౄజ్ఞ శిరసావహించె

దవు:—మహమ్మదూ ! నాపలుకుల నాలింపుము—దుర్గద్వార
ముసు దెఱువుము.

మహమ్మదు—దాదాజీ! నన్ను మన్నింపుఁడు. నేను పితృశాసనము
నుల్లంఘింపఁజాలను.

షాజహాను—నాయనా! నామాటవినవా? నా మొఱ యాలకింపవా?
నేను నీవృద్ధపితామహుండను గానా? రోగినై పడియున్న యీ
ముదుసలిపలుకులఁ బాటింపవా? జీర్ణకాయుఁడైన యీ దైవోపహ
తునిపై నీకు జాలివొడముటలేదా? ముదుసలినైన యీదీనునిపై
నీవుకూడఁ గ్రూరత్వము జూపవచ్చునా? తండ్రి! విశేషమేమియు
నిన్ను నే వేఁడుటలేదు. ఒక్కమాఱుమాత్రము దుర్గముబయటికిఁ
బోనిమ్ము. తప్పకమరల వత్తునని శపథముఁ గావించుచుంటిని!
—నాయనా! నీతాతవచనముల నాలింపవా? ఈయొక్కమేలును
గావింపవా?

మహమ్మదు—దాదాజీ! నన్ను క్షమింపుఁడు. మీ రెంత వేఁడినను
మిమ్ము నేను వెలుపలికిఁ బోనీయజాలను.

[పోఁబోవును]

షాజహాను—కుత్తా! నిలువుము. (ఒకించుక చింతించి, ప్రక్కనున్న
రాజమకుటమును, శయ్యపైనున్న ఖురానుపొత్తమును గొనివచ్చి)
తండ్రీ! చూడుమిది నాకిరీట, మిదినాఖొరాను. వెలుపలికిఁబోయి
ప్రజలయెదుట నీమకుటమును నీశీర్షమున నిడుదునని యీ పవిత్ర
గ్రంథమును స్పృశించి, సమయము నేయుచుంటిని. దీనికిఁ బ్రతి
వాద మొనరించు టెవ్వరికిఁని దరంబుకాదు. నేఁడునేను వృద్ధ
శీర్ణపక్షుపరిగువు నగుటసత్యమే! కాని షాజహాను చక్రవర్తి బహు
వర్షములు భారతవర్షమున నెట్టి భీషణశాసనము నెలకొల్పెనన,
నతఁడిప్పుడొకమాఱు భృత్యవర్గసమ్ముఖమున నిలువంబడెనంతనే

తద్భటబృందమాత్ర మిళితాగ్నిమయ-దృష్టికతన నొక్క యర
నిముసములో నిట్టియౌరంగజీబులు, నూరుమంది భస్మీభూతులై
పోదురు!]—మహమ్మదూ! నన్ను విడిచిపెట్టుము. నీవు భారతా
ధీశ్వరుఁడవు కాఁగలవు. ఇట్లు నేను శపథపురస్సరముగ వక్కా
ణించుచుంటిని. నామాటలు విశ్వసింపుము. శంకారహితస్వాం
తుఁడవుకమ్ము. ఒక్కమాఱా యౌరంగజీబును,ఆకపటిని విలోకింప
వాంఛించు చుంటిని. మహమ్మదూ! నా వేడికోలు నాలింపుము!

మహమ్మదు—దాదాజీ! క్షమింపుఁడు.

షాజహాను—బాలకా! ఇది బాలకుని క్రీడ గాదు. చక్రవర్తినగు
నేను స్వయముగఁ గొరాను స్పృశించి శపథము సలుపుచుంటిని.
ఇది మాత్రాప్రలాపము కాదని నమ్ముము. ప్రతిజ్ఞాపూర్వకముగ
వక్కాణించు చుంటిని — ఒకవైపున నీ పితౄజ్ఞ, మఱొక
దిక్కున భారత సామ్రాజ్యము! ఈరెంటిలో నొకదానినీ
ముహూర్తమందే యేఱుకొనుము.

మహమ్మదు—దాదాజీ! మీరు నూఱు చెప్పుడు వేయి చెప్పుడు
నేను పితౄజ్ఞా నిర్వాహకుఁడను. దాని నతిక్రమింపఁజాలను.

షాజహాను—ఒక సామ్రాజ్యమునకొఱకైనఁ గాఁజాలవా?

మహమ్మదు—సామ్రాజ్య మటుండనిండు. మహీతల మంతయు
నావశ మగుచున్నను, నేఁ బితృశాసనము నుల్లంఘింపఁజాలను.

షాజహాను—మహమ్మదూ! వివేచన మొనరింపుము! బాగుగ వివే
చన మొనరింపుము! భారతాధీశ్వరుఁడు—

మహమ్మదు—ఇఁక నే నీ నెలవున నిలువంబడి మీ వచనముల విన
నేరను. ప్రలోభనము మిగుల నధికమైనది! హృదయము కడు
దుర్బలమైనది! దాదాజీ! మన్నింపుఁడు.

[నిష్క్రమించును]

షాజహాను—వెడలిపోయెను! వెడలిపోయెను! కన్యా! విద్వేషిణివై పోతివేమి?

జాహనారా—ఔరంగజేబ్! నీ పుత్రుఁడు తన తండ్రి యానతిఁ బాలింప భారతసామ్రాజ్యమును గూడఁ దుచ్ఛముగ నెంచుచుండ, నీవు పితృద్రోహివై, పితృప్రాణము నిమిషమున త్రుంచివే కఠినాత్ముఁడవై మాయోపాయమునఁ గారాగారబద్ధుఁ గావించి వైచితివి!

షాజహాను—బిడ్డా! సత్యమును వాక్రుచ్చితివి. జహనారా! మీరు క్షుధార్తులై బిడ్డలకుఁ గూడు పెట్టకుఁడు. మీ తనయుల నంకమ్ములపైఁ బరుండ బెట్టుకొని వారిని జోకొట్టకుఁడు! తనూజుల చిరునవ్వును జూడ ప్రాణము మందహాసము సలుపకుఁడు! నందనులు కృతఘ్నులని విశ్వసింపుఁడు! కృతఘ్నతాంకురములు వారల హృదయములందు మొలకలెత్తెను. పుత్రులు శిశుభూతము లని నమ్ముఁడు! వారల స్తన్యాశనబాధచేఁ గుందఁజేసి పెంపుఁడు! ప్రభాతసాయాహ్నములందుఁ గరాఘాత దండతాడనములచే వారలఁ బీడింపుఁడు. క్రోధానల ప్రజ్వలిత నేత్రములతో సర్వదా శిక్షింపుచు, వారల నాజ్ఞాబద్ధులఁ గావింపుఁడు! అట్లొనరించిన, వార లీ మహమ్మదువంటి పితృభక్తులు కాఁజాలుదురు. వారల కిట్టి కఠినదండన మొసఁగుతఱి మీ హృదయమునందు దుస్సహ వ్యథ యుద్భవించుచో మీ గాయోదరము బ్రద్దలుగొట్టుకొనుఁడు! కన్నులనుండి బాష్పకణము లొలుకుచో మీ నాసికల నూడఁ బెరికివేయుఁడు. కంఠమునుండి యార్తనాదము వెలువడుచో, నిజ కంఠముల నులిమివైచుకొనుఁడు—ఓః—

[*These appalling imprecations of the distracted Shajahan are not quite different from those of the maddened Lear* ·]

Ingratitude, thow marble hearted fiend,
More hideous when thow show'st thee in a child

Than the sea-monster!

... ... ... ... ... ... ... ...

FILIAL INGRATITUDE!

Is it not as this mouth should tear this hand
For lifting food to't?

... ... ... ... ... ... ... ...

Here I disclaim all my paternal care,
Propinquity and property of blood,
And as a stranger to my heart and me
Old thee from this for ever
Again Shajahan's apostrphe to parents in general
Is not altogether different from that of Lear to Nature:
Here, nature, hear; dear goddess. hear!
Suspend thy purpose, if thow didst intend
To make this creature fruitful!
Into her womb convey sterility!
Dry up in her the organs of increase;
And from her derogate body never spring
A babe to honour her! If she must teem,
Create her child of spleen; that it may live,
And be a thwart disnatured torment to her!
Let it stamp wrinkles in her brow of youth;
With cadent tears fret channels in her cheeks;
Turn all her mother's pains and benefits
To laughter and contempt; that she may feel
How sharper than a serpent's tooth it is
To have a thankless child!

[The reader would perceive that, just as Lear had the thought of the ingratitude of Goneril in his mind, Shajahan, in the same way, had in his mind the thought of Aurangzeb's ingratitude when the fiery exclamations bursted out from his blazing heart.]

జాహాంగీరా—జనకా ! ఈ కారాగృహకోణమందు గూర్చుండి యసహాయశిశువువలె నేడ్చుచుండిన నేమియుఁ బ్రయోజనము లేదు! కాలితోఁ దన్నఁబడిన కుంటివానివలె నేలఁ గూలి పండ్లుగొఱుకుకొనుచు శాపవృష్టి గురిపించిన నేమియు లాభము లేదు! పాపియైన మామూర్ఖుని మాడ్కినంతిమసమయమున నొకమాఱీశ్వరు నుద్దేశించి, 'దయామయా !' యని సంబోధించిన నేమియుఁ బ్రయోజనము లేదు! లెండు! ద్రళితదర్వీకము భంగిపడగ యెత్తుకొని లెండు! ఈనినపులివలెఁ బ్రమత్తవిక్రమమున గర్జించి లెండు! అత్యాచారత్మీ ప్తజాతిచందమున నుద్రేకులై లెండు! నియతివలెఁ గఠినులు కండు ! హింసకరణి యంధులుకండు! భూతము భంగిక్రూరులు కండు! లేకున్న మీ రా భయానకభయానకముతోఁ జాలియుండఁ జాలరు.

షాజహాను—మంచిది! అ ట్లగుచో, నట్లే యయ్యెదను! అమ్మా ! నీవు కూడ నాకుఁ దోడ్పడుము. స్ఫులింగముచాడ్పున నేను జ్వలింప, వాయువువలె నీ వా జ్వాలను మఱింత సముజ్జ్వలిత మొనరింపుము ! భూకంపము భంగి సామ్రాజ్యమును నేను విచూర్ణము గావింప, శరధిసలిలోచ్ఛ్వాసములీల నీవా చూర్ణీకృత సామ్రాజ్యమును మ్రింగివేయుము. నేను సమరమును గల్పించెదను;—నీవు భీషణవ్యాధిని జన్మింపఁజేయుము ! ర మ్మొక మాఱు సమస్త సామ్రాజ్యమును దలక్రిందుఁ గావించి వేయుదము! బీభత్సము నుద్భవింపఁజేయుదము!—తదుపరి యొందరగుదము!—యొం దరగిన నేమి ! ఖద్యోతము—కరణి నొక మహాజ్వాలయందూర్ధ్వమున కెగిసి—ఘోరహాహాకారము సలిపి శూన్యమందు మ్రగ్గి యదృశ్యులమై పోదము !

శ్రీ

# షాజహాన్

## ద్వితీయాంకము

### ప్రథమదృశ్యము

మథురయందలి యౌరంగజేబు శిబిరము—రాత్రికాలము

(దిల్దారేకాకియై యుండును.)

దిల్దారు— మురాదూ! ఎట్లు నీవు మెల్లమెల్లగ నధోగతి పాలగు చున్నావు? జడమతివై నీ వేతెఱంగున సురాప్రవాహమున గొట్టుకొని పోవుచున్నావు? ఆప్రవాహముపై నర్తకీరమణుల విచిత్రాభినయము లెట్లు జంఝామారుతము నుద్భవింపఁ జేయుచున్నవి! నీ వింకను గ్రుంకిపోదువు? ఇఁక విలంబము లేదు. మురాదూ? నిన్నుఁ గాంచి నే నపుడపుడు కడు విచారించుచుందును! నీ వెట్టి సరళస్వభావుఁడవు! ఎట్టి యమాయకుఁడవు! షాహజాదీ ప్రేరేపణమున (జహనారా ప్రేరేపణమున) నీ వౌరంగజేబును మాయోపాయమున బంధింప దొరకొంటివి! నీటఁజొచ్చి మహాగ్రాహంబుతోఁ బోరాడుటకు నీ వెంతవాఁడవు? నేఁ డాయత్నమునకు ప్రతిఫలము గల్గును! ఓహో! దేవర యిట్లే యరుదెంచుచున్నారు.

(మురాదు ప్రవేశించును.)

మురాదు—దాదా యింకను నమాజు సలుపుటలేదేమి!—దాదా యెల్లప్పు డాధ్యాత్మికవిషయ చర్చలందే మునింగి యుండును గదా! కాని దాదా యైహిక సుఖంబులఁ గోరఁడేమి!—దిల్దారు దాదా!

దిల్దారు—ప్రభూ ! మీనములకుఁ బొలనులుండక ఱెక్కలున్న, నవి కూడ నెగురఁగలవేమో యని తలఁచుచుంటిని.

మురాదు—అరే ! మత్స్యములకుఁ బక్షములుండిన, నవి కూడ శకుంతములే యగును! నీ కీపాటి జ్ఞానములేదా ?

దిల్దారు—అట్లా! స్వామీ! ఇట్లని నే నింతకుపూర్వ మెఱుంగను. అందుచేఁ జిక్కునఁ బడిపోతిని. భవదనుగ్రహంబున నిపుడంతయుఁ దెల్లమయ్యెను—కాని ప్రభూ ? అంచయను పక్షిని మీరు చూచి యుందురుకదా ! నిక్కముగ నాపక్షి నీటియందె ట్లవలీలగ నీఁదులాడఁగలదో, భూమిమీదఁ గూడ నట్లే చరింపగలదు; భూమిపై నెట్లు చరింపఁగలదో యాకసమం దట్లు విహరింపఁగలదునుఁడీ !

మురాదు—అరే మూర్ఖా! నీవు చెప్పుదానికిని వర్తమానవిషయమునకును సంబంధమేమిరా ?

దిల్దారు—దయామయుఁడగు దేవుఁడు మరాళంబునకుఁ గ్రింద నడచుటకు రెండుకాళ్ళ నొసఁగెను. హంసను గాంచినపుడెల్ల నీ విషయము బాగుగఁ దెల్లమగును.

మురాదు—తెల్లముకాదా!

దిల్దారు—కాని ఆచరణయుగమును గూర్చి యాలోచింపగా, దాని మస్తకమును సరిగ నిలుపు టశక్తమగును—అయితే ప్రభూ! ఈశ్వరుఁడు పశువులకుఁ దలను ముందుంచి, వాలమును వెనుకనుంచి నాడెందుకో?

మురాదు—అరేమూర్ఖా! వాని ముఖములు వెనుకనుండినచో, వెనుక భాగమే ముందగును.

దిల్దారు—ప్రభూ! మీరుసరిగా సెలవిచ్చితిరి—కాని శునకము తన తోక నెందులకాడించును? దీని కారణము మిగుల గొప్పది కదా?

మురాదు—ఆ గొప్ప కారణమేమి?

దిల్దారు — వాలముకంటె శ్వానమునకు బలమధికమగుటచే, నది దాని నాడించు చుండును. కాని శునకముకంటె వాలమున కెక్కుడు శక్తియున్నచో, వాలమే శునకమునాడించు చుండునుగదా!

మురాదు — (నవ్వుచు) హాః హాః హాః — ఓహో! మాయన్న యిటు వచ్చుచున్నాఁడు. అన్నా! రమ్ము

[ఔరంగజేబు ప్రవేశించును].

ఔరంగజేబు — తమ్ముఁడా! సత్వరమే వచ్చితివే! అదుగో! నీవిదూషకుఁడు కూడ వెంటనే యున్నాఁడు!

మురాదు — అవును. అన్నా! ఇట్టి మిత్రపుంగవులును, నర్తనక్రియానిపుణలైన వారకాంతలును, లేకున్న, సమయము గడచుటెట్లు!

ఔరంగజేబు — నీవనినది నిక్కువమే! ఎచట నుండియో నిన్నటి దినమున ననన్యసామాన్య లావణ్యవతులైన వేశ్యవనిత లరుదెంచిరి. సర్వకాలములందును సౌధాభ్యంతరమున గూర్చుండి తత్త్వవిచారమునల్పు నేనావాల్గంటుల కవజ్ఞసూపుదును. నాయుల్ల మెప్పుడును మక్కాకడకే బర్విడుచుండును. ఆమత్తకాశినులు నీహృదయమును రంజింపఁగలరని తోఁచెడిని. ఆమోహనాంగుల యధరామృతంబునకుఁదోడు మధురమైన మధువుకూడ నుండిన నీవు సంతోషింతువని తలంచి విశ్వసనీయుఁడైన భృత్యునొకనిఁ బంపి గోవాయందలి దొరల కడనుండి కొన్ని సురాపాత్రలఁ దెప్పించితిని! ఈమద్యమెంత రుచిగలదో యెఱుంగుదువా?

[సురాపాత్ర నొసఁగును.]

మురాదు — ఏది ఏది!! [గాజుగిన్నెలో మద్యము బోసి, గుటకెక్కుడు మధువును గ్రోలి] వహా వ్వా! ఏమి మాధుర్యము! ఓహోహో హో! ఏమిరుచి!! [దిల్దారుదాదా! చూచుచు నిలువఁబడితి వేమి! కొంచెము పుచ్చుకొనెదవా యేమి?]

దిల్దారు—మహాప్రభూ! జంతువు లన్నియు నెల్లప్పుడు ముందునకే నడుచు నేమి?

మురాదు—వెనుకవైపున కేల నడువవనియా?

దిల్దారు—తెలిసినది! తెలిసినది! వాని నేత్రములు రెండును ముందు వైపున నుండుటచే నవి యట్లు నడచును. కాని యంధులైనవారు, ముందుకు నడిచినను, వెనుకకు నడచినను నొక్కటియే!

మురాదు—వహవ్వా! దొరల సారా యెంత మజాగా నున్నది! [త్రావుచు, సోదరు నుద్దేశించి] నీ వొకించుక రుచి చూచెదవా?

ఔరంగజీబు—నేను రుచి చూడను. నేను సురాపాన మొనరింపనని యెఱుంగవా? ఖురాను మధుపానమును నిషేధించినది.

దిల్దారు—అంధుఁడా! మేల్కాంచుము. నీకు రేయింబవళు లొక్కటి యైనను—

ఔరంగ—ఛీ ఊరకుండుము!

మురాదు—ఖొరాను నందలి నిషేధముల నన్నింటిని పాటించినచో, నీ ప్రపంచమందు బ్రదుకుట కష్టము [త్రావును]

దిల్దారు—గంధగజేంద్రమున కెంత దేహబల మున్నదో యంత బుద్ధిబలముకూడ నున్నచో, నది మిగుల బుద్ధిగల జంతువే యగును! అట్లగుచో, మాతంగముపై మావటీఁడుగాక, మావటీని పైమాతంగమే యెక్కి కూర్చుండి యుండును. బలిష్ఠశరీరముగల యేనుఁగు తన తుండము నాడించుచు నటునిటు తిరుగుచుఁ గాలము పుచ్చును—వోః!

ఔరంగ—మురాదూ! నీ విదూషకుఁడు మిగుల రసికుండు సుమీ!

మురాదు—అతఁ డొక రత్నమే! ఏరీ! ఆటకత్తె లేరీ?

ఔరంగ—ఈ సమీపశిబిరమందే విడిసియుండి నీ దర్శనార్థమై యుస్సీళు లూరుచుండిరి! నీ వొకమారు స్వయముగఁ బోయి,

స్త్రీ సుందరాననము నా సుందరీమణులకుఁ జూపి నర్తనాది విలాసములందుఁ దేలియాడుము!

మురాదు—మంచి దిప్పుడపోయి యా కాంతల వీక్షించి వచ్చెదను! విదారణమం దేమి, విలాసమం దేమి మురాదు మహాశయుఁడు వెనుకంజ వేయువాఁడు కాఁడు!

[నిష్క్రమించును.]

దిల్దారు—“అంధుఁడా! మేల్కాంచుము” (అని మురాదు ననుగమింప నుద్యమించును)

ఔర—(అడ్డుకొని) “నిలువుము నిలువుము! నీతో మాటలాడవలెను!”

దిల్దారు—ఓయి నాయనా! నన్నుఁ గొట్టకుము! దండింపకుము! శిక్షింపకుము! నాకు సింహాసన మక్కఱలేదు. మక్కా యక్కఱ లేదు! నాకు డొక్క నిండినఁ జాలును! నారాజ్య మంతయు నీ కిచ్చివేయుదును. పుచ్చుకో! పుచ్చుకో! పుచ్చుకో! పుచ్చు—

ఔరంగ—ఛీ! ఊరకుండుము. నీ వెవఁడవో నిజము చెప్పుము. నీవు విదూషకుఁడవు మాత్రమే కావు. ఎవఁడవో తెలుపుము. నిక్కము వచింపకున్న.—

దిల్దారు—అయ్యో! మహాశయా! నేనొక గొప్పదొంగను! మోసకాఁడను! బందెపోటుదొంగను. ముఖస్తుతిఁ గావించుటే నాయుద్యోగము. దౌర్జన్య మన నాకెంతయో యిష్టము! పరుల వంచించుటలో నేను నిపుణుఁడను! నేను శుద్ధబుద్ధావతార మను దున్నపోతువలె మెక్కఁగలను! కోఁతివలెఁ జిందులు ద్రొక్కఁగలను! గాడిదవలె నఱవఁగలను! పందివలె దొర్లఁగలను! పిల్లివలె “మ్యావు! మ్యావు! మ్యావు! మ్యావు!” మనఁగలను; కుక్కవలె “బౌయ్! బౌయ్! బౌయ్! బౌయ్!” మని మొఱుఁగఁలను! గుఱ్ఱమువలె నేను సకిలింపఁగలను! నేను మొద్దునంటే ముద్దును! నామాట నమ్ముఁడు. నమ్మ

క్షపోయిన నాకేమియు దిగఁబడదు! మజ్జీ! మజ్జీ! (తలఁగోకికొనుచు) నేనుదిమ్మకొక్కువలెఁ బడియుందును! కుక్కకంటె నెక్కుడైన నా కుడుగాఁడను! పిచ్చుకకంటె జులాయివాఁడను! నేను సంగీతమందు గొప్పవిద్వాంసుఁడను! మాగురువులు గార్దభస్వాములవారు! బత్తిగారుమాసహాధ్యాయులు! వినండి! నాపాటవినండి! నేనన్ని రాగములనుమిళాయించఁగలను! వినండి! ఆలకించండి, అరె రే రే రీ రీ రో రోనో నో ర్మార్మా ఝా యా యా మ్యావ్రా వ్యావ్రా భోయి భోయి భోయి—

ఔరంగ—ఛీ! ఊరకుండుము. నేను పరిహాసప్రియుండను గాను. నీవేమిపనులఁ జేయఁగలవు?

దిల్దారు—నేనేనా! నేనా! నేనటండీ! అహా! నేనా! నేనే! ఏమిటీనేనే! ఓహో! నేనా! నేనంటే నేనే! —మాబాగాసెల విచ్చారు! నేనే—

ఔరంగ—ఛీ! నోరుమూసుకొనుము. ఏమి పనులఁ గావింపఁగలవో చెప్పుము.

దిల్దారు—(రెండుచేతులతోను నోరు మూసికొని, నీరవుఁడై యుండును)

ఔరంగ—ఏమిపనులఁ జేయఁగలవో చెప్పవేమి?

దిల్దారు—నేనన్ని పనులను జేయఁగలను! నేనన్ని పనులను, జేయఁజాలను! నేనేపనినైన జేయఁగలను! నేనేపనియుఁ జేయఁజాలను! కాని చేతనైన, బుద్ధిపుట్టిన, మనసుకుదిరిన, నాకు నచ్చిన, నాకే తోచిన, నాకిష్టమున్న, నాకు వీలైన, నేనేదేని పనిని గావింపఁగలనేమో యెవరినైన నడిగి చెప్పెదను. కాని పనులఁ బాడుజేయువారలలో నగ్రగణ్యుఁ డెవఁడనిన నేనేయని చెప్పవలయును! నే ముట్టిన వన్నియు నిముసములో నాశనమైపోవును! దగ్ధమైపోవును! ధ్వంసమై పోవును. భగ్నమైపోవును! ఎవ్వరైన దమయిష్టము

వ్రచ్చినట్లు, నాకు నచ్చినట్లు, తలవాచునట్లు చీవాట్లు పెట్టిన యెడల నే నేపనినైన, నప్పుడు నాకుఁ దెగులు లేకున్నచో నాకు రొంపపట్టక పోయినచోఁ గడుపునొప్పి రాకపోయినచోఁ, గాలులో ముల్లు విరుగకపోయినచో నాలుక పూయకపోయినచో మా వారందరు క్షేమముగానున్నచో, మాకొంప తగులఁబడిపోకపోయినచోఁ, దెలిసికొనగలను. అంతకంటె?—అంతకంటె!- నేనేమియుఁ జేయలేను! చిత్తగించినారా? మహాప్రభూ! దేవరా! స్వామీ! మహానుభావా! మహాశయా! మహాత్మా! అఖిలాండకోటి బ్ర—

ఔరంగ—ఛీ! ఊరకుండుము నీయవసరము నాకుఁ బెద్దగ నుండును. నీవు మొఱకువాఁడైన మురాదును వదలి నాకడనే యుండుము— ఏమియు భయము లేదు.

దిల్దారు—భయము లేదు! భక్తి లేదు! భరసా లేదు! బాగు! బాగు! బాగు. బాగు. బాగూ!- (పాడుచు గంతులువైచును)

(వారకాంతల వెంట నిడుకొని మురాదు ప్రవేశించును).

మురాదు—షహాబ్బా! చూడుమజా! ఆడండి! ఆడండి! పాడండి! "పురుషులా నమ్మరాదూ—" పాడండి "చేతులోఁ జేయివైచి" పాడండి "చెంతకూ జేరాదీసీ—" పాడండి! పాడండి! ఆడండి! చమత్కారముగా నాడండి!

ఔరంగ—అటులైన నీవిఁక విలాసవార్ధియందు మునింగియుండుము. నేఁ బోయెదను. నీ విదూషకుని వెంటఁ గొనిపోయెదను. అతని వచనములు నాకు విశేషామోదకరములై యున్నవి!

మురాదు—అట్లా! ఏమీ! నిజమే! షహబ్బా! వాఁడొక రత్నమని చెప్పితినిగదా! మంచిది! కావలయుచో, నీవు వానిని దోడ్కొని పొమ్ము, వాని చెలిమికంటె మంచి చెలికారము నాకు లభించినది!

[దిల్దారు సహితుఁడై యౌరంగజీబు నిష్క్రమించును.]

మురాదు—వారకాంతలారా! ముందొకమాఱు పాడుడు! పిదప నాడుడు! పిమ్మట పాడుడు! పిదపనాడుడు!
అంత సుధాకరుండు జగ మంతయు వెన్నెలచ్ఛాతఁబూయఁగా
గాంతివిలాసరేఖలను గాంచుచు కన్నుల విందుగొల్పనే
కాంతమునందునున్న మిము గన్గొని వచ్చఁగ సాహసించియున్
గాంతల మాటచేఁ గృప స గౌరవ మొప్పగ నాదరించి య
త్యంతవినోదలీలల ముదంబునఁ దూగఁగఁ జేయుచున్ దమిన్
జెంతను జేర్చి ప్రేమలత చెల్మిని నాటగఁ గౌగలించి య
శ్రాంతము గాఢరాగమున రాగము మీఱఁగ పూలపాన్పులం
దింతుల భాగ్యరేఖలు ఫలింపగ మించిన నృత్యగానముల్
సంతస మొప్పఁగా విని వసంతము నెంతయు జల్లుమన్ మనః
శ్శాంతిని వేఁగనీయఁగదె సారసలోచన! చిత్తహారిణీ!
మురాదు—[నర్తకీరమణుల నాట్యము విలోకించుచు 'శబాస్ శబాసు' అని సురాపాన మొనరించుచు జోగిజోగి నిద్రితుఁడౌను]

[వారకాంతలు వెడలిపోదురు కొందరు సేవకుల వెంటనిడుకొని యౌరంగజేబు ప్రవేశించును.]

ఔరంగ—పెడరెక్కలు విఱిచి కట్టుఁడు!
మురాదు—ఎవరు! ఎవరు! అన్నా! ఇదేమి! ఏమి యీ విశ్వాస హీనత—!(లేవఁబోవు తుళ్ళిపడి నేలఁగూలఁబడును.)
ఔరంగ—కట్టుఁడు! కొట్టుఁడు! కట్టునీయకున్న వధింప సంకోచింపకుఁడు!

(సేవకులు మురాదు చేతుల వెనుకకు విఱిచికట్టుదురు)

ఔరంగ—భృత్యులారా! ఈ శుంఠను మీ రుబితాన నాగ్రాకు గొనిపోయి, మహమ్మదు అసఘానుల యధీనమందుంచుఁడు. నే నిప్పుడే నా తనయునకు జాబు లిఖించుచుంటిని.

మురాదు—మర్కటీ! దీని ప్రతిఫల మనుభవించెదవు! నేను నీ పని పట్టఁగలను!

ఔరంగ—(భృత్యుల నుద్దేశించి) త్వరగాఁ గొనిపొండు!

(భృత్యులు మురాదును బట్టి యీడ్చుకొనిపోదురు).

ఔరంగ—ఈశ్వరా! నా కరములఁ బట్టుకొని, నీవు నన్నెచ్చటకుఁ గొనిపోవుచుంటివి? నాకీ సింహాసన మక్కఱలేదు! నీవు నాబాహువులఁ బట్టుకొని సింహాసనాసీనుని గావించితివి! ఎందులకో నీవే యెఱుంగుదువు!

[నిష్క్రమించును.]

## ద్వితీయ దృశ్యము.

ఆగ్రాదుర్గప్రాసాదము—ప్రభాతకాలము.

షాజహా నేకాకియై యుండును.

షాజహాన్—ఉదయపర్వతమున నరుణప్రభాభాసమానుండై, సహస్రమయూఖుం డుదయించెను. నీ రజాపుత్రుఁడు పూర్వము వలెనే యుజ్జ్వలుండై, రక్తవర్ణుండై యుండెను! వియత్తల మిపుడుకూడ నీలమై యున్నది. యమునాస్రవంతి యథాపూర్వముగఁ గ్రీడామయియై కలస్వనమొనరించుచున్నది! ఈ నదీతీరమునందున్న మహావృక్షము లెప్పటియట్లు పత్రశ్యామలములై ప్రసూనోజ్జ్వలములై గన్పట్టుచున్నవి! పుష్పనికుంజముల యపూర్వసౌరభభారంబును వహించి సమీరుండెప్పటి యట్ల యలసగమనంబున నంతట సంచరించుచున్నాఁడు! క్రిక్కిఱిసిన చివురు జొంపంబులు శైశవము నుండియు నే వీక్షించు తెఱంగుననే యున్నవి! సర్వదృశ్యములు బూర్వమట్లే యున్నవి! కేవలము నే నొక్కఁడనే మాఱిపోతిని! (గాఢస్వరమున) నేఁడు నేను నా కుమారుని చేతులలో బందీనై

యుంటిని! అబలనై నసహాయుండనై శిశుప్రకృతిని మర్త్యుండనై యుండి యొకప్పుడు క్రోధ మూర్ఛిత మానసుండనగుచు గర్జించు చుంటిని. కాని శరత్కాల మేఘ గర్జనము మాడ్కి సిప్పాల హాహా కారమై యది యంతరించుచున్నది. నిజశక్తివయాస్ఫాల నంబు కతన జీర్ణించిపోవుచుంటిని! ఆహా! భారత రాజరాజేశ్వరుం డగు షాజహానునకు నేఁడెట్టి యవస్థ వాటిల్లినది! [స్తంభముపై బాహువునిడి దూరమందున్న యమునానది వైపు దృష్టులసారించి] ఓ! ఇదేమి నిర్ఘోషము! ఏమి యీ ఘోర ధ్వానము! ఏమిది! మరల మరల వినఁబడుచున్నది! (ముందుకుఁ జూచి) ఇదేమై యుం డును!—(ఆగి) అమ్మా! వచ్చుచుంటివా! అమ్మా! రమ్మా!

(జహానారా ప్రవేశించును).

షాజహాన్—తల్లీ! ఆ వినవచ్చుచున్న నినదమేమి? ఈ శబ్దపరంపరలు నీకు వినవచ్చుచున్నవా! (ఔత్సుక్యముగ) దారా నిజసైన్యముల తోడఁ గూడి జయజయధ్వానముల సలుపుచు నాగ్రా బ్రవేశించెనా యేమి! పుత్రారత్నమ్మా! ఈ సర్వయావిచారాత్యాచార నృశంసత లకుఁ దగు ప్రతిశోధముఁదీసికొమ్ము!—తల్లీ! నిమీలితనేత్ర వైతి వేమి! మంచిది! గ్రహించితిని!—ఇది దారావిజయ ఘోషణము కాదు. ఒక నూతన దుర్వ్యధాసూచక ధ్వనియై యుండును. ఏమనెదవు?

జహానారా—జనకా! అవును.

షాజహాన్—దురదృష్ట మొంటరిగా రాదు! పలుకష్టములొక్కమారే సం భవించును! [Sorrows come in battalions! Shakespeare] అరిష్టములారంభ మైనప్పుడవి తమ హింసావిధానములఁ బరిపూర్తిఁ గావించిన కాని యంతరింపవు; తల్లీ! దుర్వార్త యేమియో తెలు పుము. ఓ! ఇదేమిశబ్దము!

జాహానారా—ఔరంగజీబు నేఁడు ఢిల్లీ సింహాసనాసీనుఁడై చతురంభోధిపరీత మహీతలంబునకు చక్రవర్తి యగుచున్నాఁడు! ఆగ్రానగరము ఆ యుడిగొట్టు నుత్సవధ్వనులతో మారుమ్రోగుచున్నది!

షాజహాన్—(వినని యట్లు) ఏమి! ఏమనుచుంటివి! ఔరంగజీబేమి! ఏమీ! అతఁడే మొనరించెను!

జాహానారా—నేఁడు ఢిల్లీ సింహాసనాసీనుఁ డయ్యెను.

షాజహాన్—బిడ్డా! నీ వేమనుచుంటివి! నేను సజీవుఁడనై యుంటినా లేక మరణించితినా? ఔరంగజీబు? —కాదు!— అసంభవము! కుమారీ!—నీవు సరిగ వినలేదు!—ఇది సంభవమగునా! ఔరంగ— ఔరా!—ఔరంగజీబూ!—కాదు కాదు! నందనుఁ డవివేకి కాఁడు! లజ్జాకరకృత్యము నతఁడు కావింప నేరఁడు! అతని జనకుఁ డింకను మరణింపలేదు! ఇట్టి కార్యము జేయ నతఁడు సాహసింపఁడు!

జాహానారా—[కంపిత స్వరమున] తండ్రీ! ఎవ్వాఁడు ముసలి యైన జనకునిఁ గారాగారమందు బంధింపఁ గలిఁగెనో, ఎవ్వఁడు కన్న తండ్రిని బ్రదికి యుండఁగనే యధఃపతితునిఁ గావింపఁ యత్నింపఁ గలిఁగెనో—అట్టివాఁడు కావింప నేరని కార్య మేముండును!

షాజహాన్—అయినను,—కాదు! సంభవమే! ఆశ్చర్యమేమి! అబ్బ మేమి!—ఇదేమి! మృత్తికనుండి కాలధూమము పుట్టుచున్న దేల? అంబరమంతయుఁ గారుక్రమ్ముకొనుచున్న దెందులకు! పృథ్వి యంతయుఁ గలఁ క్రిందు లగుచున్నదని తోఁచెడిని!—ఇదిగో! ఇదిగో!!—నే నున్మత్తుఁ డగుచుంటిని! అదిగో! నీలనభము! ఉజ్జ్వల ప్రభాతము! లోకబాంధవుఁడు నవ్వుచున్నాఁడు. ప్రభాకరా! నన్ను నీవపహాసించుచుండుటకుఁ గారణ మేమి? —ఏమియు సంభవము గాలేదు!—ఆశ్చర్యము! [కొంచెము నేపు స్తబ్ధుఁడై] అమ్మా!

జాహానారా—ఏమి తండ్రీ!

షాజహాన్—(గద్గదస్వరముతో) అమ్మా! నీవు వెలుపల నేమిచూచివచ్చితివి?—ప్రపంచమంతయుఁ బూర్వము వలెనే యున్నదా?—మాతలు శిశువులకు స్తన్యము నొసఁగుచుండిరా? సతులు పతులఁ గూడి సుఖముండిరా? భృత్యులు ప్రభువులకు సేవసలుపుచుండిరా? గృహస్థులు భిక్షుకులకు బిచ్చమిచ్చుచుండిరా? ఏమి తిలకించివచ్చితివి? తల్లీ!—అదిగో!—కాదు! విశ్వము లెప్పటియట్లు నిలువంబడియే యుండెనా? మార్గములందు బాలనారులు నడచుచుండిరా? మానవులు మానవులను చంపివేయుట లేదా? నరులు నరమాంసమును మెక్కుచుండుటలేదా? బిడ్డా! తెలుపుము! ఏమి చూచి వచ్చితివి?

జహానారా—తండ్రీ! ప్రపంచమంతయుఁ బూర్వమువలెనే యున్నది. కష్టపడుచున్న షాజహానుకొరకై యెవ్వరును నిట్టూర్పునైనఁ బుచ్చుటలేదు. ఎవ్వరిముఖమునైనఁ జింతాస్వేదకణము కూడ లేదు. ముసలిరాజు తలంపైన లోకులకు లేదు.

షాజహాను—ఏమీ!—సత్యమే!—"ఇది ఘోరతరదౌష్ట్య" మనియు "ఇట్టి దౌర్జన్యమునుచూచి మేము సహింపఁజాల" మనియు, "ప్రజావత్సలుండును, దయాళుండును, లోకప్రియుండును అగు షాజహాను చక్రవర్తిని బంధించు టెవరికిని సాధ్యముగా" దనియు, "ఆగ్రా దుర్గ ప్రాకారమును భేదించి, మాతేనిని విడిపించి, మరల సింహాసనాసీనుఁజేతు" మనియుఁ బ్రజలు కలుకుచుండుట లేదా? "మేమిఁక నీచవులమై యుండఁజాల" మని యుచ్చైస్స్వనమున వారలఱచుటలేదా? క్రుద్ధులై వారలు బొబ్బలిడుచుండుటలేదా? "మేము విద్రోహము సలుపుదు" మనియు, "ఔరంగజేబును కారాగారబద్ధునొనరింతు" మనియు వారు [illegible]చున్న [illegible] కొంపఁబడగెతుటలేదా?

జహానారా—తండ్రీ! ఎవ్వరును అట్లు చేయుటలేదు. లోకులెల్లరును పరులకై యోచింపనిచ్చగింపరు! ఎవ్వరెట్లున్నను, నిజౌన్నత్యము కొఱకై వారలు సర్వదా చింతాపయోధిమగ్నమానసులగుదురు! రేపటి ప్రభాతమునఁ బ్రభాకరుండుదయింపక, యొక ప్రచండానల దాహ మాకసమును దగ్ధ మొనరించినను, వార లారక్తవర్ణాలోకమున నవిచలితమనస్కులై పూర్వపుభంగి తమతమ దైనిక క్రియల నిర్వహించుకొనియెదరు! అహర్నిశములువారు స్వార్థపరాయణులై యుందురు.

షాజహాను—ఒకమాఱు దుర్గమును విడిచి వెలుపలికేగిన ముక్తుఁగ నుందును!—తల్లీ! అట్టి సుయోగము ప్రాప్తించునా? నీచిత్తంబును సరిపఱచుకొని, యెట్లో నన్ను వెలుపలికి రహస్యముగఁ దీసుకొని పోవుట కేదేని యుపాయము వెదకుము.

జహానారా—తండ్రీ! నెరవు తెరువుల వెదకుట యసాధ్యము! ద్వార సమ్ముఖమున వేయిమంది సేవకులు కావలియున్నారు.

షాజహాను—వారలకొకప్పుడు నేఁ బ్రకర్తనై యుండలేదా? ఈయల్ప కాలములోనే వారలున్న మఱచిపోయిరా? ప్రజలందఱికి నేను ప్రాణసముఁడనగు నెచ్చెలినై యుండలేదా! ఎన్నఁడైన వారల కవజ్ఞనూపితినా!—పరుష వాక్యంబు పలికితినా? తల్లీ! నన్ను మఱచుటకు వారి కెట్లు సాధ్యమైనది? వారియం దనేకుల ననాహార పిశాచమునుండి పలుమాఱు రక్షించి యుంటిని. కారాగారము నుండి పలువుర విడిపించి పెట్టించి యుందును! వివిధవిపత్తులనుండి మిగులఁ గష్టంబున వారియం దనేకుల గాఁపాడియుంటిని—ప్రత్యుపకృతి—

జహానారా—తండ్రీ! మనుజులు ప్రత్యుపకృతి గాంచువారు కారు! మానవుఁ డొకఁడు శునకంబు కొఱకు మాంసఖండము నొసఁగిన, నా

శునకము వాని కాళులకడ నిలువంబడి వాలము నాడించు తెఱంగున, మనుజులు, ఆత్మసుఖము నపేక్షించి ముఖస్తుతులఁ గావించుటం దతి నిపుణులై, శక్తిమంతులగు వారల దాసులై కాలముఁ బుచ్చుచుందురు! నరుఁడిట్టి నీచుఁడనియు, యిట్టి ద్రోహియనియు మీ రిదివఱ కెఱుంగరు!

షాజహాన్—అయిన నొక మాఱు వెలుపలి కరిగి నాయీ నెరసిపోయిన తలను జూపి కర్రపై నానుకొని యెట్లో యీ రోగకంపితశరీరమును వారల సమక్షమున వినీతభావమున నిలువబెట్టినచో, నాపై వారి కొకించుక దయపుట్టదా? ముదుసలిపై వారలకు జాలి కలుఁగదా?

జాహనారా—తండ్రీ! పృథివి పాపభూయిష్టము! ప్రజలు దయామయులుగారు! ఎల్లరు భయంబు కతననే భక్తిచూపుదురు! అధికార రహితపురుషుని వార లేవగింతురు! అట్టి కఠినాత్ముల ననున యించిన, గార్యసాఫల్యము నేకూరదు. సింహాసనాసీనులై, మహా వైభవమున మీరున్నతఱి "జయ్! సామ్రాట్షాజహానుకు జయ్!" అని జయఘోషలతో నాకాశమును బ్రద్దలు చేసిన వారలే నేఁడు మీ రీ ధైర్యహీనవృద్ధమూర్తిఁ గాంచి, మీ యెదుటనే ఘృణా పురస్సరముగ థూత్కార మొనరింతురు—ఒకవేళ కృపామయులై యుట్లుమియకున్నచో, వారలసహ్యభావమునఁ బెడమొగముల బెట్టి తరలిపోదురు!

షాజహాన్—అట్లొనరింపఁజాలుదురా! అట్టి క్రౌర్యము జూపఁగడంగుదురా! [గంభీరస్వరమున] నేఁడు ప్రపంచావస్థ యిట్లే యగుచో నేదేని మహావ్యాధి దాని సర్వాంగముల నాటియున్నదని గ్రహింపవలయును! ఇఁక నెందులకు! ఈశ్వరా! నీ వీఁక నీ మహాసంసారమును నిలుపకుము! ఈక్షణమందే దాని గళంబును నులిమి వేయుము! జగమింత మహాపాపముతో నిండియున్నచో, ప్రపంచ

భూతములారా మీరింకను సహించరేమి? ఆకాశమా! నీకింక నీ నీలవర్ణమెందులకు? లోకబాంధవా! నీ వింకను నభోవీధియందుఁ బ్రయాణమొందులకు సలుపుచుంటివి? నిర్లజ్జదేవతా! ఇఁక దిగి రమ్ము! ఒక మహాసంఘాతమున నీవు చూర్ణీభూతవు కమ్ము! భూకంపమా! భైరవఘుంకారము సలుపుచు మేల్కాంచి, పృథివీ వక్షమును బ్రిద్దలుచేసి, భూకాయమును ఖండములు గావించి, యాఖండముల విశ్వరాజ్యమున వెదజల్లుము! (కొంచెము సేపు నీర వుండె) ఇప్పట్టున ప్రకాండదావానలజ్వాల లుద్భవించి, ధూమ స్తోమంబులు విశ్వంబును గ్రమ్మి, సర్వంబును దగ్ధమొనరించి, భస్మ రాశుల నిర్మించుగాక! ఘూర్ణమానమహాఝంఝామారుతము భీషణవేగమున వీతెంచి ఆ భస్మరాశుల నీశ్వరుముఖమునఁ జిమ్ము గాక!

తృతీయదృశ్యము.

రాజపుతానాయందొక మరుభూమి పరిసరప్రదేశము—

పగలు రెండుజాముల వేళ—

చెట్టుక్రింద దారా, నాదిరసిపారులు కూర్చుండి యుందురు—

పార్శ్వప్రదేశమున జహారతున్నిసా నిద్రించుచుండును.

నాదిర—ప్రభూ! ఇఁక నే సహింపఁజాలను!—ఈతావునఁ గొంచెము సేపు విశ్రమించి, మన యలమట నపసయించుకొందము.

సిపార్—నాయనా! అమ్మ చెప్పినట్లు మనము కొంత తడవిందే విశ్రమించి యుందము—తండ్రీ! దాహముచే నా గొంతుకయెగిరి పోవుచున్నది!

దారా—(భార్యనుద్దేశించి), సతీ! విశ్రాంతి నందుచుంటివా! ఈ జన్మమునందు మనకిఁక విశ్రాంతి యెక్కడ! మనము దాటివచ్చిన యెడారుల జూచితివా?

నా — వీక్షించి తిని — అదేమిదృశ్యము! ఓ!

దారా — మన వెనుక మొదారి యెట్లున్నదో, ముందుఁగూడ నట్లే యున్నది! — నీరము లేదు! నీడ లేదు! యిసుకతప్ప కంకేము లేదు. మనకు నిలువఁదగిన తావేదియుఁ గాన్పించుటలేదు.

సిపార్ — నాయనా! దప్పిగొని యుంటిని! కొంచెము నీళ్ళు కావలయును.

దారా — తండ్రీ! ఇచట నీరము లభించు టసంభవము.

సిపార్ — తండ్రీ! నీరము! నీరము! గుక్కెడు నీళ్ళు ద్రాగినఁగాని నేను బ్రదుకఁజాలను!

దారా — [రుద్ధబావమున] ఊరకుండుము!

సిపార్ — నాయనా! దాహము! దాహము!! జలము! జలము!!

నాదిర — నాథా! ఈ చుట్టుప్రక్కల నేదేని జలాశయమున్న దేమో వెదకింపుఁడు బిడ్డఁడు, మూర్ఛిల్లుటకు సిద్ధముగ నున్నాఁడు! దాహబాధచే నా గొంతుకకూడ నెండిపోవుచున్నది! సూర్యుని యెండ వేడిమిచే నా చెవులనుండి యూపిరి వెడలుచున్నది.

దారా — సతీ! మీకు మాత్రమే యిట్లు బాధపడుచుండుటలేదు. నావేదనమీ శోకకంటె నెక్కుడుగా నున్నది! మీ విషయమును మాత్రమే మీరు దలఁచుచుంటిరేమి! నా కష్టమునుకూడ యోచింపరాదా?

నాదిర — ప్రభూ! నా శోకమునకై చెప్పఁబోటలేదు! — ఈ పసిబిడ్డఁడు — అయ్యో!

దారా — దప్పికచే నా యంతరంగమందుఁ గూడ నొక మహాజ్వాల మండుచున్నది. ఈ భీషణవేదనను సహింపఁ జాలకున్నాను! శుష్కించిన యీ కట్టివాని జూచిన, నాహృదయము చిల్లులు వడుచున్నది! — నోటనుండి మాట వెల్వడుటలేదు — సతీ! నేను

పరమసుఖినని భావించుచుంటినే!—కాని!—ఏమి చేయుదు! నీరము లేదు!—ఈ సమీపమునఁ గొలను లేదు!—(నింగివైపుజూచి) దయామయా! నన్నిట్టి యవస్థలోఁ బడఁద్రోసితివి! ఈబుడుతని కొఱకైన సలిలరేఖ నీసమీపమునఁ జూపరాదా! ఆహా! ఏమిగతి ప్రాప్తించినది! అయ్యో! ఈవేదనను సహించుటెట్లు!

సిపార్—నాయనా! ఇఁక నే బ్రదుకను!

నాదిర—అయ్యో! బిడ్డా!—నేఁ గూడ మరణించెదను!—ఈదుఃఖము దుస్సహమై యున్నది!

దారా—చచ్చిపొండు. ఇచటనే చచ్చిపొండు. నేఁగూడఁ జచ్చిపోయెదను!—నేఁ డింతే మనమందరము మృత్యుదేవత కెరయగుదము!—ఇఁక బ్రదుకుటెందులకు!—రండు! చచ్చిపోవుదము రండు!

సిపార్—అమ్మా! నాలుక లాగుకొనిపోవుచున్నది!—అయ్యో! తల్లీ! ఏమి యీవేదన! (నేలఁగూలును.)

నాదిర—(తనయు నిదీసి) నాయనా! లెమ్ము! నీ కమ్మ లేదు! అమ్మయే నీ కన్న మొదల నిట్టియవస్థయుండు నీగవయై నిన్నుఁ జూచుచు నూరకుండఁజాలదు?

దారా—ఇఁక నే నీదృశ్యమును వీక్షింపఁజాలను! నేడు నే నీశ్వరుపైఁ బగసాధించెదను! వాని యీదుర్గంధభూయిష్టము—, అంతఃసారశూన్యమగు సృష్టినిభేదించి, తదభ్యంతర ప్రకాండ ప్రపంచనమును వెలువరిచి దానిని వానికిఁ జూపెదను!—అవును!—మంచిది! నేను మడియుదును!—కాని నేను మడియుటకుఁ బూర్వము నా చేతులతో మిమ్ములఁ జంపివైచెదను. మిమ్ము చంపి నేఁ జచ్చెదను!—

[ఖడ్గము నొరనుండి తీయును]

సిపార్—అయ్యో! మాయమ్మను చంపకుము!—నన్ను చంపుము!—

నన్ను మాత్రమే !

నాదిర—కాదు కాదు! నన్ను ముందు జంపుము!—లోకులయెదుట బిడ్డనతుమునఁ గృపాణమునఁ ద్రుంచ్చుకుందు!—నన్ను ముందుగ నరికివేయుము.

సిపార్—నాయనా! మాయమ్మను జంపుచుండ నేఁ జూడఁజాలను. నన్నె ముందుగఁ జంపివేయుము !

దారా—(తనకనుల వీక్షించుచు) దయామయా ! ఇదేమి యక్కృత్యము!—ఇదేటివింత!—నడుమనడుమ నట్టి చిత్రములఁ జూపుచుంటి వేమి!—తల్లుంబిడ్డను నిదేమి యాలోకోచ్ఛ్వాసము ! ఈశ్వరా ! కృపాళూ ! నీ సృష్టిరచన సుందరము నిష్ఠురము కూడనా! తల్లిబిడ్డ లొకరినొకరు రక్షించుకొనుట కా యాక్రందనము!—ఇ ట్లింగలాండ్రిపుడు, వీర లొకరినొకరు కాచికొనఁజాలక పోవుచుండిరా!—ఇట్టి ప్రాబల్యమా? వెనువెంటనే యిట్టి దౌర్బల్యమా ! ఇటి యుచ్ఛ్రయా ! కాని యింతటి యధఃపతనమా!—ఇదిగో ! మింటినుండి ప్రాణిక్యమొకటి యాకస్మికముగ, మట్టియందుఁ బడి పోయినది. ఇవిగో!—స్వర్గనరకములు రెండును కలియుచున్నవి ! కృపాళూ ! ఇదేమి ప్రహేళిక !

సిపార్—అమ్మా! అమ్మా!! నాయనా!నాయనా!! అయ్యో!అమ్మా!

[క్రిందఁ బడిపోవును.]

నాదిర—(దగ్గుత్తికతో) అయ్యో! నాయనా! నీ కెంతగతి పట్టినదిరా తండ్రీ ! [వానిని లేవనెత్తి నిజాంకమునఁ జేర్చుకొనును]

దారా—ఇదిగో! మరల నాకు, నానిరయము గన్పట్టుచున్నది! కాదు! కాదు! కాకేమి!—ఇది యాలోకభ్రాంతి!—ఇదిగో ఢాకిని! ఇదిగో శాకిని!—పిశాచ ప్రపంచము ! జీమూతమెంత గాఢమైనదో చూపుట కిదొ ప్రజ్వలదంగారఖండము. ఏమియు కాదు!—

లేదు!—మిమ్ములఁ బరిచి పిదప నేను మడిసెదను! [నిద రించు బిడ్డను విలోకించి] అమ్మా! సుషుప్తిమగ్నవై యుంటివా! నిన్నేమి చేయను? తల్లీ!—ఛీ! దారా! బేలవుగాకుము! హృదయమా! నీరుగాకుము! హస్తమా! కంపింపకుము. మస్తకమా! ఘూర్ణిల్లకుము! కాయమా!—ఛీఛీ! వడఁకుచుంటివేమి! కన్నులారా! ఏమి! ఏమి!— ఏమి యీ కొంకనలు! కరవాలమా! నేలఁ బడి పోవుచుంటివేమి? అయ్యో! ఈశ్వరా! అయ్యయ్యో! కాళ్ళు తడఁబడుచున్నవేమి? ఛీ నిలువుఁడు నిలువుఁడు! తల్లీ! మేల్కాంచవేమి! నిన్నుఁ గూడఁ జంపివేయుదునని యెఱుఁగవా! తల్లీ! అమ్మా! నీసుఖనిద్ర దీర్ఘనిద్రయగునని యెఱుఁగవా! ఇఁక జంపివైచెదను! అయ్యో! చేతులురావు! (ఆకస్మికముగఁ జలికిలపడును) లేచి! ఇఁక జాగుసేయరాదు! హృదయేశ్వరీ! రమ్మా! నాయనా రమ్మా! తల్లీ! ఇఁక లెమ్మా! మి మ్మిప్పుడ నరికివేసెదను!— తుదపరి!—తుదపరి—(గద్గదస్వరమున) మీ మృతకాయములఁ గవుంగలించుకొని నేను చచ్చిపోయెదను!—రండు! ఒక్కరొక్క రే రండు!—

[భార్యను జంప దారా కరవాలము ఝళిపించును]

సిపార్—(ముందికురికి) చంపకుము! చంపకుము!! అయ్యో అమ్మా—

దారా—[తనయు నొకకరమునఁ బట్టుకొని, వానిని దూరమున నిలుపబెట్టి సతికంఠమునఁ గరవాలము వేయ నుద్యమించి,] సతీ— సిద్ధముగ నుంటివా?

నాదిరా—నాథా! మడియుటకు ముందు మి మ్మొకమాఱు ప్రార్థింపనిమ్ము.

దారా—ప్రార్థనయా!—ఎవనిని ప్రార్థించెదవు! ఈశ్వరుఁడు లేడు!

సర్వము శూన్యము!—ప్రపంచనము! ప్రతారణము! దౌష్ట్యము! దౌర్జన్యము! భగవానుఁ డెక్కడ!—ఏడీ! ఏడీ! చూపుము!—దేవుఁ డుండెనని యెవరనిరి? ఉండెనా! ఉండెనా? మంచిది! ప్రార్థింపుము!

నాచర—(డగ్గుత్తికతో) బిడ్డా! రమ్ము. చనిపోవుటకు ముందొకమారు నీ ముద్దుమోమును ముద్దిడనిమ్ము! నీ శిరమును మూర్కొననిమ్ము! తండ్రీ! ఇట్టి పాపాత్మురాలికడుపున నేమిటికిఁ బుట్టితివిరా? నాయనా! నీకుఁ గూడ నిట్టి కఠినమరణమే ప్రాప్తించునా! నీ చిన్నికంఠము నూడఁ గరవాలమున కెరయగునా! ఆ ఘోరబాధ నెట్లు తాళుదువు? అడుగుఁ గ్రింద మోపనీయక చిన్ననాటనుండియు నిన్నల్లారుముద్దుగఁ బెంచితినిరా. తండ్రీ! బంగారుగిన్నెలతో బాలుత్రాగు ముద్దుబిడ్డవు నేఁడు కటికపిపాసచేఁ గుందుచుంటివా! విధాత నీనొసట గూడ నిట్టివ్రాత వ్రాసెనేమిరా! సుకుమారున కిట్టి యిక్కట్టులు బెట్టిన సర్వేశునకు జాలిలేదా! అయ్యో! కన్న తండ్రీ! నిన్నువిడిచి నేనే ముందు బోవలసివచ్చెనా! నాయనా! రమ్ము! తనివితీర నొకమా రాలింగన మాచరించుకొననిమ్ము! మరియుటకు ముందొకమారు భగవానుని ప్రార్థింతము రమ్ము! [తనయుఁడు ముందునకు రాఁగా నామె వానిం గౌఁగిలించుకొనియెను. మాతాశిశువు లిరువురు మోకరించి కనులు మూసికొనిరి.]

నాచర—దీనావనా! దారుణమైన దుఃఖమున మునిఁగి నేఁడు నిన్ను ప్రార్థించుచుంటిని! ప్రభూ! నన్నొకదానినే గాక నా ప్రాణాధిపుఁడైన వీరలఁగూడ గభీరశోక జలధియందు మునుఁగఁ జేసితివి! సంతాపము నేఁ డహింపఁ బడుచున్నను, ఎప్పటియట్లు వినీతనై నీయాజ్ఞ శిరసావహింప నే నలయొగ్గుచుంటిని! ఏయాజ్ఞ నొసఁగుదువో యొసఁగుము! ఏమిశిక్ష ప్రసాదింతువో ప్రసాదింపుము! తెలవారిన

సుఖదుఃఖముల నొక్కతీఱున నే పరిగ్రహించెదను! కాని నీసాన్ని ధ్యముఁజేరుటకుఁబూర్వము నాబిడ్డలును, పతియుసుఖులైయుంట వీక్షింప నిచ్ఛగించుచుంటిని! ఈనాతుదకోరికను నీడేర్చి పిదప నన్నుఁ నీదకుఁగొనిపొమ్ము!

దారా—[చూచుచుఁజూచుచు నాకస్మికముగ మోకరించి యిట్లు ప్రార్థింపఁదొడంగును.] ఈశ్వరా! జగదీశ్వరా! రాజాధిరాజా! నీవుంట నిక్కము! నీవులేకున్న నీవిశ్వపాలన మెవ్వరుచేయుచుండిరి! ఏనియమబలంబున మాతానుతులను రెండుపవిత్రవస్తువులు జగమందు బ్రస్ఫుటితములాయెనో యానియమమెందుండి యరుదెంచెను! నిర్హేతుకజాయమానకరుణా! నిన్నునేకవిధముల స్మరించితిని. కాని, ఇట్లు శోకార్తుఁడనై యిట్టిదీనభావముననిట్టి కాతరహృదయమున నిన్ను నే నీవర కెన్నఁడును ప్రార్థించియుండలేదు. దయామయా! నమస్తే! కృపాళూ! రక్షింపుము.

( సతీసమేతముగ నొకగోపాలుఁడు ప్రవేశించును. )

గొల్లవాఁడు—మీరెవరు?

దారా—దయాళూ! అరుదెంచితివా! [ నేత్రములఁదెరచి ] మీరలెవరు? కొంచెము జలమొసఁగుడు! కొంచెముజలమొసఁగుడు! నాకీయన్నను ఈరమణి కీబాలునకు నిండు. వీరిఁబ్రతికించి పుణ్యముఁగట్టుకొనుడు.

పాలగొల్లది—అయ్యో! పాపము! వీరి కెంతకష్టము వచ్చెను! నేనిప్పుడే పోయి జలమును గొనివచ్చెదను. నాయనా కొంచెము తాళుము!

[ నిష్క్రమించును. ]

గొల్లవాఁడు—ఆహా! ఏమి యాపద! అయ్యో! ఈబిడ్డలోజచున్నాఁడు!

దారా—అమ్మా! జహానత్! నీవుమరణించితివా తల్లీ!

గొల్లవాడు—(జహారత్‌ను సమీపించి ఆమెమ ఖమును తేరిచూచి) బాబూ! బిడ్డమరణింప లేదు. అయ్యో! బిడ్డా!

దారా—తల్లి!

జహారత్—(హీనస్వరమున) నాయనా!

[గొల్లది ప్రవేశించి నలువురికి జలంబొసఁగును. అందఱు నీరము నాప్యాయనంబుగఁ గ్రోలుదురు.]

గొల్లది—(దారా నుద్దేశించి) బాబయ్యా! రండు! మాయింటికి రండు!

గొల్లవాఁడు—అయ్యగారు! రండి! మాయింటికి!

దారా—దయాళులారా! మీర లెవరు? స్వర్గమునుండి యవతరించిన దేవతలా యేమి?—మిమ్మాశ్వసించ డంపెనా?

గోపాలుఁడు—బాబూ! మేము దేవతలము గాము. గొల్లలము! ఈ చిన్నది మాపిల్లల తల్లి.

దారా—మీ కింతి దయయా! మనుజులకింత జాలియుండునా? ఇది సంభవమా?

గోపాలుఁడు—ఏమినాయనా! మీర లెప్పుడును మనుజులఁ జూచి యుండలేదా? భూతములనే జూచుచు వచ్చుచుంటిరా?

దారా—దయాళూ! అట్లే యై యుండవచ్చును. ఈ వఱకు మేము గాంచిన వన్నియు పిశాచములే కావచ్చును!

గొల్లది—బాబయ్యా! ఇది మానవులు చేయవలసిన కార్యమే! దిక్కు లేనివారి కాశ్రయ మొసఁగుట, ఆఁకలిగొన్న వారి కన్న మొసఁగుట దప్పి గొనినవారికి గ్రుక్కెఁడు నీళ్ళిచ్చుట—ఇవన్నియు మానవకృత్యములే. భూతములు మాత్ర మావనులఁ జేయవు. కాని అవిగూడ నప్పుడప్పుడిట్టి సత్క్రియలఁ గావింప నిచ్చగింపవని నేదలఁపను.—బాబయ్యా! రండు! అమ్మా! లెమ్ము! బిడ్డలారా! రండు!

[గొల్లది దారా తనయును చంకబెట్టుకొనును. గొల్లడు దారా తనయు నెత్తుకొనును. దారాభార్య కరము బట్టుకొని వారి ననుగమించి పల్లెకు నిష్క్రమించును.]

చతుర్థదృశ్యము.

ముంగేరుదుర్గప్రాసాదము—జ్యోత్స్నాలోక సశీథము.
పియారా రాగచారిం జేయుచుఁ బాడును.

సుఖయింపఁగాఁ గోరి సొగసైన సౌధంబు
నిర్మింప నయ్యది నేలఁ గూలె!
మధురామృతంబని మధువును గ్రోలఁబో
నది కాలకూటమై యుగడువెట్టె
శీతాంశుఁడని ప్రేమఁ జేరి కొల్వఁగఁ దీక్ష
రోష్ణాంశుఁడై యాశలుడుగఁ జేసె
కడుదప్పిగొని జలంబిడునంచు వేడఁగా
జలదంబు పిడుగుల జార్చి మోదె!

(సుజా ప్రవేశించును).

సుజా—నీ విచటనుంటివా? నీకొఱకై దినమంతయుఁ దిరిగి తిరిగి వేసారితిని.

పియారా—(పాడుచుండును)

ప్రణయభంగముచే నెద బ్రద్దలయ్యె

సుజా—తమవాత నీకంఠస్వరము విని, నీవిచటనుంటివని గ్రహించితిని.

పియారా—(పాడుచుండును!)

జ్ఞానదానుని బోధను జ్ఞాన మిచ్చె!

సుజా—నాలపినుము!—ఏమీ! ఈ నిర్లక్ష్యము!

పియారా—(పాడుచుండును!)

ఇంతె గలుఁగులు నాకన్న మెంగిచూడ!

పియారా—ఏమి చేయుదును! నా గానమాధుర్యము తమకు కర్ణకఠోరము గానున్నది. నే బాడిన మీరు వినదలచుకొనరు. అందుచేనేనే గానముచేయుచు నేనే యానందించు శ్రోతనగుచుంటిని.

సుజా—నీవలిన వచనములో వ్యాకరణ దోషమున్నది.

పియారా—ఏమి! నేనువచించినదానిలో వ్యాకరణ దోషమును బట్టుకొంటిరా! నేపలికినదానిలో దప్పు బట్టుకొనువాడు మీరా!

సుజా—అవునునేనే! నీవు "శ్రోత" యనిపలికితివి. నీవు శ్రోతవు కాజాలవు.

పియారా—(నాలుక కరచుకొని)—అయ్యో! నోరుజారినది.

సుజా—జారిపోయినదా! చూచెదగాక (క్రింద వెదకునట్లు నటించును.)

పియారా—వ్యాకరణ—

సుజా—సరే! దాని కేమిలే! ఇప్పుడు తెలుపదగిన విషయమేమనః సులేమాను ముంగేరు కోటమునుండి వెడలిపోయెను. ఎందులకో యెఱుంగుదువా?

పియారా—అది తప్పుకాదు!

సుజా—అతనిజనకుడైనదారా రమ్మని వానికి గబురునంపెను. కాని యావైపున—

పియారా—అట్లనుటవలనఁ దప్పేమియు లేదు. మీరప్పుడు సరిగ వినలేదు!

సుజా—రెండవమాటకూడ దారా ఔరంగజేబుచే యుద్ధమున బరాజితుఁడయ్యెను!

పియారా—వ్యాకరణ దోషము లేదు!

సుజా—నీధోరణి వేఱుగను, నాధోరణి వేఱుగను, గన్పట్టుచున్నది. నేఁజెప్పుదానిని వినదలఁచుకొనలేదా?

పియారా—నేను వచించినదానిలో వ్యాకరణ దోషము లేదని మొట్ట

మొదట నొప్పుకొనుము!

సుజా—నీవు వ్రచించిన దానిలోఁ దప్పకుండా వ్యాకరణదోషమున్నది!

పియారా—తప్పక వ్యాక—

సుజా—తప్పక వ్యా—

పియారా—దోషము లేదు!

సుజా—దోషముండి తీరినది!

పియారా—దోషమేమియు లేదు!

సుజా—ఉన్నది! ఉన్నది!! ఉన్నది!!!

పియారా—లేదు! లేదు!! లేదు!!!

సుజా—నదువు మెవరిచేతనైనఁ దెలిపించెదవురమ్మా! లేక నీవే యిష్టమువచ్చిన వారినడిగి తెలిసికొనుము!

పియారా—నాకదంతయు దెలియదు. ఇదిగో! చెప్పుచుంటిని వినుడు! ఈవివాదము నిచ్చటనే యిప్పుడే—ఈక్షణమందే తీర్చివేయవలయును. లేకున్న నేనుపెద్దమారాము జేసెదను. ఈతావంతయు రసాతలముఁ గావించివైచెదను! కొంపఁదలక్రిందులు జేయుదును. పెంకు లెగురునట్లు రాత్రియుఁ బగలుఁ బెడబొబ్బలఁ బెట్టెదను! మీరెట్లు నిదురించెదరో చూచెదను! యీచిక్కులనుండి తప్పించుకొనవలెనన్న—ఇప్పుడే—ఈక్షణమందే, ఈప్రదేశమందే, రెండవకంటి వానికిఁ దెలియకుండ, నేమియు సంకోచింపక, నాపక్షమందే తీర్మానమొనరింపవలయును! దోషమేమియు లేదనియు, దోషమంతయు మీదేయనియు, ఈవిషయమునింతవఱకుఁగొనివచ్చుట మీబుద్ధిపొరపాటనియు. మీరొప్పుకొనవలయును—లేకున్న నీ బ్రహ్మరాక్షసి నెఱుంగుదురా?

సుజా—సరే! నీపక్షమందే తీర్మానించిన, నేఁజెప్పుదానిని సావధానమనస్కవై విందువా?

పియారా—వినెదను.

సుజా—అటులైన నీవువచించినదానియందు వ్యాకరణ దోషమేయున్నను,—(నాలుక కఱచుకొని) కాదుకాదు! ప్రియా—నీవుపలికిన దానిలో వ్యాకరణదోష మొక్కటియు లేదనుట నిక్క—

పియారా—నిక్కమా నిక్కము కాదా?

సుజా—నిక్కము కాదు.

పియారా—ఇదిగో! ఇదిగో!! మొదలిడుచుంటిని!!!

సుజా—నిక్కము! నిక్కము!! నిక్కము!!!

పియారా—నిక్కమేమి! దోషముండుటయా!

సుజా—కాకున్న మఱేక నిక్కమే మనుకొనుచుంటివి!

పియారా—మంచిది. ఓ! (అఱవనుద్యమించును.)

సుజా—సతీ! ఊరకుండుము! దోషమేమియు లేదని యొప్పుకొనుచుంటిని. ద్వితీయపక్షమందీవున్నపు డట్లియ్యకొనకతప్పదు. ఇకవినుము. తెలుపవచ్చిన విషయములు విశేషముగ నున్నవి. అవన్నియు గురుతరములే! విదుషివైననీవు బాగుగవివేచన మొనరించి నాకాలోచన దెలుపవలయును. నీయాలోచన మనివార్యము!

పియారా—ప్రియా! మీరిట్లు ప్రసంగించుచుండిన నాయుల్లము నుల్లాసముచే బల్లవించును. మీరుకోరిన చొప్పున నాలోచన జెప్పెదను. కాని విషయముల నన్నింటిని మీరు విశదీకరింప వలయును. ఒకించుక తాళుడు. సావధానమనస్కనై వినుటకింకను సంసిద్ధనైయుండలేదు. (దుస్తులసవరించుకొని, తలకువ్రుక్కొని, ముఖముకదుడుచుకొని, నలుగెలంకుల విలోకించి) ఇచట నొకరున్న తావసమైన లేదు. మీాడంబమంతయు నింతియేనా! పోనిండు నిలబడియే వినెదను ఇక దెలుపుడు. నేనిపుడుసిద్ధముగ నున్నాను.

సుజా—జనకుఁడు మృతినొందెనని నేఁదలఁచెద.

పియారా—నేఁగూడ నట్లే తలఁచెద.

సుజా—చక్రవర్తిచేవ్రాలని జయసింహుఁడు చూపిన యుత్తరములు దారాత్మజుని యుక్తిమూలక యనుకరణమని తలఁచెద.

పియారా—నేఁగూడ నట్లే తలఁచెద.

సుజా—ఏమి తలఁచితివి?

పియారా—అదే.

సుజా—అదంటే?

పియారా—అదంటే అదే!

సుజా—నేఁబలికినది యొక్కటైన నొప్పుకొంటివా?

పియారా—నేనేమియు నొప్పుకొనుచుండలేదు. మీరు చెప్పుకొని పోండు.

సుజా—రెండవమారుయుద్ధమందు కూడ నౌరంగజీబుచే దారాపరా జయపు వార్త వింటివా?

పియారా—వినకేమి వింటిని.

సుజా—ఎవరికడ వింటివి?

పియారా—మీకడనే!

సుజా—ఎప్పుడు?

పియారా—ఇప్పుడే!

సుజా—దారా ఆగ్రావిడిచిపారి పోయెను. విజయగర్వంబున నౌరంగజీబాగరము జొచ్చి జనకునిఁ గారాగారమున బంధించెను. మురాదునుకూడ బంధించివైచెను.

పియారా—నిక్కమే!

సుజా—ఔరంగజీబిఁక నాతో సమరమునకువచ్చును.

పియారా—సంభవమే!

సుజా—ఆకతినునితో నేను యుద్ధముచేయ వలసివచ్చినచో నదెంతయు భీషణమై యుండునని వక్కాణింపవచ్చును.

పియారా—భీషణమన్న భీషణమా!

సుజా—దానంజేసి నేనిప్పటినుండియు సమరసన్నద్ధుడనై యుండవలయును.

పియారా—ఉండవలయునేమి! ఉండితీరవలయును!

సుజా—ఏమీ!

పియారా—ఏమో?

సుజా—కాని—

పియారా—నాయుద్దేశ్యముకూడ నట్లే!

సుజా—నీయుద్దేశ్య మేవిషయమున?

పియారా—మీరనిన కానీ విషయమున!

సుజా—నీవు వచించున దేమియో నాకు బోధపడుటలేదు.

పియారా—నిక్కముగ నాకుకూడ నేమియు బోధపడుటలేదు.

సుజా—బాగు! బాగు!! నిన్నాలోచన యడుగుట నాబుద్ధితక్కువ!

పియారా—అందుకు సందేహమా?

సుజా—యుద్ధవిషయములు నీకెట్లుబోధపడును!

పియారా—యుద్ధవిషయములు నాకెట్లు బోధపడును!

సుజా—కాని, మఱొకచిక్కు కలుగుచున్నది!

పియారా—చిక్కనిన చిక్కే!

సుజా—అదేమి?

పియారా—ఏమో నాకేమి తెలియును!

సుజా—తాను మనతనయను పరిణయమాడనని మహమ్మదు స్పష్టముగ లిఖించెను.

పియారా—అతడెట్లు పరిణయమాడును!

సుజా—ఎట్లాడదు! వివాహమీపరకే స్థిరమైపోయెను. ఇప్పుడీమాట దిరిగిన మనమూరకుందుమా?

పియూరా—అమ్మో! ఊరకుందుమా!

సుజా—కాని అతడు పరిణయమాడ నిచ్ఛగించడు.

పియూరా—ఎందుకిచ్ఛగించును!

సుజా—తనతండ్రి విరోధికూతును దాను వివాహమాడనని అతడు లిఖించెను.

పియూరా—అతడట్లెందుకు లిఖింపఁడు!

సుజా—మహమ్మదును పరిణయమాడుట కియ్యకొననిదో తనయుపరి తాపమున కంతముండదు.

పియూరా—తనయుపరితాపమున కంతముండదా!

సుజా—ఇక దేనికావింపవలయునో నాకేమియుఁ బాలుపోవుట లేదు.

పియూరా—నాకుఁ గూడా నేమియుఁ బాలుపోవుటలేదు!

సుజా—అయ్యో యిప్పుడేమిచేయుదము!

పియూరా—అయ్యో! ఇపుడేమిచేయుదము!

సుజా—ఏవిషయమందయిన నీయాలోచన యడుగుట వట్టివృథ!

పియూరా—అట్లని యిప్పటికిఁ దెలిసినదా!—ఎట్లు తెలిసినది!—ఎట్లు తెలిసినదో చెప్పరూ? పోనిమ్ము చెప్పకపోయిన!

సుజా—ఇవుడేమి చేయుదు! సమరము నామాన్యునితోఁ గాదు!—ఔరంగజేబుతో! మహమ్మదువంటి కొడుకు వానికిఁ దోడ్పడుచుండెను! ఏమివిపత్తు వాటిల్లునో తెలియకున్నది! సతీ! నీవేమిసలహాయొసఁగెదవు?

పియూరా—ప్రియసతీమా! మీకునిక్కముగ నాసలహా కావలయునా? వినెదనన్న నీవిషయమందు నాయుద్దేశ్య మేమియో దెలిపెదను.

సుజా—తెలుపుము, వినెదను.

పియారా—ప్రాణేశ్వరా! యుద్ధ మొనరింపకుండుటే నాయుద్దేశ్యము. బవరమువలని ప్రయోజన మేమియు లేదు.

షుజా—ఎందులకు లేదు? మనకు సామ్రాజ్యమక్కఱలేదా?

పియారా—హృదయేశ్వరా! మనకు సామ్రాజ్యమేల! మన కెట్టి యభావమున్నది!—ఎట్టిలోటుకలదు! నస్యశ్యామల పుష్పవిభూషితసహస్రనిర్ఝరమాలికా విరాజితమై యమరావతివలె సుందరంబగు నాంధ్రసీమతో సన్నిభమయిన యీ నందభూమిని విలోకింపుఁడు. సామ్రాజ్యమన నెట్టిది! నాహృదయసింహాసనమున భక్తి పురస్సరముగ మిమ్మాసీనుఁ గావించితిని. అసింహాసన సమ్ముఖమందామయూరసింహాసన మెంతపాటిది! చేతులఁ గలుపుకొని హృదయములఁ బొదివికొని, మన మీదివ్యహర్మ్య శిఖరంబున నిలువంబడి, విహంగమధుర ఝుంకారము కర్ణపర్వంబొనర్ప, దిగంతప్రసారిత దివిజకల్లోలి సీధూసరవతము నేత్రపర్వంబు గావింప ఆయనంత నీలాకాశమహాశైవలినీ శుభ్రపూరంబున, పరస్పరసమ్మిళితముగ్ధాపాంగదృష్టితరణిని దేలియాడఁజేసి, ఆనీలసభోనిభృత ప్రాంతమున, మోహమయశాంతి నికేతనమైన, ద్వీప మొకటి కల్పనాబలమున సృష్టించి, దానినడుమనున్న స్వప్నమయ నికుంజము లోవల నుపవిష్టులమై, పవిత్ర ప్రణయపూర్వకంబుగఁ బరస్పర యౌవనారుణ తేజో భాసమానాంగ ప్రత్యాంగముల విలోకించుకొనుచుఁ బరస్పరాధర సుధనాప్యాయనముగఁ గ్రోలుచుఁ, బరస్పర చుంబనసుఖమునఁ దేలుచు, చిత్తజసాయక విద్ధులమై, శరీరంబులతోఁగూడఁ జిత్తముల నొండొంటితోఁగలిపి, పరస్పరభుజాయష్టి ణాళలేల్లితులమై, యమ్మహానంద పయోధిమగ్న మానసులమై, యనిర్వాచ్యంబగు సౌఖ్యసామ్రాజ్యమునఁ గాలముఁబుచ్చు మన కాకష్టభూయిష్టమగు ఢిల్లీసామ్రాజ్య మెందులకు! వల్లభా!

ఈయుద్ధమువలన మనకు లాభములేదు. మనకు హర్షముఁ గలుఁగదు. మనయది కానిది మనకు లభ్యముకాదు. మనకున్నదానిని ప్రస్తుత ఢిల్లీభర్తకు జేకూరఁ సమర్పింపకుఁడు!

సుజా—అట్లైన నీవు బాగుగనే యోచించితివి— నేనొంటిగ భావించి భావించి, ఘూర్ణమాన మస్తిష్కుఁడనైతిని. సతీ! అగ్రజుఁడైన దారాప్రభుత్వమున కెట్లైన నంగీకరింతును. కాని, నాకన్నఁ జిన్నవాఁడైన యౌరంగజేబు ప్రభుత్వం బేనియ్యకొనఁజాలను— చిన్నవాని యాజ్ఞకుఁ దలఁదాల్చ నేనిచ్ఛగింపను.

[నిష్క్రమించును]

పియారా—మీ కెట్టి యుపదేశమిచ్చినను వృథయే! మీరు శూరాగ్రేసరులరు! సామ్రాజ్యార్థము మీరు కదనముఁ గావింపకున్నను, సమర్థమైన సమరము సలిపెదరు. మిమ్ము నేను బాగుగఁ బరీక్షించితిని—యుద్ధమనుమాట చెవిబడిన, మీరద్భుత హర్షంబున నాట్యమాడెదరు!

## పంచమ దృశ్యము

ఢిల్లీనగరపు మందిరము—ప్రాతఃకాలము
ఔరంగజేబు సింహాసనారూఢుఁడై యుండును.

పార్శ్వప్రదేశమున, మీర్జుమ్లా, సయిస్తఖాను ప్రభృతులగు సైన్యాధ్యక్షులును, అమాత్యులును, నిజభృత్యసమేతుండైన జయసింహుఁడును, ఆసీనులైయుందురు. యశవంతసింహుఁడు సమ్ముఖమందుండును.

యశవంత—జాంహాపనా! (స్వామీ!) సుజాసుల్తానుతో మీరు చేయఁదలఁచిన సమరమున మీకు సాయమొనర్ప నా సైన్యములతో నేనిచ్చోటఁ గరుదెంచితిని; కాని ఒకించుక యోచించి, యిప్పుడు చేసట్లొనరించుట కిచ్ఛగించుటలేదు. నేఁడే నేను యోధపురమున

కరుగుచున్నాను.

ఔరంగజేబ్—యశవంతసింహ మహారాజ్! నర్మదాతీర యుద్ధమునఁ దారాపక్షావలంబులై నన్నెదుర్కొనుటవలన మీపై నాకప్రియము కలుగలేదు. మీ రాజభక్తికి నిదర్శనమును గనుబఱిచినచో శీఘ్రకాలమున మిమ్మాత్మీయులలోఁ బరిగణింతుము

యశవంత—యశవంతసింహుఁడు మొగలుతేనికి ఇష్టుఁడైనను, అనిష్టుఁడైన నొక్కటియే! అందుకు మీరు విశేషముగఁ బరితపింప నక్కఱలేదు; యశవంతుఁడు నేఁడు దేవరకడ దయాభిక్షుకుఁడై రాలేదు.

ఔరంగ—అటులైన మహారా జీసభాస్థలమున కేయుద్దేశ్యముతో వచ్చెను.

యశవంత—దయాళుండైన షాజహాను సార్వభౌముని కారాగారమున బంధించుట కేమియొప్పమికలిగినో, జనకుఁడు సజీవుఁడై యుండగా, నే యధికారమునుబట్టి నీవు సింహాసనాసీనుఁడవైతివో ప్రశ్నింపవచ్చితిని.

ఔరంగ—ఇప్పుడా ప్రశ్నకు సక్రమముగ ప్రత్యుత్తర మొసఁగవలయునా యేమి?

యశవంత—ప్రత్యుత్తర మొసఁగుటయు, నొసఁగకపోవుటయు నీయిష్టము! ప్రశ్నించుటకు మాత్రమే నేను వచ్చితిని.

ఔరంగ—నీ ప్రశ్న యొక్క యుద్దేశమేమి? ..

యశవంత—దానియుత్తరముపై నా భవిష్యదాచరణ మాధారపడి యున్నది.

ఔరంగ—ఎట్టెట్లు! నీ భవిష్యదాచరణము దానిపై నాధారపడి యున్నదా! మంచిది! ప్రత్యుత్తరము నీయనిచో?

యశవంత—నీవు తెలుపవలసిన దేమియును లేదని గ్రహింతును.

ఔరంగ—నీచిత్తమువచ్చిన తెఱంగున గ్రహింపుము. నిగ్రహించుటయు, గ్రహింపకపోవుటయు, ఔరంగజేబున కక్కఱయుండునని దలంపకుము. వానినెఱుఁగవలసిన యవసరము లేదు. తాను చేయు కార్యములకు కారణముల నొక్క ఖుదాకే కాని యొరులకౌరంగజేబు తెలుపువాఁడు కాఁడు!

యశవంత—మంచిదటులైన ఖుదాకే తెలుపుము!

[ వెడలఁ బోఁబోవుచు ]

ఔరంగ—యశవంతా! నిలువుము—నేను ప్రత్యుత్తరము నొసఁగనిచో నీవేమి కావింతువు?

యశవంత—షాజహాను చక్రవర్తిని చెరనుండి విడిపింప శక్తివంచనలేక ప్రయత్నించెదను. అంతకంటె వేఱు కార్యమేమియు గావింపను, సఫలమనోరథుండనగుటయుఁ గాకపోవుటయు వేఱుమాట. నాకర్తవ్యమును నేను కావించెదను.

ఔరంగ—విద్రోహము సలుపుదువా?

యశవంత—విద్రోహమా! చక్రవర్తి పక్షమునఁ బనిసమాచరించుట విద్రోహము కాదు. విద్రోహము-సలిపినవాఁడవీవు! సాధ్యమగుచో నావిద్రోహమునకుఁ దగుశాస్తిఁ గావించెదను.

ఔరంగ—యశవంతా! నీసాహస మెంతవఱకుబోవునో నేనింతదనుక ప్రశాంతచిత్తుఁడనై వీక్షించుచుంటిని. నీవు నిర్భీకుఁడవని పలుమాఱు వింటిని—ఇపుడు ప్రత్యక్షముగ నెఱిఁగితిఁ. కాని భరతవర్షసామ్రాట్టైన యౌరంగజేబు యోధపురాధిపతి శాత్రవమున కిసుమంతయైన వెఱపొందడు. సమరాంగణమందు మరొకమారు ఔరంగజేబు కరవాలధాటిని చవిఁజూడఁగోరుదువేని యచిరకాలములో సఫలీకృతమనోరథుఁడవు కాఁగలవు. నర్మదాతీరకదనమం దౌరంగజేబు దండతాడనమెట్టిదియో మహారాజు బాగుగఁ జవిఁజూడఁ జాలకపోయె

అని తోఁచెడిని!

యశవంత—నర్మదాతీర కదనమందు జయోపేతుఁడవైతినని విఱ్ఱవీగుచుంటివా! రసపుత్రోచితకృత్యము కాదనితలంచి, కృపాపురస్సరము గమన్నింపనెంచి, యశవంతుఁడు మార్గశ్రాంతులైన మొగలైనికుల డీకొనలేదు. లేకున్న, మదీయ వాహనీస్తబ్ధమిళిత నిశ్వాసమునౌరంగజీబు సైన్యములన్నియు నంబరసీమ కెగిరిపోయియుండును. అట్టికరుణకు మాఱుగ నౌరంగజీబిట్టి శౌర్యము జూపునని యశవంతుఁడు తలఁపలేదు. ఇది యశవంతుని యపరాధమే! విజయోపేతుఁడనైతిననియు, నెవరినో దండతాడన మొనరించితిననియు, దుర్వారగర్వంబున నంధుఁడవై నీవు పలుకుపలుకులకు నేనుమిగుల నక్కజపడుచుంటిని!

ఔరంగ—యశవంతసింహా! జాగ్రత్త! ఔరంగజీబు సహనమునకు గూడఁ బరిమితికలదని మొఱుంగుము! జాగ్రత్త!

యశవంత—మొగలాయీ! కలకుతులకా! నీబెదరింపు పలుకుల కీరసపుత్రుఁడు జడియువాఁడుకాఁడు. చిటికినవ్రేలెత్తు మానిసియొకఁడు గ్రుడ్లెఱ్ఱఁజేసి పండ్లు పటపట లాడించినంతమాత్రమున నీరాజపుత్రసింహము బెగ్గిలియగ్గలంపు జవంబునఁ బరుగిడదు. నేత్రములెఱ్ఱఁజేసి జయసింహునివంటి భీరుని వడఁకింపఁగలవు. యశవంతుని ప్రకృతి యన్య ధాతువుతోఁ దయారైనదని ("He is not made of the same metal," Shakespear) నీవఱకే యెఱుంగవు కాఁబోలు! యశవంతసింహుఁ డౌరంగజీబు రోషకషాయితనేత్రములను, అగ్నివమనంబులగు ఫిరంగిగుండ్లను, నొక్కవిధముననే తుచ్ఛముగ నెంచును!

మీర్ జుమ్లా—యశవంతా! ఏమినీస్పర్ధ!

యశవంత—మీర్ జుమ్లా! ఊరకుండుము! రాజులకు కలహముగుతేటి

వన్యసృగాలములు వారియభ్యంతరమున నిలుచుటొందులకు! మే మింకను చావలేదు! నీకార్యమునకింకను కాలంబున్నది! ఇదిగో! (నయుస్తఖానును జూపి) నిన్నంబోలు నుజ్జ్వలత సృగాలమిందే యూటలూపుచు గూర్చుండియున్నది!

నయుస్తఖాను మీర్ జుమ్లా (లోపలనుండి తరవారుల వెలికిం దీసి,) "అరే! కాఫర్! జాగ్రత్త!"

నయుస్తఖాను—ప్రభూ! ఈ ముక్కిడిరాజపుత్రుని నిప్పుడే మా కృపాణముల కెరగావించెదము! ఆజ్ఞయిండు!

(ఇంగితప్రాయస్వరముగ నౌరంగజేబు వారిని వారించును)

యశవంత—మంచి 'యుజ్జీ' కలసినది!

మీర్ జుమ్లా నయుస్తఖానులు!—మంత్రి సేనాధిపతులు!-ఆహా! యేమి, యీసృగాలసఖ్యము! వీనిప్రభు వెట్టివిశ్వాసఘాతుకుండో—వీని తేం డెట్టి శఠుండో యీజంతువులు రెండును నట్టివే! ఒక పెద్దవరడునక్క రెండుగుంటనక్కలు!

నయుస్తఖాను—స్వామీ! ఈ కాఫరు పేలుడు మీ చెవుల సోకుట లేదా? భారతసామ్రాట్టు సమ్ముఖమునని—

యశవంత—ఏమీ భారతసామ్రాట్టా! భారతసామ్రాట్టెవరు?

నయుస్తఖాను—భారతసామ్రాట్టు పాదుషాహా గాజీ యులంగీర్!

[అవగుంఠితయై వనితయొకర్తె చివాలునం బ్రవేశించును.]

వనిత—అదిమిథ్యా ప్రలాపము!—భారతసామ్రాట్టౌరంగజేబు కాడు. భారతరసార్వభౌముండు షాజహాన్ షాహా షాజహాన్!

మీర్ జుమ్లా—ఈమె యెవతె?

వనిత—ఈమె యెవతెయందువా! ఈమె సామ్రాట్ షాజహాను పుత్రిక—జహానారా!

[ముఖమునుండి మునుగు తొలంగించును]- ఔరంగజేబూ!

నీముఖ మాకస్మికముగ బూడిదవలె వెల్లనైపోయె నేమి?

ఔరంగ — సోదరీ! నీవిచటి కేలవచ్చితివి!

జహానారా — ఔరంగజేబూ! "నీవిచటి కేలవచ్చితి" వని నేఁడీసింహాసనమున ధీరభావమున నాసీనుండవై మానుషస్వరమునఁ బ్రశ్నింపఁగలుగుచుంటివా? దుర్మతీ! మహారాజద్రోహాపరాధాభియుక్తిఁ గావించి — పితృద్రోహివై, పితృసింహాసనమున సంతుష్టచిత్తముతో నుపవిష్టుండవైనటించుటఁ బదచ్యుతుఁగావింప, నేనిపు డియ్యెడ కరుదెంచితిని.

ఔరంగ — ఎవరినాయకమున నట్లొనరించెదవు?

జహానారా — ఈశ్వరసాహాయ్యమున! కూళా! ఈశ్వరుఁడు లేఁడని తలంచుచుంటివా? — పైశాచికకృత్య మొనరించి, యీశ్వరుఁడు లేఁడని యోచించుచుంటివా? ఈశ్వరుఁడున్నాఁడు! ఈశ్వరుఁడున్నాఁడు! అతఁడు నీ దుష్కార్యముల నన్నిఁటిని వీక్షించుచున్నాఁడు. నీవొనరించిన నేరములకతఁడు నీకుఁ దగుదండనము విధింపకపోఁడు! — కఠినుఁడా! భగవానుఁడు లేఁడని తలఁచి, భయరహితుఁడవై యుండకుము! జాగ్రత్త!

ఔరంగ — నేనిచటఁ గూర్చుండి, యీశ్వరప్రేరితకార్యమునే సలుపుచుంటిని!

జహానారా — దురాత్మా! ఊరకుండుము! ఈశ్వరపవిత్ర నామమును నీజిహ్వతో నుచ్చరింపకుము! ఆపాడునాలుక దగ్ధమైపోవును! నిర్ఘాతమా! ఝంఝామారుతమా! భూకంపమా! జలోచ్ఛ్వాసమా! అగ్నిదాహమా! — మఱిడిజాడ్యమా! మీరలు లక్షలకొలఁది నిరీహనరనారుల మట్టుపెట్టుచుందురు! కాని యిట్టికట్టిడి ప్రముకు కుఁ దుఃఖ మెట్టింపరేమి!

ఔరంగ — మహమ్మదూ! ఈయున్మాదిని నిచటనుండి దీసికొని

పొమ్ము. ఇది రాజసభ—కళత్రాగారముకాదు! మహమ్మదూ ఆజ్ఞాపాలన మొనరింపుము!

జహానారా—షాజహానుసార్వభౌముని దుహితను స్పృశింప నీసభాస్థలమున నెవరికిశక్యమో చూచెదంగాక! ఔరంగజేబుపుత్త్రుండైనను అతని బుట్టించిన దేవుండైనను, నన్నంటనెవ్వరు సాహసింతురో చూచెదను!

ఔరంగ—మహమ్మదూ! ఈడ్చికొనిపొమ్ము!

మహమ్మదు—తండ్రీ! మన్నింపుండు నాకట్టి సాహసము లేదు.

యశవంత—షాదుషాహజాది (పాదుషాతనయ) యెడల ద్రోహాచరణమును మేము సహింపంజాలము!

సభికులందఱు—సహింపంజాలము! సహింపంజాలము!!

ఔరంగ—సభికులారా! మీరనినది నిక్కమును! క్రోధాంధుండనై, నిజసోదరియని తలంపక, షాజహాను సార్వభౌముని కుమారియని యోచింపక, యీసీమంతినీచూడామణి కవజ్ఞచూప గడంగితిని. సోదరీ! నీవంతఃపురమున కరుగుము ఈ సింధుకోలప్రాంతదేశుల కుత్సితదృష్టుల నీపైం బడనీయకుము. సభికులసమ్ముఖమున నిలువం బడుట షాజహాను చక్రవర్తి తనయకు గౌరవలోపముకాదా? ప్రియసోదరీ! నీవంతఃపురమున కరుగుము

జహానారా—ఔరంగజేబూ! నీవు నాకు నీతుల గఱపనక్కరలేదు. ప్రకాండభూకంపమున హర్మ్యరాజి భిన్నభిన్నముగుతఱి నసూర్యంపశ్యలగు రాణివారు సైతము సుంతైన సంకోచింపక చివాలున మార్గమధ్యమందు ప్రాలుదురు. భారతవర్షము నేండట్టి భూకంపావస్థయందున్నది! నేడొక ఘోరదౌర్జన్యముకతన మహాసామ్రాజ్యమొకటి చూర్ణీకృతమైపోయెను! ఇప్పట్టున పూర్వనియమములు చెల్లవు. అవాచ్యదుర్నయంబును, భయానకమహా విప్లవంబును,

దున్నహాదౌష్ట్యంబును, భారతరంగమందు నేఁడభినీతములైన తెఱం గున నింతకుపూర్వ మెన్నఁడును గాలేదు. ప్రపంచశాశాస్త్రములు నేఁడు నీతిధర్మములుగ బిలువఁబడుచున్నవి! ఈకార్యాంచు మేఘ శాబకంబు లనిమేషనయనములై, వానిని విలోకించుచున్నవి! న్యాయవివేక మనుష్యత్వములాదియైన మహత్తరగుణములు నేఁడు దుర్నీతిప్రవాహమందు బడికొట్టుకొనిపోవుచున్నవి! నీచస్వార్థ సిద్ధియే ధర్మనీతియైనది. సైన్యాధ్యక్షులారా! అమాత్యశేఖరు లారా! సభ్యమహాశయులారా! మీ తేఁడగుషాజహాను సజీవుఁడై యుండ అతని సింహాసనమున నీ తులువనెట్టిసాహసమునఁ గూ ర్చుండబెట్టితిరో నేనెఱుఁగఁ గోరుచుంటిని.

ఔరంగ—సభాసదులారా! ఈప్రదేశమునుండి సాసోదరిపోనిచ్చు గింప నిచో మీరలు వెలుపలకరిగి సామ్రాట్టుతనయ గౌరవమును కాపాడుఁడు.

[ సభికులు వెలుపలకరుగ నుద్యుక్తులగుదురు. ]

జహానారా—నేను మిమ్ము నిలువుడని నియోగించుచున్నాను. షాజహాను కుమారి యాజ్ఞనుల్లంఘింపకుఁడు. నేను మీకడకు స్వ్రేల్ఛాక్రంద నము సలుపరాలేదు. నిజదుఃఖమును మీకడ వ్యక్తీకరింప రాలేదు. వృద్ధుడైన తండ్రికొఱకు వనితనని శంకింపక లజ్జాసంభ్ర మంబులఁ ద్యజించి వచ్చితిని. నాపలుకుల నాలింపుఁడు

సభికులు—సెలవిండు! సెలవిండు!!

జహానారా—శూరుండును, కృపాళుండును, ప్రజావత్సలుండును, అగు షాజహానును చక్రవర్తిగానుండ గోరుదురు. లేక కుత్సితుండును, పితృద్రోహియు, భ్రాతృద్రోహియు, పరస్వాపహారియు, నైన యౌరంగజేబు చక్రవర్తిగా గోరుదురో ముఖాముఖని మిమ్ముఁ బ్రశ్నింప నరుదెంచితిని. ఇవుడుకూడ ధర్మము నశించిపోలేదని

యెఱుంగుఁడు. ఇపుడుకూడఁ జండాంశు శీతాంశు లుదయింప విరమింపలేదు!—ఇపుడుకూడ తండ్రికుమారుల సంబంధ లతిక భిన్నము కాలేదు! నేఁడొక్క ముహూర్తమందొక ధూర్తుని కలుషంబుకతనఁ బ్రపంచనియమంబు వ్యతిరేకంబగునా? అసంభవమసంభవము! తన విజయదుందుభిచేఁ దపోవన పవిత్రశాంతమును హరించుటకు శక్తి నేఁడు మిగుల దృప్తమయ్యెనా! నిర్విరోధస్నేహ దయాభక్తుల వక్షముపైనుండి తనరక్తశకటమును దోలసాహసింప నేఁడధర్మమంత ప్రబలమై పోయెనా!—సభికులారా! ప్రత్యుత్తరమిండు. శూరులగుమీర లౌరంగజేబు భయంబు కతనఁగంపించి పోవుచుంటిరా? ఔరంగజేబెవండు? అతని భుజద్వంద్వమున నెంత బలమున్నది? వానికి శక్తి మీరలే యనియెఱుంగరా? ఆకూళ్,నచట గూర్చుండఁబెట్టిన దెవరు? మీరలేకదా! వానికీపదవి నొసగుటకు నొసంగకుండుటకుఁ గర్తలు మీరే! వానియుత్కృష్టదశలు మీపై నాధారపడి యున్నవి. తలఁచినంత మాత్రమున మీరేకార్యము నైనఁ జేయఁగలరు. ఇచ్ఛగించుచో మీరలిప్పట్టున నా యసత్యవాది నటనుండ బిఱబిఱయీడ్చివైచి వాని పాపంబునకుఁ దగు శాస్తిగ బురదయందు బొరలాడఁజేసి వాని పొంగడంపఁ జాలుదురు! మీర లిపుడుకూడ షాజహానుసార్వభౌము నెడనవ్యాజప్రేమఁ జూపుచో, ముదుసలి సింగమని తలఁచి యతనిఁ బదాఘాత మొనరింప నిచ్ఛగింపనిచో, మీరలు మనుష్యులే యగుచో, నేకగ్రీవముగ "జయ్ సామ్రాట్ షాజహానుకు జయ్!" అని యొకజయధ్వానము సలుపుఁడు! మీరలు చూచుచుండగనే యీదురాత్ముని కరమందలి రాజదండము నేలపైఁగూలును!

సభికులు—జయ్! సామ్రాట్ షాజహానుకు జయ్!

జహానారా—మంచిది! నేనుమిగుల సంతోషించితిని—

ఔరంగ—[సింహాసనమునుండి దిగ్గి]—చూచితిరి! అయినను నేనీ మహూర్తమందే సింహాసనమును బరిత్యజించుచుంటిని! సభాసదులారా! జనకుఁడు రోగగ్రస్తుఁడు.—పరిపాలన మొనరింపనశక్తుఁడు. అతఁడు శాసనశక్తుఁడే యగుచో, దక్షిణదేశమునుండి నేనిచటికి రావలసిన యక్కఱయే యుండకపోవును. రాజ్యరశ్ముల (Reins of Government) నేను షాజహాను సార్వభౌముని కరములనుండి దీసికొనలేదు—దారాహస్తములనుండి గైకొంటిని. పూర్వమువలె నాగ్రాప్రాసాదమున, తండ్రి సుఖియై స్వేచ్ఛగా జీవనము గడుపుచున్నాఁడు. దారాయే ప్రభువు కావలెనను వాంఛయుండిన, మీయభీష్టమును సత్వరమే వ్యక్తీకరింపుఁడు. నేనిపుడే వాని నిచ్చోట కాహ్వానించెదను. దారా యననేల? యశస్తిలకుండగు యశవంత మహారాజుగాని, శూరశిఖామణియగు జయసింహమహారాజుకాని ఈరాజ్యపాలన తంత్రమును, దమ యుత్తమాంగములపై నిడుకొన నిచ్ఛగించువారు మఱెవ్వరుకాని, యీసింహాసనమందాసీనులుగాఁ గోరిన, శంకారహితస్వాంతుండనై, నేనిచటినుండి యిప్పుడు వెడలిపోదును! ఒకవైపున దారాయు, మఱొక దిక్కున సుజాయు నింకొక మూల మురాదును, గర్భశత్రువులై పయిఁబడ నువ్విళ్ళూరుచుండ, నెవ్వరైన నీసింహాసనమందాసీనులుకాఁ గోరిన నట్టే గావింపుఁడు! మీసమ్మతి ప్రార్థనల చేతనే నేనీపీఠమున నుపవిష్టుఁడనైతినని విశ్వసించుచుంటిని. ఈ సింహాసన మేమో యొక యుత్కృష్ట పురస్కారమనియు, ననిర్వాచ్యసుఖదాయకంబనియుఁ దలంపఁ బోకుఁడు!—వినీతుండగు నీ యౌరంగజేబున కిదొక కఠినదండనమని యెఱుంగుఁడు! నేఁడు నేను సింహాసనముపైఁ గూర్చుండలేదు—చారిదస్తూపోపరిభాగమున నుపవిష్టుఁడనైతినని నమ్ముఁడు! అంతియకాక దీనికతననే నేనునామకార్యమాత్రపుచేయను

కొంటినని యెఱుంగుఁడు! దారాయే చక్రవర్తి కావలెననియు, పవిత్ర హిందూస్థానము సకలధర్మపీఠమై, యరాజకభీభత్స విప్లవములతో నిండి యుండ వలెననియు, మీరలు కోరుచో నేఁడే— యీక్షణమందే నేను మక్కాకుఁ బోవుచుంటిని. నా కామక్కా పరమసుఖదాయకంబు! సభాసదులారా! సుహృద్వరులారా! ఏమనెదరో తెలుపుఁడు—

(సభికులందఱు నిస్తబ్ధులై యుందురు)

ఔరంగ—చూడుఁడు! నేనిప్పుడే నా మకుటమునుదీసి, మహాత్ముఁడగుషాజహాను సార్వభౌముని స్మరించి, సింహాసనముపై నుంచుచుంటిని! సామ్రాట్ నామమున నేఁడు నేను సింహాసనమందాసీనుండనగుట నిక్కువమే!—కాని బహుదినము లాస్థానము నలంకరింపఁ దలంపలేదు. సామ్రాజ్యమందు శాంతిస్థాపన మొనరించి, దారాయొక్క విశృంఖల ప్రభుత్వమందు నియమంబునెలకొల్పి, మీర లెవరిహస్తములందిడి నాజ్ఞాపింతురో, వారికరములందీరాజ్యమునువిడచి, నేను మక్కామహాక్షేత్రమున కరిగెదను. నేనిచ్చో నాసీనుఁడనై యున్నను, నాదృష్టు లాదిక్కునకే పరుగిడుచున్నవి! జాగ్రదవస్థయందు మక్కాయే నా చింత!—నిద్రావస్థయందు మక్కాయే నాస్వప్నము!!—జీవితకాలమందు మక్కాయే నా ధ్యానము!!!—పవిత్రచిత్తుల కమ్మహాతీర్థమే తగుచోటు కాని భర్మహర్మ్యమందలి స్వర్ణసింహాసనములు కావు. అయినను ప్రజాహితుండనగుటంజేసి, నిజమోక్షచింతనువీడి, అనిచ్ఛాపూర్వకముగఁ బ్రస్తుతము సింహాసనమందుఁ గూర్చుండవలసివచ్చినది. కాని, మీరలంద ఱేకగ్రీవముగ ననుమతి నొసంగినచో, రాజ్యభారమునువీడి, నేనీ ముహూర్తమందే మక్కాకు బోయెదను. అట్లొనరించుట నాకు పరమాదృష్టమని యెఱుంగుఁడు. పిమ్మట

నాకొఱకై మీరు చింతింపవలదు. మీహృదయములపై జేతుల నుంచుకొని, పీడనముకావలయునో లేక పాలనముకావలయునో, యీప్రజావత్సలునకుఁ దెలుపుఁడు. మీ యిష్టమునకు విరుద్ధముగ శాసనదండమును చేపట్టుటకు నేసాహసింపను. కాని,—మీయభీష్టానుసారముగనైన నేనిచ్చో నిలువంబడి దారాయొక్క యుచ్ఛృంఖలాత్యాచారము నీకనులతో వీక్షింపఁజాలను! ప్రాణతుల్యులగు ప్రజలు పీడితులగుచుండ నేనెట్లు సహించియుండఁ గలుగుదును! మిత్రులారా! మీయభిప్రాయమేమో తెల్పుఁడు! —(తనయునుద్దేశించి) మహమ్మదూ! కాలయాపనముఁ గావింపవక, మక్కాయాత్రార్థమై తగుసన్నాహము సేయుము. విలువగలవలువల వెనుకవిడిచి నాకాషాయవసనముల మూటగట్టుము. జపమాలను మఱువకుమీ!—(సభికుల నుద్దేశించి) సుహృద్వరులారా! ప్రాణమిత్రులారా!! ఇఁక నాకు సెలవొసంగుఁడు,—లేకున్న మీయుద్దేశ్యమేమో తెలుపుఁడు!

(Aurangzeb's peroration, a giagantic piece of bamboozlement as it is, smacks of *Argumentum ad populum.*)

[The reader would perceive that Aurangzeb, wearing the garb of a friar, would have the gullible pegole construe his intentions as ineffably sacrosanct. Albeit the character of Aurangzeb, whose dark deeds like those of Richard III, are propelled by the gabrinising force of motive-power, is not analogous *intoto* with that of Iago whose hellish plot is engineered as a mere 'motive-hunting of a motiveless malignity' and albeit we can find in Aurangzeb (to use the expression of Henry V) 'some soul of goodness would we observingly distil it out,' which is absent in the prince of villians, to whom 'Virtue is a fig inasmuch as it is in ourselves that we are thus or thus' and who is the very incarnation of *absolute* evil, yet Aurangzeb's expatiation convinces us that both of

them are endued with prodigious powers of dissimulation; that there is no mystery whatsoever in their psychology; that *absolute* egoism is their creed; that they invariably 'plumed up their will in knavery'; and that evil, however colossal it might be, is not incompatible with exceptional powers of will and intellect, insight and ingenuity, address and adroitness, quickness and versality and patience and self-control which— matchless and phenomenal as they are—even Socrates on the ideal sage of the stoics should envy.]

సభికులు—జయ్‌సామ్రాట్ ఔరంగజీబుకుజయ్!

ఔరంగ—మంచిది. మీయభిమతము నెఱిఁగితిని. ఇపుడు మీరలీసభను వీడి, వెలుపలికరిగి, సార్వభౌముఁడైన షాజహాను తనయ గౌరవము నిల్పుఁడు.

[ఔరంగజీబ్, జహానారాలు తక్క దక్కుంగల వారలందఱు నిష్క్రమింతురు]

జాహానారా—ఔరంగజీబూ!

ఔరంగ—ఏమి నాప్రియసోదరీ!

జాహానారా—ఏమి నీయింద్రజాలము!—నిన్ను బ్రశంసింపక యూరకుండఁ జాలకుంటిని. ఇంతవనుక విస్మయంబున నీరవనై పోతిని. ఏమి నీమాయ! స్మృతికి వచ్చునరి కంతయు ముగిసిపోయినది.— ఆహా! నీవెంతజిత్తుల మారివి!

ఔరంగ—ప్రియసోదరీ! నేను వసుమతీకాంతుఁడనై యున్నంతకాలము నీకుఁగాని పూజ్యుఁడైన జనకునకుఁగాని, యెట్టిలోటును గలుఁగనీయనని యల్లానామమున స్మరించి శపథ మొనరించు చుంటిని.

జాహానారా—ఏమి నీ చాతుర్యము!

శ్రీ

# షాజహాన్

## తృతీయాంకము

### ప్రథమదృశ్యము.

ఖజూయాయం దౌరంగజేబు శిబిరము—రాత్రికాలము

ఔరంగజేబొక చతురంగపీఠమును ముందిడుకొని దానిని చూచుచుండును.

ఔరంగ—ఇదిగో! నేను నా 'బంటు'ను ముందుకుఁ ద్రోయుచుంటిని! కాని యెదుటివాని 'గుఱ్ఱము' వేగనుడాయించి, నా 'బంటు'ను జంపనుంకించుచున్నది! పోనీ! అందువలన నాకు విశేషనష్టము కలుగదు. ఇదిగో! నా 'శకటు' మూలనుండి వచ్చి యెదుటివాని 'గుఱ్ఱము'ను జంపనున్నది! కాని;—అదిగో! రెండవవైపు వాని 'శకటు' ముందుకేగ శంకించుచున్నది! సరే—భయమేమున్నది! నా 'యేనుఁగు'ను దిన్నగఁ బోనిచ్చెదను! కాని, యెదుటి వాని 'రాజు' గుఱ్ఱపుదాటుదాటి పైకి రానున్నాఁడు! రానిమ్ము! ఇదుగో! నాప్రక్కనున్న 'మంత్రి' మూలగనో, యెదురగనో పోయి ఆ 'రాజు'ను చంపదగిన వీలు చూచుచున్నాఁడు. శబాస్! గెల్చితిమి! శబాస్!! శభాస్!! నాయుద్ధప్రణాళిక కూడ నిట్టులే తయారు చేసెదను! [లేచిపచారు చేయును]

[మీర్ జుమ్లా ప్రవేశించును].

ఔరంగ—నీవు మూలనుండి ఫిరంగిఁ బేల్చుము. నేనుగజారూఢుఁడనై, చకితశాత్రవహీనులపైఁ బడుదును. మహమ్మదు తనయరదము

నెక్కి యొక్కమ్మడి రిపులఁ దార్కొనును. ఈ యూహ ఎత్తుల,
మూలమున మనము జయమునొందఁగలము.

మీర్‌జుమ్లా—యశవంత సింహుఁ డేవైపున నుండును?

ఔరంగ—అతని వలన మనకు విశేషము మేలు కలుగునని తలంచను.
వానిపై నొక కన్నుంచి కార్యము సలుపవలయును. వాని నుభయ
సైన్యముల నడుమ నిలుపుదము. అతఁడు సుజాపక్షమునవలంబించి,
మన కనిష్టముఁగావింపకుండ నప్రమత్తులమై చూచు చుండవలెను.
ఆబంటు తుందుగాఁ జచ్చినను మనకు నష్టమేమియుఁ గలుగదు.
ఏలనన, నీవు వెనుకఁగాచియుందువు. నేనును మహమ్మదును, నీ
వెనుకనుండి రిపులఁబరిమార్పఁ దగిన యదను వేచియుందుము.
విపక్షులు మొదట యశవంతుని రాజపుత్ర సైనికుల నెదురుకొం
దురు. యుద్ధముచేసి యతఁడు ముందుకేగిన యుత్తమమే; లేకున్న
మనము వెనకనే జాగరూకులమై యుందము. నిజసైన్యములతో
యశవంతుఁడు హతుండైననేమి! తుదకు మనమే జయమొందఁ
గలము—ఉషఃకాలముననే నీవు యుద్ధ సన్నద్ధుఁడవై యుండ
వలెను. ఇపుడు నీ వరుగవచ్చును.

మీర్‌జుమ్లా—చిత్తము మహాప్రభూ! [నిష్క్రమించును]

ఔరంగజీబు—యశవంత సింహా!—ఇదియొక పరీక్ష మాత్రమే!

(మహమ్మదు ప్రవేశించును).

ఔరంగ—తనయా! నీవు యశవంతసింహునకు దక్షిణభాగమందుం
దుము. మా తరువాతనే నీవు శత్రువుల నెదుర్కొన వలయును.
నీవు రణమునకు సంసిద్ధుఁడవై మాత్రముండుము. చూడు
మిదిగో! యుద్ధపరిశాలిక.

[మహమ్మదుకు చతురంగపీఠమును, వ్యూహచిత్రమును(Map)చూపును

ఔరంగ—గ్రహించితివా?

మహమ్మదు—గ్రహించితిని.

ఔరంగ—మంచి దిగఁ బొమ్ము. రేపటి యుదయమే సుమీ! యుద్ధము! [మహమ్మదు నిష్క్రమించును.]

ఔరంగ—సూజాకడ లక్షమందికన్న నెక్కుడు సైనికులున్నను, వా రశిక్షితులు. అందుచే మేము విశేషముగ శ్రమ పడనక్కఱలేదు. ఒక మాఱు వాని సైన్యములఁ జెల్లాచెదరుగావించినచోఁ గార్య సిద్ధియగుటకు సందియము లేదు—ఓహో! మహారాజ్జీ! రండు! దయచేయుఁడు!

(దిల్దారు సహితుఁడై యశవంతసింహుఁడు ప్రవేశించి,సలా మొనరించును.)

ఔరంగ—మహారాజ్జీ! ఒక సువార్తఁ దెలుప మిమ్మిచ్చోటి కాహ్వా నించితిని. చాలదూరమాలోచించి, వీరాగ్రేసరులగు మిమ్ము సైన్య పురోభాగమున నిలుపనిశ్చయించితిని.

యశవంత—(అబ్బురమున) ఏమీ!—అటులా!

ఔరంగ—ఆశ్చర్యపడు చుంటిరేమి!—దానికభ్యంతర మేమున్నది?

యశవంత—అభ్యంతర మేమియు లేదు.

ఔరంగ—మీ రేమో సంకోచించు చున్నట్లు తోఁచుచున్నది.

యశవంత—సైన్యపురోభాగమున మహమ్మదునే నిలుప వలయునని యీవఱలో నిశ్చితమైనదికదా?

ఔరంగ—మీరనినది నిక్కువమే! కాని నేనిపుడు నాపూర్వాభిప్రా యమును మార్చి కొంటిని. అతఁడు మీ దక్షిణ పార్శ్వమున నుండును.

యశవంత—మీ రెచ్చోట నుండెదరో—మీరు జుమ్లా స్థానమెచ్చట?

ఔరంగ—మీ వెనుకనే! నేను మీ వామభాగమున నుందును.

యశవంత—ఓహో! అటులా! గ్రహించితిని! మీరు నన్ను సందే

హించితిరి! మీరు నన్ను సందేహించితిరి.

ఔరంగ—మహారాజ్జీ! మీ రెంత చతురులు! ఎట్టి చాతుర్యమైనను, మీకడ నిష్ఫలము గావలసినదే! మిమ్ము మాకూడఁ దోడ్కొని వచ్చుటకుఁ గారణము మీరుమాకు బరమాత్మీయులని కాదు. మిమ్ము మావెంట దీసుకొని వచ్చినచో మేము లేనితఱి మీ రాష్ట్రాయందెట్టి కల్లోలమును గల్గింప కుండుటకే!—ఇట్లని మీరు బాగుగ నెఱుంగుదురని దలంచెద.

యశవంత—నా కంతవరకుఁ దెలియదు. నేను కూడ నొకచతురుఁడనే యనిమిగుల గర్వించుచుండు వాఁడను. కాని చాతుర్యమందు నేనుమీసమ్ముఖమున నొక శిశువుననియిపుడుగ్రహింపఁగలిఁగితిని.

ఔరంగ—ఇవుడు మీయభిప్రాయ మేమి?

యశవంత—ప్రభూ! రసపుత్రులు విశ్వాసఘాతకులు కారు. కాని మీరలు—ముఖ్యముగ మీరు, వారిని విశ్వాసఘాతుకులఁ గావిం చితిరి. ఇఁకనైనమీరు వారల నాక్షేపింపకుఁడు—వారల రేపవ లదు! రసపుత్రులవంటి మిత్రులు లేరనుట నిక్కము!—రసపుత్రుల లవంటి భయంకర శత్రువులు లేరనుట కూడ నిక్కవమే! ప్రభూ! జాగ్రత్త!

ఔరంగ—రసపుత్రా! ఔరంగజీబుముందు బొమలు ముడివైచి నిలి చిననేమియుఁ బ్రయోజనము లేదు. ఇఁక నాయాజ్ఞానుసారముగ నాచరింపుము!—లేకున్న నీయౌరంగజీబు నెఱుఁగుదువా?

యశవంత—ఎఱుంగుదును. ఔరంగజీబూ! నీవుకూడ యశవంతసింహు నెఱుంగుదువా? యశవంతుఁ డెవరికిని భృత్యుఁడు కానేరఁడు. అతఁ డెవరియాజ్ఞను బాలింపఁడు.

ఔరంగ—కాఫర్! ఔరంగజీబెన్నఁడు నెవనిని మన్నింపలేదనియు, నిఁక నెన్నఁడు మన్నింపఁడనియు నెఱుఁగుము! భారత రాజేశ్వ

రునికడ నీ బీరములు పనికిరావని తెలియుదా యేమి! దూరమాలో చింపుము!

యశవంత—ఈయశవంతుఁడుకూడ నెన్నఁడును నెవరికిని భయపడలే దనియు, ఇఁక నెన్నఁడు భయపడడనియు, నెఱుంగుము! యోధ పురాధీశ్వరుకడ నీబెదరింపుపలుకులు పనికిరావని తెలియదాయేమి! దూరమాలోచింపుము!—

ఔరంగ—(కొంచెము నేపూర కుండి సన్మానపూర్వకముగ) మహారాజా! ఏమిమీసాహసము!

యశవంత—ఔరంగజేబీ! ఏమిమీసాహసము!

ఔరంగ—(కోపప్రకంపితాంగుఁడై) రాజపుత్రా! నిన్నీముహూర్తమం దే నేనుబంధించిననీవేమిచేయఁగలవు?—నిన్ను రక్షించువారెవరు?

యశవంత—(కత్తి రొయిరనుండితీసి) నన్ను రక్షించున దీఖడ్గమే. దురాత్మా! ఈదుర్దినములందు కూడ మహారాజ్ యశవంతుని యింగి తమాత్రమున సహస్రరాజపుత్ర కృపాణములొక్కమారు భాస్కర మ్యూతులందు ధగధగమని మెఱయుచు, వెల్వడునని యెఱుంగుము! ఈ ప్రతికూలసమయమందు గూడ రాజపుత్రులు రాజపుత్రులే యని తెలిసికొనుము! అప్రమత్తుండవై మెలంగుము! అహంకార మును జంపుకొనుము! లేకున్న నరిష్టమువాటిల్లును!

[చివాలున వెడలిపోవును]

ఔరంగ—గుటితప్పిపోయినది. కొంచెము ముందునకు సాగితిని. ఈ రాజపుత్రులను నేను బాగుగ గుర్తింప జాలకపోతిని. వారిదర్ప మెంత! అభిమానమెంత! ఘోతరమెంత!—గుఱుతింప లేకపోతిని!

దిల్దారు—స్వామీ! మీరు వారినెల్లు గుర్తింపఁ గలుగుదురు! మీరు ప్రవంచనా ప్రపంచమందు వసించుచుంటిరి! మీరుచూచుచున్నది వంచన!—ముఖస్తుతి!! విశ్వాసఘాతుకత్వము!!! ఆ విద్యలందారి

తేరిన వారిని వశమొనరించు కొనుటకు మీరుసమర్థులు. రసపుత్ర శూరులుండు ప్రపంచ మింకొకమాదిరిది! ఆ ప్రపంచమందలి ప్రజలకుఁ బ్రాణముకంటె మానమధికము!

ఔరంగ—ఉహూ!—ఇప్పటికైన బ్రతీకారముగావింపగలుగుదునేమో చూచెదఁగాక. కాని వ్యాధియిపుడు వైద్యుని చేయిదాటి పోయి నట్లు తోఁచుచున్నది!

[నిష్క్రమించును]

దిల్దారు—(తనలో) దిల్దారూ! నీవు నూది మొనవలెఁ బ్రవేశించితివి—ఇపుడు నాగటికఱ్ఱువలె వెలువడకుము! అట్లగునేమోయని భయ పడుచుంటిని. ప్రథమమున బాలకుఁడవు! పిదప విదూషకుఁడవు! తరువాత రాజకీయవేత్తవు! అటుపిమ్మట దార్శనికుఁడవు!—పదపడి?...[Dildar's Climax, when turned into Anticlimax, would remind us of Dryden's Bathos "...*. ..who in the course of one revolving moon was lawyer, statesman, fiddler and buffoon."]

(ఇంతలో నౌరంగజేబు మీర్ జుమ్లాలు మరలఁ బ్రవేశింతురు)

ఔరంగ—ఎట్టి యనిష్టమును గావింపనేరకుండున ట్లప్రమత్తుఁడవై చూచుచుండుము.

మీర్ జుమ్లా—చిత్తము మహాప్రభూ!

ఔరంగ—ఫేషకోణములందలి రక్తవర్ణము మిగుల దీపించుచున్నది. వారికి భయమేమియు లేనట్లుతోఁచినది. రసపుత్రులందరిట్టివారే యని తలఁచెద.

మీర్ జుమ్లా—ప్రభూ! ఒకఫిరంగిగుండుకంటె నొకరసపుత్రుఁడే భయం కరుండని నాతలంపు.

ఔరంగ—ఔను! నీవనినది నిక్కమే! మిగులజాగరూకుఁడవై యుంౘ వలయును.

మీర్ జుమ్లా—చిత్తము.

ఔరంగ—ఒకమాఱు మహమ్మదు నిటకుఁబంపుము—వలదు. నేనే వాని శిబిరమున కరిగెదను.

[నిష్క్రమించును]

మీర్ జుమ్లా—ఈ యుద్ధమును దలఁచినపుడెల్ల నౌరంగజీబు విచలితుడగుచున్నాఁడు. ఇదివరకెన్నఁడును లేదు. వెఱచుచు నెరచుచునే అతఁడు రణరంగమునకు సాగుచున్నాఁడు. ఇదియస్వాభావికమే!—భయంకరమే! ఏల!—

దిల్దారు—ఏమి యాయుత్తేజకము! అదితిలకెక్కిన నిషామహిమ! వజీరు సాహేబూ! తనయింటనే భయంకరుండగు శత్రువుండ విరోధమును బెంపొందఁజేయు మానవుఁడెన్నని ధర్మముల నేల సృష్టించుచున్నాఁడో నాకు బోధపడుటలేదు.—శత్రుత్వవృద్ధికై పెక్కుమతముల స్థాపించుటెందులకో తెలియకున్నది. సోదరులకంటె భయంకరులగు శత్రువులుందురా! అది భ్రాంతిమాత్రమే!

మీర్ జుమ్లా—సోదరునివంటి శత్రువులేడనుటకు గారణమేమి?

దిల్దారు—వజీరుసాహేబూ! కారణమడుగుచుంటివా! హిందూ మహమ్మదీయుల విరుద్ధాచరణముల వీక్షించుటలేదా? వారలకు సఖ్యము కలుగుట కలలోనివార్తయని నమ్ముము. ఉభయమతములవారిని భగవానుఁడో కేరీతిఁబుట్టించెను. భగవద్దత్తమానవులకు వారు తమ తమ చేర్పుకొలది పెక్కువన్నె చిన్నెలఁ గల్పించుకొని తురకలనిడు పైన గడ్డమునకు వ్యతిరేకముగా హిందువులు పిలకఁబెట్టిరి! పోనీ, వానిని వెనుకఁబెట్టక ముందుఁబెట్టిన తారతమ్యము విశేషముగ గన్పట్టకపోయెడిది. తురకలు పశ్చిమాభిముఖులై నమాజు చేయుదురు. హిందువులన్ననో తూర్పుగాతిరిగి ప్రార్థనసలుపుదురు! ఇఁక బట్టకట్టులో సరేసరి! గోచీ పెట్టక తురకలు గూడకట్టుకట్టెదరు.

హిందువులు తమబట్టకట్టునేర్పుగాన్పింపవింతకౌపీనములతో నలరారు చుందురు! ఎచటజూచినను బిళ్ళగోచీలవారే కాన్పింతురు. తురకలకు నొసటబొట్టవసరము లేదు కాని హైందవులు తమనొసట మంచి గంధపునగిషీలం జెక్కుకొని భస్మవిభూషితాంగులై యుందురు!—

మీర్ జుమ్లా—అవునవు—

దిల్దారు—ఉండు! ఇంకను బూర్తి కాలేదు. తురకలు ముఖప్రక్షాళన మొకరీతిగావించిన హిందువులు మఱొకతెఱంగున నలిపెదరు! తురకలు వెనుకనుండివ్రాసిన హిందువులు ముందునుండి వ్రాయుదురు. వారు క్రిందనుండి పైకివ్రాసిన వీరు పైనుండి క్రిందికి వ్రాయుదురు.

మీర్ జుమ్లా—అవునవు—

దిల్దారు—ఉండుమింకను ముగియలేదు. ముసల్మానులు హుక్కాం బీల్చిన హిందువులు—అందుముఖ్యముగ బ్రాహ్మణులు పొడుము బీల్చెదరు! వారలొకగ్రుక్కలో నెంతయో ధూమమును బీల్చిన వీరలొకపట్టున నైదుసేర్ల పొడుమును నశ్యభాండాగారములగు నాసికాపుటము లందెక్కించుచు ముక్కుతో వింత మృదంగశబ్దములు గావింతురు.—

మీర్ జుమ్లా—(నవ్వుచు)—అవునవును! నీవనినదంతయు నిజమే!

దిల్దారు—అయ్యయ్యో హిందువులు ముసల్మానుల యధీనమందొక విధమైన సుఖము ననుభవించుచుండిరని చెప్పవచ్చును. కాని సోదరుడు సోదరుని ప్రభుత్వము నంగీకరించుటలేదు. వజీరుసాహేబూ! ఇది భారతమాత దురదృష్టమేసుమీ!

మీర్ జుమ్లా—దిల్దారూ! నీవునిక్కమును వక్కాణించితివోయి!

దిల్దారు—[పోవుచుపోవుచు] నేనువచించినది సత్యమవునా కాదా?

మీర్ జుమ్లా—[రెండవవైపుగం బోవుచు] సత్యమే! సత్యమే! సత్యమే! స-

(నిష్క్రమించును.)

## ద్వి తీ య దృ శ్య ము.

ఆజయూయందు సుజాశిబిరము—సంధ్యాకాలము.

సుజా—సేనావ్యూహ పటమును (Map) విలోకించుచుండును. పూల దండఁజేతఁబట్టుకొని పాడుచుపియారా ప్రవేశించును.

సతత వినోద కాంతులను సర్వజనుల్ గని మోదమంద న
ప్రతిమ విభామహోజ్జ్వలుఁడు భానుఁడు నింగివెలుంగ వల్లవాం
చిత సహకారశాఖలనపించిన కోకిల లార్ద్రకంఠరం
జితమృదుగానమున్ బలుక చెట్లులనీడలఁ గూరుచుండి నీ
సతి తన ప్రేమహస్తములఁ జక్కఁగగుచ్చిన యీమహో
ద్భుత సుమహారహా మదముతో మెడఁదాల్చుము నీవు వల్లభా!

[ప్రసూనమాలను పియారా ప్రాణేశ్వరుని కంఠమందు వైచును.]

సుజా—(మందహాసమునఁబుచు) సతీ! ఇదినా విజయమాలయాయేమి? ఆహవమందు నేనింకను జయమొంద లేదని యెఱుంగవా?

పియారా—ఆహవ జయాపజయము లేవియో నేనెఱుంగను. నాకడ మీరు చిరవిజయులు! మీ ప్రేమ కారాగారమందు నేను బంధింపబడినదానను. మీరు నాప్రభువులు. నేను మీక్రీతదాసిని—భవచ్చరణాశ్రితపరిచారికను!—మీయాన ననుసరించి కార్యములసలుపుదానను! ఇపుడు మీయుదలయేదియో మీదాసి కెఱింగింపుఁడు.

[మోకరించును]

సుజా—(నవ్వుచు) వహవ్వా! ఇది ఒకక్రొత్త రకము వింతగ గనుపించుచున్నది!—ఓ ప్రేమబద్ధులారా! ఇక నీయిచ్ఛవచ్చిన తెఱుంగున సంచరింపుము. నీకునేను విడుదలనొసంగితిని.

పియారా—నాకు విడుదల యక్కఱలేదు—మీ దాస్యము మిగుల మధుర మైనది.

సుజా—ప్రేయసీ! నేనొక దీర్ఘాలోచనయందు మునిఁగిపోతిని!

పియూరా—దీర్ఘాలోచనయా! అదేమో తెలుపుఁడు. అది తెగుటకు నేనేమైన నుపాయము వెదకఁగలనేమో యాచెదను.

సుజా—[వ్యూహచిత్రమును (Map) చూపుచు] ప్రియా! చూడుము. మీర్ జుమ్లా ఫిరంగులతో నీస్థానమున సిద్ధముగ నుండును. ఈవైపునుండి మహమ్మదుమనపైఁబడుముకును. వానివెనుకభాగమున నేను వేల గుఱ్ఱపు రౌతులు కాచియుందును! ఆ ప్రక్కన గజారూఢుఁడై మనలనెదుర్కొన నౌరంగజేబు వేచియుండును!

పియూరా—ఏరీ! వారలందఱేరి! నేనొక కాగితపుముక్కను మాత్రము చూచుచుంటిని. మఱొండేమియుఁ గాన్పించుటలేదు.

సుజా—ఇప్పుడు నీకిదియర్థమైయుండును. ఈరీతి రేపటియుద్ధమున సైనికులు నిర్ణీత ప్రదేశములందు నిలుతురు. కాని యుద్ధము మొదలు పెట్టినతరువాత నెవ్వరేప్రక్కనుందురో చెప్పఁజాలము.

పియూరా—అట్లు మీరీవలకు నాకెన్నఁడు నెఱింగింపలేదేమి?

సుజా—స్వపక్షమందలి యోధులు ఫిరంగులఁబేల్చిన యాక్షణమందే తనయశ్వసైన్యమును శత్రువులపైకి దాటించి వారల నిర్జించు టౌరంగజేబున కలవాటు!

పియూరా—అట్లు మీరీవలలో నాకెన్నఁడు నెఱింగింపలేదేమి?

సుజా—పిల్లికిఁజెలగాట మెలుకకుఁబ్రాణసంకట మన్నట్లు పరిహాసంబుతో నేఁబాగులుచుండఁ బరిహాసంబుతో నీవు తక్కులాడుచున్నావు! యుద్ధముమాటలు నీకు కలలోని మాటలు!

పియూరా—అట్లు మీరీవలలో నాకెన్నడు నెఱింగింప లేదేమి?

సుజా—నేఁజెప్పినది నిజమా కాదా?

పియూరా—కాకేమి? కాకపోవుటేమి? కాని! మీకాసంగతి యెట్లు తెలిసెను!—ఆశ్చర్యము! ఇప్పటికిఁదెలిసినదా! ఆశ్చర్యము!!!

సుజా—ఏసంగతి!

పియారా—ఏసంగతియో మీరే తెలుపుఁడు.

సుజా—నాకుఁ దెలియదు!

పియారా—నాకంతకన్నఁ దెలియదు!

సుజా—నాసైనికులు శిక్షితులు కారు. యశవంతుని మనవైపునకుఁ ద్రిప్పఁగలిగినచో—అయిన నొకమాఱు లిఖించిచూచెదను కాని—చెలీ! నీసలహాయేమి?

పియారా—నాథా! నేను మీకు సలహాయిచ్చుట మానితిని.

సుజా—ఏల?

పియారా—ఏలనందురా! మీకు సలహా యొసఁగిన నొసఁగకపోయిన నొక్కటియే. మీకుఁదోఁచినట్లు మీరాచరింతురు కాని యొరులు చెప్పినట్లు నాచరింపరు. మీపట్టే మీకు కాని యొరుల పలుకులు చెవిఁబెట్టరు. పట్టుదల మనుజులతో నేమిచెప్పి యేమిలాభము. అదియుఁగాక మీకు వ్యతిరేకముగా నభిప్రాయమిచ్చినచో మిగులఁ గోపింతురు.

సుజా—ఇట్లు—అవును!—కోపము వచ్చుట నిజమే.

పియారా—అందుచేఁ బ్రియులగు మీరేమిపలికినను పతివ్రతయైన హిందూరమణివలె నెప్పుడును సరేయని యూఁకొట్టుచుందును.

సుజా—అవును. తప్పునాయందే యున్నది. నీయాలోచన కావలసి యున్నను, అది ప్రతికూలమగుచో నాకు కోపము వచ్చును. ఈదురభ్యాసము నన్ను వదలలేదు.

పియారా—ఆదురభ్యాసమును బోఁగొట్టుకొనవలెనన్న యుద్దేశమే మీకున్నయెడల, నే నొక్కనిముసములో దానిని బోఁగొట్టఁగలుగుదును. మీకట్టియభిప్రాయమే లేనందున నేనూరకుంటిని. ఆవిచారమును మఱచిపోవుటకై పాడుకొనుచుంటిని.

సుజా—పాడుము. నీగానము సురాసన్నిభము! అది యనేక కష్టములను

అనేకదుఃఖములను, మఱపించును. అదియే కఠినఘటనా సీమనుండి మనుజుని నొకదారికిఁ దీసికొనిపోవును. అపుడొక ఝంకారము తన్నావరించియున్నటుల వానికిఁదోఁచును. ఆకసముకాని,—పృథివి కాని, మఱేదికాని యపుడు కనుపింపదు. పాపము. రేపుకాని యుద్ధముజరుగదు. ఇంకను చాలా కాలమున్నది-కానున్నది కాకమా నదు. పాడుము—

పియూరా—అటులైన గానమును వినకపూర్వ మీపూర్ణజ్యోత్స్న లోకమున మీహృదయమును స్నానమాడించుఁడు. మీవాంఛా పుష్పములకుఁ బ్రేమసౌరభము నొసంగుఁడు. నేనుగానము సలుపు దును. పిదప మీ రాప్రసూనపుంజమును నాకుఁ బారితోషికముగ నర్పింపుడు.

సుజా—హాః! హాః! హాః! ఏమినీ యుపమానము! కాని రసముగ్రహింప సాధ్యముగుట లేదు. అయినను నీయుక్తులు కడుయుక్తముగ నుండె నని ఘంటాపథముగ వక్కాణించుచుంటిని—

పియూరా—ఉండుఁడు. నేనుగానము సేయుదును. వినుఁడు. ఈప్రదేశ మందొరగిలి, యీవిధముగఁ గూరుచుండుఁడు. మీచేతులనిచట నీరీతినుంచుఁడు. కన్నులు మూసికొనుఁడు. ఎట్లో యెఱుఁగు దురా?—ఓ! ఈశ్వరపుత్రా! తమమునుండి మమ్ము తేజము లోనికిఁ గొనిపొమ్మని పలుకుచు 'కనుమూఁతలతో' దేవుఁడిచ్చిన కొంచెము వెలుఁగునుగూడ పోగొట్టుకొని మఱింత చిమ్మచీకటిలో బడి ప్రార్థనసేయు క్రైస్తవులవలె కన్నులు మూసికొనుఁడు.

సుజా—హాః! హాః! హాః! మోదదాయకములైన పలుకుల నెన్నియో బలుకుచుందువు కాని, నీ వీబకధ్యానముచేయువారి నపహసించి నపుడెంత యాహ్లాదము కలుఁగునో!—ఏలనన నే నేమతమును విశ్వసింపను.

పియారా—వ్యాకరణ దోషము! ఎంత యాహ్లాదము కలుఁగునో యన్నప్పుడు అంత యనుపదమును, క్రియాపదమును కూడఁ దిగ మ్రింగివైచితిరి!

సుజా—దారాహిందూ మతపక్షపాతి—కపటి! ఔరంగజేబు మూఢ విశ్వాసియగు ముసల్మాను; లేనిపోని నూతనాచారములఁ దెచ్చి పెట్టును!—అతఁడును గపటియే! మురాదుకూడ ముసల్మానే, కాని మూఢ విశ్వాసికాడు.—కాని కపటి!

పియారా—మీ రేమతమును విశ్వసింపరు—కపటులు!

సుజా—నాయందుఁ గాపట్యమేమియు లేదు—నే నేదోయొక గొప్ప మతము నవలంబించినట్లు నటింపను. అట్టివాంఛ నాకులేదు. చక్రవర్తినిఁ గావలయునను దృఢ వాంఛయే నన్ను పీడించుచున్నది.

పియారా—ఆవాంఛయే కాపట్యము!

సుజా—అదెట్లు! దారాప్రభుత్వమును స్వీకరించుటకు నేనియ్యకొంటిని. కాని యౌరంగజేబు మురాదుల ప్రభుత్వమును నేనంగీకరింపఁ జాలను. నేను వారి యగ్రజుండను.

పియారా—కాపట్యము.—అగ్రజులగుటయే—కాపట్యము.

సుజా—ఏల!—అట్లందువేమి!—నేను ముందు జన్మించితిని గదా!

పియారా—ముందు జన్మించుటె కాపట్యము. ముందు బుట్టినంతమాత్రమున మీ గొప్పతనమేమియు లేదు. ఆహేతువుచేత సింహాసనారూఢులగుటకు మీ కెక్కుడునధికారము లేదు.

సుజా—ఏల లేదు?

పియారా—మన వంటవాఁడగు రహమతుల్లా మీకంటెఁ జాలముందుగ, జన్మించెను. అట్లులని మీకంటె నతనికి సింహాసన మెక్కుట కధికార మెక్కుడుండెనా?

సుజా—అతఁడు చక్రవర్తి పుత్త్రుఁడు కాడు.

పియారా—అగుట నేత్రమో?

సుజా—హా! హా! హా! నీవిట్టి శిక్షించెదవు! సరే. ఇకనీవు నీకిష్టమైన గాధను బాడుము

పియారా—(పాడును)

ప్రేమను జూపఁ జాలుటకుఁ బెక్కువిధానములుండ వానినిక్
నీమముతోడఁ గష్టపడి నేర్చితి; నీసతినైతిఁగాని నీ
నామము బాయకుండ కరుణానిధి! ప్రేమలతాంకురంబులన్
నామదినాటినాపురుష; నమ్ముము నీవిపుడీవిమోహామే
పేర్మిమనుగల్గజాలునని; ప్రేయసి వేడుకొంటియో! సఖా.

సుజా—సతీ! దేవుఁడు నిన్నెట్లు పుట్టించెనో!—ఈ సౌందర్య, మీరసికత, ఈసంగీత, మెంతయద్భుత మెంతయద్భుతము! ఇట్టిసర్వాంగసుందరినీశ్వరుఁడేకతిరమర్త్యభూమియందుద్భవింపఁజేసెనెంకాలకో?

పియారా—ప్రియతమా! మీకొరకే!

తృతీయదృశ్యము.

అహమదాబాదునందు దారాశిబిరము—రాత్రికాలము.

దారా—ఆశ్చర్యము! ఏదారా యొకప్పుడు సేనాపతి నరపతుల ననేకులఁ దనశాసన బద్ధులఁ గావించెనో,—అతఁడు నేఁడు వివిధజనపదములందుఁ బరిభ్రమించుచు, యూరియూరినుండి యూరియూరికిఁ బఱువు గొట్టఁబడుచు, నిలువనీడలేక, కట్టగుడ్డలేక కుడువఁ గూడులేక, పరవిలయకులం దాశ్రయము వేఁడుచుఁ గాలముఁ బుచ్చవలసి వచ్చెనే! దైవమా! ఎట్టియోగచాట్లు దెచ్చిపెట్టితివి! ఔరంగజేబు మురాదుల కూమల యింటివాకిటను నేనిపుడాశ్రయము గోరి పడియుండవలసి వచ్చెనుగదా! ఇట్టి దీనావస్థ!—విధీ! నాకేలగా వరింపఁ జేసితివి!

నాదిర—తనయుఁడైన సులేమాను వార్తలేమైనఁ దెలియవచ్చెనా?

దారా—వార్తలెన్నియుండును! ఒక్కటేవార్త! జయసింహుఁడు మన తనూజుఁ బరిత్యజించి, సైన్యసమేతముగ నౌరంగజేబుతోఁ గలిసెను. అభాగ్యుఁడైన కుమారుఁడు మిగిలిన కతిపయ సైనికులను వెంటఁబెట్టుకొని, లాహోరు నందు నన్నుఁగలిసికొన నిశ్చయించి హరిద్వార మార్గమున వచ్చుచుండ, మార్గమధ్యమం దౌరంగజేబు పంపిన సైన్యము శ్రీనగరమున కనతి దూరమున వాని నడ్డుకొనియెను. మన యాత్మజుఁ డిపుడు శ్రీనగరాధిపుఁడగు పృథ్వీసింహుని యింటి వాకిట నాశ్రయభిక్షను వేడుకొనుచున్నాఁడు.—సతీ! ఏమట్లు విలపించుచున్నావు?

నాదిర—ప్రభూ! విలపించుటలేదు.

దారా—విలపింపుము. విలాపమువలన దుఃఖభార మొకించుక తగ్గిపోవును.—కొంచె మూఱట కలుగును. కాని,—నేనట్లు విలపింపఁజాలకున్నాను! నాహృదయము బద్దలైపోవును!

నాదిర—మీరౌరంగజేబుతో మరల యుద్ధము చేసెదరా!

దారా—చేసెదను. నాకంఠమునఁ బ్రాణమున్నంతవఱకు, నేనౌరంగజేబు ప్రభుత్వము నంగీకరింపఁజాలను. యుద్ధమే యిపుడు నాకు కర్తవ్యము. ఆదుష్టుఁడు మోసమున నాముదుసలి తండ్రినిఁ గారాగారమున బంధించి, పితృసింహాసనమున భయము లేకుండఁ గూర్చుండి తనయదృష్టమునకు మిగుల నుబ్బితబ్బిబ్బగుచున్నాఁడు. తండ్రిని చెఱనుండి విడిపించునంత దనుక యుద్ధము చేసెదను. ఏమి? తలవంచితివి?—ఈసంకల్పము నీకు నచ్చలేదా?—ఎట్లు చేయనగునో నీవు తెలుపుము.

నాదిర—నాథా! నేనేమి చెప్పుదును. మీయిచ్ఛయే నాయిచ్ఛ కాని,—

దారా—ఏమో తెలుపుము.

నాదిర—ప్రియా! ఈయాతంకములు, ఈపలాయనము, ఈప్రయాసము మన కెప్పటికిని తప్పవా?

దారా—ఏమిచేయుదు! నన్ను చేపట్టినందుకు నీవు వీనిని సహింపక తప్పదు.

నాదిర—ప్రభూ! నేను నాకొఱకై చెప్పుటలేదు! మీ కొఱకే చెప్పుచుంటిని. మీకొఱకే నేనంగలార్చుచుంటిని! ఒక్కమా అద్దము జూచుకొనుడు. ఈశల్యావశిష్టమైన శరీరము; ఈనిష్ప్రభదృష్టి! ఈనెరసిపోయిన తల. హా! ఏమిదుర్గతి! ఏమిదుర్గతి!!—

దారా—నేడు నారూపము నీకు నచ్చకున్న నేనేమిచేయగలను?

నాదిర—ప్రియా! నామాటలు మీకు సరిగ నర్థమగుట లేదు.

దారా—ఇది మీస్త్రీజాతిస్వభావము!—ఎప్పుడును దేనికో యొకదానికై మీరు మూల్గుచుందురు! వనితలు పురుషుల సుఖమునకు విఘ్నస్వరూపిణులు. దుఃఖమునకుం బ్రేరేపకురాండ్రు!—'స్త్రీబుద్ధిః ప్రళయాంతక' మ్మను నార్యోక్తి నేనెఱుంగకపోలేదు.

నాదిర—(భగ్నస్వరమున) ప్రభూ! మీరు వచించినది సత్యమేనా యేమి? [విన్నబోయిన మోమున భర్తృబాహువులం బట్టుకొనును]

దారా—పోపొమ్ము! ఇపుడు నీరాగాలాపము నాచెవి సోకదు.

[చేతుల విదిలించుకొని, చివాలున లేచిపోవును]

నాదిర—(పెద్దపెట్టున నేడ్చుచు) దయామయా!—ఇంకనెందులకు!—ఇచటనే తెరదింపివేయుము? సామ్రాజ్యమును గోల్పోతిని! రాజ్యసుఖములకు దూరమైపోతిని. కంటకావృతమార్గములందు, దుస్సహప్రచండ సూర్యాతపమునందు, దుర్భరశైత్యమందు, ఆంకలిదప్పుల కడలుచు, నిలువనీడలేక, కంటినిండ నిదురలేక సుఖ మెఱుంగక

[దారా మరలఁ బ్రవేశించును.]

దారా—సతీ! నన్ను క్షమింపుము. నేనపరాధినైతిని! వెలుపలి కేగి నేఁ గావించిన దోసమును దెలిసికొంటిని. నన్ను మన్నింపుము.—

[నాదిర గోలుగోలున నేడువఁ దొడఁగును]

దారా—సతీ! అపరాధ మొనరించితినని యొప్పుకొనుచుంటిని! క్షమాభిక్ష వేఁడుకొనుచుంటిని, ఇంకను—ఛీ! దుఃఖింపకుము—నీవిట్టి బేలవై పోతివేమి? దివారాత్రములందు నా యంతరంగమం దెట్టి జ్వాల ప్రజ్వలించుచున్నదో నీవెఱుంగఁ గలిగినచో, నామాటలకుఁ దప్పు పట్టకుండెడిదానవు. సతీ! నీ ప్రియుని మాటలకు నీవిట్లు కోపింపఁదగునా!

నాదిర—ప్రియతమా! నేను మిమ్మెట్లు ప్రేమించుచుంటినో యెఱిఁగి యున్నచో, మీరట్టి కఠినోక్తులఁ బలికియుండరు.

సిపార్—(అస్ఫుట స్వరమున) నాయనా! అమ్మను నిందించినవారెవ్వరో యని తలఁచితిని, నన్ను మన్నింపుము. నిన్ను నేను దేవునివలెఁ బూజించెదను.

[జహారత్ నిష్క్రమించెను.]

నాదిర—నాయనా! నీవు దుఃఖింపకుము. నీజనకుఁడు నన్నేమియు ననలేదు! నేనభిమానవతిని దోషమంతయు నాయదియే!

[పరిచారిక ప్రవేశించును.]

పరిచారిక—ఖొదాబంద్ (ప్రభూ!) మీకొఱకై యెవరో వచ్చినారు!

దారా—ఎవరు!

పరిచారిక—అతఁడు ఘూర్జర దేశపు సుబేదారఁట.

దారా—ఏమీ! సుబేదారా!

నాదిర—నాథా! ఇఁక నేను లోనికరిగెదను.

[నిష్క్రమించును.]

దారా—(తనయు నుద్దేశించి) బాబూ! ఆతనినిచ్చోటికిఁ గొనిరమ్ము.

[పరిచారికననుగమించి సిపారు నిష్క్రమించును.]

దారా—ఆశ్రయము లభ్యమగునేమో చూచెదగాక.

[షాహనాబాజ్‌ను దోడ్కొని సిపార్ ప్రవేశించును.]

షాహనాబాజ్—వందేగి (సలాము) యువరాజ్!

దారా—వందేగి (సలాము) సుల్తాన్సాహెబ్!

షాహనాబాజ్—దేవరనన్నుఁ బిలిపించితిరా?

దారా—అవును! సుల్తాన్సాహెబూ! ఒకమాఱు మీదర్శనమును గోరియుంటిని.

షాహనాబాజ్—ఆజ్ఞయేమి?

దారా—ఆజ్ఞయా! సుల్తాన్సాహెబూ!—ఆదినములు గడచిపోయినవి. నేఁడు నేనొక బిచ్చమెత్తుకొనువాఁడను. మీకిప్పుడానతి నొసఁగువాఁ డౌరంగజేబు!

షాహనాబాజ్—ఔరంగజేబా! ఔరంగజేబునానతి యీ షాహనాబాజ్‌కు గాదు!

దారా—ఏమి సుల్తాన్సాహెబూ! నేఁడౌరంగజేబు భారతసామ్రాట్ కాఁడా?

షాహనాబాజ్—భారతసామ్రాట్టౌరంగజేబా! ఎవ్వఁడు స్వార్థత్యాగమను ఛద్మవేషమును ధరించి (He that masqueraded as a self-less person.) తనతండ్రికి విద్రోహము సలిపెనో,—ఎవ్వఁడు కృత్రిమప్రణయరూపమును దాల్చి నిజసోదరుల చెరఁబెట్టెనో ఎవ్వఁడు కపటధర్మవేషమున సింహాసనమును స్వాధీనము గావించుకొనెనో, అతఁడు సామ్రాట్టగునా! అంధపంగువు నెవనినైనఁ గొనివచ్చి సింహాసనాసీనుఁ గావించినచో భక్తివినయంబు లుట్టిపడ వానిపాద పద్మముల నొఁదలఁదాల్చి చక్రవర్తియని సేవింతునుగాని నేనాదుర్మా

ష్ఠుఁడు సార్వభౌముఁడగుటకు సమ్మతింపఁజాలను.

దారా—సుల్తాన్సాహెబూ! మీరట్లనుచుంటిరేమి. ఔరంగజేబు మీకు అల్లుఁడు కాఁడా!

షాహనాబాజ్—ఔరంగజేబునాకు అల్లుఁడే కాఁడు. నాకేకమాత్రపుత్రుండైనను శంకి పక వానితోటి సంబంధమును త్రోపుకొని తీరుదును. అధర్మమును నేనెన్నఁడు లాలింపఁజాలను. ఈ బొందిలో జీవమున్నంతవరకు నే నధర్మమును సహింపను! సహింపను!!

దారా—ఇపుడు తామేమిచేయ నిశ్చయించితిరి?

షాహనాబాజ్—యువరాజగు దారాపక్ష మవలంబించి యుద్ధము సలుపనిశ్చయించితిని. మొదటినుండియు నేనందులకై సంసిద్ధుఁడనగుచుంటిని. కాని, నా సామాన్య సైన్యమును దోడ్కొని, యౌరంగజేబు నెదుర్కొనుట దుష్కరము! దానంజేసి నేనిపుడు సైనికుల సమకూర్చుకొను చుంటిని.

దారా—ఎట్లు?

షాహనాబాజ్—సాయము జేయుమని ప్రార్థింప నమ్మకమైన భృత్యునొకనిని యశవంతసింహునికడ కంపితిని.

దారా—అతఁడు తిరిగివచ్చెనా!

షాహనాబాజ్—వచ్చెను.

దారా—సాయముచేయ యశవంతుఁ డంగీకరించెనా?

షాహనాబాజ్—సమ్మతించెను. షాహజాదా! (ప్రభూ!) వెలువరుఁడు. రండు! నేఁడు మీరునా యతిథులు! తాము చక్రవర్తి జ్యేష్ఠపుత్రులరు—భవిష్యచ్చక్రవర్తులు. నేనొక వృద్ధరాజభక్తుండను. వృద్ధ సామ్రాట్టు కొఱకై యుద్ధమొనరించెదను. రాజునకు జయలక్ష్మిని గూర్పఁజాలకున్నను, ఆతనికొఱకై ప్రాణముల విడువఁగలను. ముదుసలినైతిని! ఒకపుణ్యకార్యముచేసి పరలోక ప్రయాణమునకై

దారిబత్తెము సంపాదించుకొొందును.

దారా—అట్లైన తాము నాకాశ్రయము మొసఁగుచుంటిరా?

షాహానాబాజ్—యువరాజ్జీ! ఆశ్రయమందు రేమి! నేఁటినుండి నా నిలయము మీ నిలయము. నేను యువరాజుభృత్యుండను.

దారా—మీరు నిక్కముగ మహాత్ములు.

షాహానాబాజ్—స్వామీ! నేను మహాత్ముఁడఁగాను. సామాన్యమాన వుఁడను. నేఁడు నేఁజేయుచుంకించుకార్యము మహాస్వార్థత్యాగ కృత్యముకాదు. ప్రభూ! నాకెన్నియో యేండ్లుగడచినవి.—ఎన్నం డును నేనెట్టియధర్మకృత్యము నైనఁ దెలిసి చేయలేదని నొక్కి వక్కాణింపఁగలను. కాని మహాత్కార్యంబేమైనఁగావించి యుంటి నా యందురేమో! అదియుఁగూడలేదని చెప్పుచుంటిని. కాని నేఁడు మంచితరుణము లభించినపు డద్దానినేల దాటిపోనీయ వలయును.

[ఉభయులు నిష్క్రమింతురు.]

(జహరతున్నిసా మరలఁ బ్రవేశించుచు)

జహరత్—నే నెంత నిష్ప్రయోజకురాలను? ఏ కార్యమందును తల్లి దండ్రులకు సాయపడలేకుంటిని. ఆయుత్తముల తలపై నొకపెద్ద బరువునై యుంటిని. స్త్రీ జాతీ! నీ వెట్టి యధమజాతివి? జహరత్! నీ వెట్టి పనికిమాలినదానవు! తలిదండ్రుల దురవస్థ నెఱింగియు నేమియుఁ జేయఁజాలక మూఢురాలవై చోద్యము చూచుచుంటి వేల! ఆ దేవతలకై యెప్పుడో యొకమారు వేశికన్నీటి బొట్టును మాత్రము విడుచుచుంటివా! (కొంచెముసేపు నీరవమై యుండి) నేఁడు నేనేదేని కార్యమొనర్పవలెను ఆకార్యము మహాశైల శిఖ రమునుండి దుమికిన దుముకువలె ససమసాహసమై, భయంకరమై యుండు! ఏమగునో చూచెదఁగాక!

## చతుర్థదృశ్యము.

కాశ్మీరదేశమహారాజగు పృథ్వీసింహుని ప్రమోదోద్యానవనము (Pleasure Garden)—సంధ్యాకాలము.

(సులేమా నేకాకియై యుండును)

సులేమాన్—ప్రయాణమును శీఘ్ర పలాయన మొనరించి, తుదకీ దూరదేశమందీ శైలసంకుల భూమియందుఁ బడిపోతిని. జనకునకు సాయము సేయ బయలుదేరితిని. కాని, నాప్రయత్నమంతయు నిష్ఫలమయ్యె! ఆహా! ఏమి యీ సీమవర్ణనాతీతసౌందర్యము!—ఇది యొక పరిణత సంగీతమువలె, ఒక విచిత్రస్వప్నమురీతి ఒక గంభీర సౌందర్యము పోలిక గన్పట్టుచున్నది. స్వర్గమునుండి యప్సరస యొకతె యీ మర్త్యలోకమున విహరింప దిగివచ్చి పరిభ్రమణాయాసమున హిమశైలముపతటమున విలాసముగఁ జెక్కిటఁ జేయిజేర్చి, కాళ్ళు సాచి పరుండి తన తేజోమయ దృష్టులతో నీలాకాశమును బ్రకాశింపఁ జేయు తెఱఁగున నా కీవిషయము దోచుచున్నది. (చెవి యొగ్గి) ఏమి? యీ మధురస్వనము!

(దూరమందు సంగీతము)

సులేమాను—మధురస్వనము క్రమక్రమముగ సమీపించుచున్నది! ఏమి యీదృశ్యము? కింశుక నలంకరింపఁబడిన యొక పడవయందు, కొందరు కాంతలు కూర్చుండి, పడవను దామే నడుపుకొనుచు, హాయిగ గానమొనర్చుచు, వచ్చుచున్నారు. ఆహా! ఏమివారిసౌందర్యము! ఆహా! వారిసంగీత మెంత శ్రావ్యముగనున్నది! [అలంకరింపఁబడిన పడవయందు కూర్చుండి పాడుకొనుచు కొందరు సుందరీమణులు ప్రవేశింతురు.]

చారుకాంచన మణిరత్న హారపుష్య
రాగ మౌక్తిక భూషణ రక్తి దనర

మరకతప్రవాళ మాణిక్య మయము లైన
హారముల చిత్రకాంతు లొప్పారుచుండ
కాంచ నాంబర నవరత్న కాంతులొప్ప
కాంతి పూరంబు నన్నించి కాంతులెసఁగ
సాంద్రకర్పూర మృగముల చందనాది
వాసనాసామిళీతమయి యానగొలువు
పుష్పమాలా సుగంధ విస్ఫురితమైన
ప్రకృతి చిత్రము నేత్రపర్వంబొనర్ప
లక్ష్మినింబోలు మాభాగ్య లక్ష్మిఁ గాంచ
పడవలోనికి రండిఁక పౌరులార!॥

(కాంతలు జలయానమునుండి క్రిందికి దిగుదురు)

మనోరంజని—సుందరాంగా! నీ వెవఁడవు?

సులేమాన్—యువరాజైన దారానందనుఁడను.

మనోరంజని—షాజహాను సార్వభౌముని పౌత్రుండవా?

సులేమాన్—అవును.

మనోరంజని—మోహనాంగా! 'నీవెవతె' వని నన్నుఁ బ్రశ్నించుట లేదేమి?—నేను కాశ్మీర సీమయందలి ప్రధాన నర్తకిని—జేసి యుంపుడుకత్తెను. ఈపల్లవాంఘ్రులు నా చెలికత్తెలు (మందహాస మునలుపుచు) మనోజరూపా! రమ్ము! మాకూడ నీజలయాన మెక్కుము.

సులేమాను—(అబ్బురమున) ఏమందువు! మీకూడ నౌక నెక్కుమని యెదవా! రమణీ! నీ వెంత యభాగినివి! పడవ నే నెక్కుటెందులకు?

మనోరంజని—సుకుమారా! నీవు పసిపాపవుగావు! నీవు మా వృత్తి నెఱుంగుదువా?

సులేమాన్—ఎఱుంగ కేమి! ఎఱుంగుదును! ఎఱుంగుటం జేసియే నేనింత చింతిలు చుంటిని. ఈ యౌవనసౌందర్యసౌష్టవము లట్టి వృత్తికిఁ దగుసామగ్రులా! ఈ యనమానలావణ్యముతో వాణిజ్యము సలుపుట కా భగవానుఁడు మీకు దానిని బ్రసాదించెను? రూపంబునకును, శరీరంబునకును బ్రేమయే బ్రాణమం చెఱుంగవా? హేమాంగీ! నిప్రాణహీనశరీరము నాకెందులకు?

మనోరంజని—ఏమీ! ప్రేమయే మో, మేమెఱుంగమనుచుంటివా?

సులేమాన్—ఎట్లెఱుంగుదురు? ఏకాంతలు సౌందర్యముతో వాణిజ్య వ్యాపారము సలుపుచుండిరో, ఏరమణులు మందహాసమును సైతము విక్రయించుచుండిరో, ఆయింతులు నెయ్యము నెట్లెఱుంగఁ గలరు! వాల్గంటులైన వారకాంత లవ్యాజప్రేమ నెట్లు చూపఁ గలరు! స్వార్థాభిలాషిణులుగాక, త్యాగసుఖము నెఱింగినకాంతామతల్లులు మాత్రమే యనురాగము చూపఁగలరు! జననీ! ఆత్యాగ సుఖమును నీయట్టి యభాగినులెట్లెఱుంగఁగలరు!

మనోరంజని—అటులైన మేమెన్నఁడును బ్రేమించియే యెఱుంగమా?

సులేమాను—ప్రేమించియెఱుంగ కేమి! మీ జాతివారలు ప్రేమించు వస్తువులు పెక్కులున్నవి. పచ్చనియుష్ణీషములను, వజ్రాంగుళీయకములను, ముఖమల్ పాదరక్షలను, స్వర్ణసులోచనములను, దంతవేత్రములను, మీరు మిగులఁ బ్రేమింతురు. కుటిలకుంతలములు, ఆకర్ణాంతనేత్రములు, మనోజ్ఞనాసికలు, మధురాధరములు, నరశోష్ఠములు, హాసితవదనములు, మీకుఁ బ్రియంబులు! నాస్వర్ణవమాన శరీరమును గాంచియో, లేక సామ్రాట్ పౌత్రుఁడనని యెఱింగియో, నీవు మోహించితివి. ప్రణయమన నిదికాదు. ఆత్మతో నాత్మను బ్రేమించుటే ప్రణయము!—తల్లీ! నీవిఁకఁ దొలఁగి పొమ్ము.

మణిమంజరి—అక్కా! మనప్రభువిట్లే యుచుదెంచుచున్నాఁడు.

మనోరంజని—నేఁడీయనమయు మంత్రణఁ డియ్యేడకు రాఁగతంబేమి?
చెలీ! ఇఁకఁ బోదమురమ్ము—యౌవనుఁడా! దీనికిఁ బ్రతిఫల
మనుభవింపకపోవు! మమ్మేఁజిత్రజు బాఁటఁబడఁద్రోసి నీవిచట
నెంతకాలముందువో చూచెదముగాక! సఖులారా! పోవమురండు!
[పోఁబోవుదు]

సులేమాను—అమ్మా! కోపించుటెందులకు? మీయందు నాకెట్టి
ఘృణాది ద్వేషములు లేవు. కేవల మనుకంపమాత్రమే!—ఆయను
కంపయుపారమైనది. అతిగంభీరమైనది.

[గానమొనరించుచు కాంతలు నిష్క్రమింతురు.]

సులేమాను—ఆశ్చర్యమాశ్చర్యము! ఏమియీయపార్థివ లావణ్యము!
ఏమియీనయనజ్యోతి! ఏమియీయప్సరస్సంభూతఘటనము— ఏమి
యీకిన్నరస్వరము! అంతసౌందర్యమూ!—కాని, అంతకుత్సితమూ!
[నడచును]

[శ్రీనగరయేలికయగు పృథ్వీసింహుఁడు ప్రవేశించును]

పృథ్వీసింహ—ఛీ! దుర్మతీ!

సులేమాన్—మహారాజ్జీ! అట్లుకోపించుచుంటిరేమి!

పృథ్వీసింహ—నిరాశ్రయుఁడవై, జాలిపడి, నీకాశ్రయమొసఁగి, తగి
నట్లు నీకు సుఖంబుఁ గూర్చుచుంటిని. నీకొఱకై నేనౌరంగజేబు
సైన్యములతో సమరమునలిపితిని.

సులేమాన్—మహారాజ్జీ! తామట్లొనరింపలేదని నేఁబలికియుంటినా?

పృథ్వీసింహ—సయుక్తఖాను నిన్నుఁ దనకప్పగించుమని సామ్రాట్
పక్షమం దిప్పటికిఁగూడ నన్నెంతయో వేఁడుచు వివిధప్రలోభ
ములఁజూపుచుండెను. అట్లయ్యు నేను వానివేడికోలును బెడ
చెవింబెట్టితిని!

సులేమాన్—మహారాజ్జీ! కృపాపురస్సరముగ నామునలుపు మహోపకారములకు నేనత్యంతము కృతజ్ఞుఁడనై యుండును.

పృధ్వీసింహా—కాని, నీవిట్టి కఠినుఁడవనియు, నిట్టి లఘుచిత్తుండవనియు, నిట్టి స్వేచ్ఛావిహారివనియు, నిట్టి కృతఘ్నుండవనియు, నే నెఱింగియుండ లేదు!

సులేమాన్—మహారాజ్జీ! అట్లనుచుంటి రేమి?

పృధ్వీసింహా—నాబహిరుద్యానవనమున విహరించుటకు నీకనుమతి నొసఁగితిని;—నీవట్లొనరింపక నా ప్రమోదారామమును బ్రవేశించి నావారకాంతలతో హాస్యాలాపములఁ గావింతువని నేఁ దలంపలేదు!

సులేమాన్—మహారాజ్జీ! మీరు పొరపడితిరి—

పృధ్వీసింహా—నీవు సుందరుండవు!—యువకుండవు! చక్రవర్తిపౌత్రుండవు!—ఇట్టి చెడు—

సులేమాన్—మహారాజ్జీ! నేను—

పృధ్వీసింహా—కలుషమతీ! పొమ్ము! దోషప్రక్షాళనయత్నము నిష్ఫలము! పాపముదాగియుండజాలదు.

[ఇరువురు చెరియొకవంకకు నిష్క్రమింతురు].

పంచమదృశ్యము.

ప్రయాగయం దౌరంగజేబు శిబిరము—రాత్రికాలము.

ఔరంగజీబేకాకియై యుండును.

ఔరంగ—యశవంతుఁడెంత యసమసాహసికుఁడు! ఖజుయారణాంగణమందు గడచిన రాత్రి యతఁడు మాయంతఃపుర కాంత శిబిరమునుగూడ బెజీకిచి యొకగొప్పయుప్పెనవలెమా సైన్యములపైఁబడి వెడలిపోయెను. అద్భుతమద్భుతము! పోనీ, యశవంతుని

దౌష్ట్యంబున నాకగచాట్లు వాటిల్లినను, సమరమందు నేను సుజాను
పరాజితుం గావించితిని!—కాని యామూలాలనుండి మరల
కారుమబ్బులు గ్రమ్ముకొనివచ్చుచున్నవి. ఈమాఱు త్రిమూర్తులేక
మైరి. షాహెనాబాజ్ దారా యశవంతులు ప్రతి నిమిషమందు
నన్నుం దాకయత్నించుచుండిరి! భయహేతువే—ఇప్పుడు నేను—
కాదుకాదు! అట్లొనరింపను. ఈజయసింహుని మూలమునం గార్య
మునడుపవలయును—ఓహో! మహారాజ్జీ! రండు!

(జయసింహమహారాజ్ ప్రవేశించి, సలామొనరించును.)

ఔరంగ—(సలామందుకొని) మహారాజ్జీ! నే నింత దనుక మీ
రాకకై ప్రతీక్షించుచుంటిని. రండు! ఆ య్యాసనమం దాసీనులు
కండు! ఏమి! ఈ విష మౌష్ణము!

జయసింహ—విష మౌష్ణమే! ఉష్ణధూమముత్పన్నమైనట్లున్నది!

ఔరంగ—నా సర్వాంగకములనుండి యగ్నికణము లెగయుచున్నట్లు
న్నది. మీ శరీరమం దారోగ్యముగా నున్నది గదా!

జయసింహ—దేవరకృపచే నీ దాసుం డారోగ్యవంతుండై యున్నాండు.

ఔరంగ—మహారాజ్జీ! నేను రేపకడనే బయలుదేరి ఢిల్లీకి పోవుచుం
టిని. మీరు కూడ నా వెంటవచ్చెదరా?

జయసింహ—దేవర యాజ్ఞప్రకార మాచరించెదను.

ఔరంగ—తాము నావెంటరావలయుననియే నాకోరిక.

జయసింహ—ఎనిమిది జాములందును మీయాజ్ఞాప్రకారము వర్తించు
చుందును. అట్లొనరించుట నాకు మిగుల నానందము!

ఔరంగ—మహారాజ్జీ! మీరట్లు తలంచువారని నే నెఱుంగుదును.
మీ వంటి మిత్రులు లోకమందరుదుగనుందురు. నిక్కముగ
మీరు నాకు కుడిభుజమువంటివారు.

[జయసింహుఁడు మందహాస మొనరించి సలాము గావించును]

ఔరంగ—మహారాజ్జీ! దుఃఖవిషయ మేమన మహారాణీ యశవంత సింహుఁడు నాశిబిరభాండాగారములఁ గొల్లఁగొనియు శాంతుఁడు కాలేదు. విద్రోహులగు షాహానాబాజ్ దారాలతోఁ నతఁడు కలిసినాఁడు.

జయసింహ— అది వాని మూర్ఖత్వమును వ్యక్తీకరించును.

ఔరంగ—నాకుఁ గలిగిన యరిష్టమునకై నేను విచారించుచుండుట లేదు. కాని యశోవంతుఁడగు యశవంతుఁడు కొఱవితోఁ దలఁ గోకికొనుచున్నందులకు మిగుల విచారించుచుంటిని.

జయసింహ—అది దుఃఖకర విషయమే!

ఔరంగ—మహారాజ్జీ! అతఁడు మీ కాంతరంగిక మిత్రుఁడగుట నే నెఱుంగుదును. దానంజేసియే మీ ముఖము చూచి, యాతని యకార్యముల నన్నిఁటిని సైరించితిని. వేయేల! అతఁ డిప్పటికైన శాంతుఁడగుచో నే నాతని దుష్కృత్యముల నెల్ల మన్నింతును. అదికూడ ప్రాణతుల్యులగు మీ మోము జూచియే సుఁడీ!

జయసింహ—నే నొక మా ఱా రాజును దర్శించి, వలదని వారింతునా!

ఔరంగ—అది యుత్తమోత్తమమైనపని. నేను మీకొఱకై చింతించుచుంటిని. అతండు మీ స్నేహితుఁడగుటంజేసి నాకుఁ గూడ స్నేహితుఁడే యని తలఁచుచుంటిని. వాని కెట్టి శిక్ష విధించుటకు నాయుల్ల మొప్పుకొనకున్నది. స్నేహితుల నొప్పించుట తన్నుఁ దా నొప్పించుకొనుటయే యని నేను తలఁచుచుందును.

జయసింహ—అవును. ఉదారహృదయులట్లే భావించుదురు. నే నొక మాటతనికి నచ్చఁజెప్పెదను. నాబోధనల నతఁడు పెడచెవింబెట్ట జాలఁడు.

ఔరంగ—మంచిది. తగురీతి వానికి బోధింపుఁడు. ఈ యుద్ధమున

నతఁ డేపక్షము నవలంబింపక తటస్థుఁడై యున్నచో పూర్వాపరా ధములన్నియు మన్నింపఁ బడుటే కాక ఘూర్జరదేశ మతని కీయఁ బడుననియు ఇట్లు నేను మీ స్నేహముబట్టి చేయుచుంటిననియు, మీరతని కెఱింగింపుడు.

జయసింహ—ఆహా! మీ యుదార స్వభావమెట్టిది! ప్రభూ! నిక్కముగ నేను వాని నొడఁబఱుపఁగలను.

ఔరంగ—యశవంతుఁడు మీచెలికాఁడను మాట మఱువకుఁడు. అతనిఁ గాపాడుట మీ కర్తవ్యము!

జయసింహ—స్వామీ! మీరువచించినది నిక్కువమే.

ఔరంగ—అట్లయిన మహారాజా! తామిఁకఁ బోయిరండు. ఢిల్లీ యాత్రార్థమై ప్రయాణసంచారముల నాయిత మొనరింపుఁడు.

జయసింహ—దేవరచిత్తానుసారమాచరించెదను.

[సలా మొనరించి నిష్క్రమించును.]

ఔరంగ—‘మీ మోముచూచి’ యని మంచి యభినయ మొనరించితిని! ఈ రసపుత్రులు సరళస్వభావులు—ఔదార్యవశులు! నేనా విద్యనుఁగూడ నభ్యసించు చుంటిని. కాని రెండు విపరీతగుణముల నభ్యసించుట దుష్కరమే! వాని సమ్మేళనము మిగుల భయంకరమైనది! అయినను నాకది యసాధ్యము కాఁజాలదు. షాహానావాజ్ దారా యశవంతులు ముగ్గురు కలిసిరిగా! దేవుఁడీ ముగ్గురిఁ గూర్చనేల? కాని ముగ్గురు కూడుట నాకు నశుభమే! వారల కలయిక యటులుండ నీ మహాత్మ్యమువలన వెఱపునకుఁ గారణంబు గన్పట్టుచున్నది. వానివైఖరి యిట్లుమాఱెనని. [తలపంకించుచు] అతఁడీపుడు మితవాదియైనాఁడు. తండ్రికిని నామీఁద నవిశ్వాస బీజము నెవరో వాని హృదయమున నాటినారు. అట్లొనరించినది జహానారా కాదు గదా! అదుగో! తనయుఁ డిటే వచ్చు

చున్నాఁడు.

[మహమ్మదు ప్రవేశించును.]

మహమ్మదు—జనకా! నన్నిటకు రావించుటకుఁ గతమేమి?

ఔరంగ—తనయా! రేపటి ప్రత్యూషమున నేను రాజధాని కరుగుచుంటిని. నీవు సుజాసువెంటాడుము. మీర్ జుమ్లా నీకుఁ దోడ్పడును.

మహమ్మదు—తండ్రీ! మీయాజ్ఞానుసార మాచరించెదను.

ఔరంగ—మంచిదిఁక పొమ్ము.—నిలచి యుంటివేమి? విశేషమేమైనఁ దెలుపవలసియున్నదా?

మహమ్మదు—తండ్రీ! అక్కఱలేదు. మీ యాజ్ఞ యొక్కటియే యభీష్టము.

ఔరంగ—అట్లైన శంకించుచు నిలచితివేమి?

మహమ్మదు—నా విన్నప మొకటి విని ప్రత్యుత్తర మిండు.

ఔరంగ—అదేమియో యెఱింగింపుము. సంకోచమేల?

మహమ్మదు—బహుదినములనుండి మిమ్మొక విషయ మడుగఁ దలఁచుచుంటిని. కాని మనసులోని దానిని వ్యక్తీకరింప సాహసింపఁజాలకుంటిని. ఇఁక దానిని మనసున నణచి యుంచఁజాలను. పుత్రుని యౌద్ధత్యమును మన్నింపవలయును.

ఔరంగ—అడుగఁ దలఁచిన దేదియో యడుగుము.

మహమ్మదు—మీ తండ్రిగా రిపుడు చెఱఁబెట్టఁబడిరా!

ఔరంగ—కాదు! అట్లని యెవరనిరి?

మహమ్మదు—అట్లగుచో వారినిపు డాగ్రాప్రసాదమున నిరోధించి యుంచితిరేమి?

ఔరంగ—అట్లు కావింపవలసి వచ్చినది.

మహమ్మదు—పినతండ్రిగారిని కూడ నట్లే బంధింప వలసివచ్చెనా?

ఔరంగ—అవును.

మహమ్మదు—పితామహులు సజీవులై యుండ, మీ యగ్రజులు సుఖులై యుండ సింహాసనమందు మీరే కూర్చుండవలసివచ్చినదా?

ఔరంగ—అవును!

మహమ్మదు—తండ్రీ! (తలవంచుకొనును)

ఔరంగ—కుమారా! రాజనీతి మిగుల గూఢమైనది. నీవు చిన్న వాఁడవు. దానిని గ్రహింపలేవు. దాని నెఱుఁగ ప్రయత్నము సలుపకుము.

మహమ్మదు—తండ్రీ! మోసగించి సోదరుల బంధించుటయు, ప్రేమ మూర్తియగు జనకుని, బలవంతమున సింహాసనచ్యుతుఁ గావించి ధర్మరక్షణార్థమని, యా పీఠము దాక్రమించుకొంటయు, రాజనీతి యగుచో,—అట్టి రాజనీతి ముమ్మాటికి నాకు వలదు.

ఔరంగ—మహమ్మదూ! నిశ్చయముగ నీవు వ్యాధిగ్రస్తుఁడవైతివని నాతలంపు.

మహమ్మదు—[కంపితస్వరమున] తండ్రీ! వ్యాధిగ్రస్తుఁడను కాకుండు టట్లుంచి, భారతవర్షమున నేఁడునాకంటె నధికారోగ్యవంతుఁ డెవఁడును లేడని యెఱుంగుఁడు.

ఔరంగ—అట్లైన నీ ప్రేలుడేమి?

మహమ్మదు—(నీరవుఁడై యుండును)

ఔరంగ—(కొంచెము సేపూరకుండి) తనయా! నాయందు నీకుఁ గల యమిత విశ్వాసము నెవరు చెఱిచివైచిరి?

మహమ్మదు—అట్లొనరించినవారు మీరే! సాధ్యమగునంతకాలము నేను మిమ్ము విశ్వసించి యుంటిని. పూర్వమట్లు నేనిఁక మిమ్ము విశ్వసింపఁజాలను. ఇపుడు నే నవిశ్వాస విషంబుచేఁ బాడయి పోయితిని.

ఔరంగ—మహమ్మదూ! నీ పితృభక్తి యిదేనా! నిక్కము! నిక్కము కాలవైపరీత్య మిట్లే! దీపమున్న తావునసే యెక్కుడు చీకటి యుండును.

మహమ్మదు—ఆహాహా! ఏమియీ ధర్మోపదేశము! ఏమియీతత్త్వ శాస్త్రజ్ఞత! ఓహో! ఏమి మీయుత్కృష్టోపమ! పితృభక్తి యన చుంటిరా! పితృభక్తియా! పితృసింహాసనముపై నుండి మెట్టి పితృభక్త్యుపన్యాసం బిచ్చుచుంటిరి! సురాపాత్రను చేతఁబట్టుకొని మద్యపానము వలదని మహోపన్యాసమిచ్చి నట్లే యున్నది! పితృభక్తియా! పితృభక్తిని నేను మీకడ నేర్చుకొనవలయునా! పితృభక్తియందురా! మీరు మీవృద్ధజనకుని కారాబద్ధునిం గావించి బలవంతముగనే సింహాసనమును జేఁజిక్కించుకొంటిరో, పితృభక్తి చేనే నాసింహాసనమును తన్ని వైచితిని! పితృభక్తి యందురా నేను పితృభక్తుఁడనే కాకున్నచో,—ఢిల్లీ సింహాసన మందునే డౌరంగజీబు గాక, యీమహమ్మదే యాసీనుఁడై యుండును

ఔరంగ—కుమారా! అట్లని నేనెఱుఁగక పోలేదు! అందువలననే యిపుడక్కజపడుచుంటిని—వత్సా! నీపితృభక్తిని గోల్పోవకుము

మహమ్మదు—కోల్పోవకుండుటకేఁక నాతరముకాదు! పితృభక్తి మహత్తరమైనదే! పితృభక్తి పవిత్రమైనదే! పితృభక్తియుత్కృష్టమైనదే కాని పితృభక్తికంటె మహత్తరమైనదియు, పితృభక్తికంటెఁ బవిత్రతరమైనదియు, పితృభక్తికంటె నుత్కృష్టమైనదియు నగు ధర్మ మొకటి కలదు. దానిముందు తండ్రియు, దల్లియు, నన్నదమ్ములును, వేయేల నందఱును దక్కువవారే.

ఔరంగ—చిన్నికుమారా! నీపితృభక్తిని వీడకుము. ముందుముందు సామ్రాజ్యమంతయు నీయదె యనియే యెఱుంగుము.

మహమ్మదు—తండ్రీ! రాజ్యలోభమునుజూపుచుంటిరా! నాకర్తవ్యమ

కొఱకు నే నీభరత సామ్రాజ్యము నొక చిల్లపెంకు వలె దూరముగ విసరివైచితినన్ని చెప్పలేదా! తాతగారాదినమందీ రాజ్యప్రలోభమునే చూపిరి! నేఁడు తాము మఱల నట్టి ప్రలోభమునే చూపుచున్నారు. ఆహా! పృథ్వియందు సామ్రాజ్యమింత విలువ లేనిదా! వివేకమంత చులకనైనదా! సామ్రాజ్యమునకై వివేకమును పోగొట్టుకొనవలయునా! వివేకమును విడిచి మీరు పొందిన సామ్రాజ్యమును మీవెంటఁ బరలోకమునకుఁ దీసికొని పోగలరా!- కాని విడువకున్నచో నిక్కముగ వివేకము మిమ్మనుగమించెడిదే!

ఔరంగ—మహమ్మదూ!

మహమ్మదు—ఏమి తండ్రీ!

ఔరంగ—దీని యర్థమేమి?

మహమ్మదు—దీనియర్థమిది. నేనెవరి కొఱకై సర్వంబును బరిత్యజించితినో యతఁడు నేఁడు నాహృదయ పీఠమునుండి క్రింద బఁడెను. అన్నిటివలెనే తండ్రినిగూడ గోలుపోయితిని. నేఁడు నావంటి యభాగ్యుఁడెవఁడు? ఇఁక తాము,— ఈ భారత సామ్రాజ్యమును పొందుట నిక్కమే! కాని భారత సామ్రాజ్యము కంటె నెక్కుడగు సామ్రాజ్యమును నేఁడు కోల్పోతిరి.

ఔరంగ—ఆసామ్రాజ్యమేమి?

మహమ్మదు—నాపితృభక్తి! ఎట్టిసంపదను, నెట్టిరత్నమును, గోల్పోతిరో నేఁడు మీరెఱుంగ నేరకుంటిరి. ముందైన మీరు గ్రహింపకతప్పదు. [నిష్క్రమించును]

[ఔరంగజే బల్లనల్లన మఱియొక దిక్కుగ నిష్క్రమించును.]

## షష్ఠమదృశ్యము.

యోధపుర రాజభవనమందలి యొకయాగారము-

మధ్యాహ్న కాలము.

(యశవంతసింహ జయసింహులు ప్రసంగించుచుందురు)

జయసింహ—కాని యీరక్తపాతమువలన మీకేమి లాభము?

యశవంత—లాభ మేమియు లేదు.

జయసింహ—ఔరంగజేబుకే జయము సేకూరుట నిశ్చయ మైనపుడీ వృధారక్తపాత మేల?

యశవంత—అతఁడే జయించు నని మనమెట్లు చెప్పఁగలము?

జయసింహ—ఔరంగజే బెన్నఁడైన నేయుద్ధ మందైన నోడి పోవుట చూచితివా!

యశవంత—లేదు. ఔరంగజేబు శూరుఁడగుట నిక్కువమే! ఆనాఁడు నేనతని నర్మదాతీర కదనభూమియందు ఘోటకారూఢుఁడై నపుడు చూచితిని—ఆదృశ్యమును నేనెన్నఁడును మఱువఁజాలను. వాని తీక్ష్ణదృష్టి, వాని కుటిలభ్రుకుటి, యింకను నాహృదయ మునఁదోఁచుచున్నవి. శతఘ్నీ కాగ్ని గోళములును, "విలయకాల శిఖిశిఖాసమాననిశిత శిలీముఖములును," చెవిదూసికొని పోవు చున్నను, గుండెనిబ్బరముతో నటునిటు జూచుచు, నాశూరుఁడు నిలువఁబడి పోరసాగెను. అతని జంప నువ్విళులూరు విరోధినయ్యు నాలో నేనాతనికి సాధువాద మొసఁగ కుండ నుండ నేరనైతి— ఔరంగజేబు యోధాగ్రేసరుఁ డనుటకు సుంతైనసందియము లేదు!

జయసింహ—అటులైన మీరు వానినిబంధింప నుంకించుచున్నారేమి?

యశవంత—ఖజుయా సంగ్రామమందు నాకుఁగలిగిన యవమానము నకుఁ దగు ప్రతీకారము జరుగవలయును.

జయసింహ—వాని శిబిరమును కొల్లఁగొట్టి ప్రతీకార మొనర్చి

తిరిగదా!

యశోవంత—అది పూర్ణమయ్యెదికాదు. ఏలనన: నౌరంగజీబు తన శూన్యభాండారమును క్షణములో మరలఁ బూర్ణము గావింపఁ గలఁడు! కొల్లఁగొట్టుటకై యత్నింపక సుజాను కలసియుండినచో, ఖజూయాభండనమందు సుజాపరాఁజితుఁడు గాకుండును! సుజాకుఁ దోడ్పడకున్నను, శీఘ్రముగ నేనాగ్రాకు పోయినచోఁ దప్పకవృద్ధ రాజును జెరవిడిపించియుందును—వెఱ్ఱిభ్రాంతిలో మునిఁగిపోతిని.

జయసింహా—కాని తాముదెలిపిన రెండుకార్యంబులవలన మీ కేమి మేలొదవెడిదో? దారా సామ్రాట్టైనను, సుజా సామ్రాట్టైనను ఔరంగజీబు సామ్రాట్టైనను, మీ కేమి?

యశోవంత—ప్రతీకారము—నేను వారల నందఱఁగూడ విషదృష్టుల తోడనే చూచెదను—కాని, అందఱికంటె నెక్కుడుగ ఖలుండైన యౌరంగజీబును నేను ద్వేషించుచుంటిని.

జయసింహా—అట్లగుచో, ఖజూయాసంగ్రామమున వానికిఁ దోడ్పడితి రేమి?

యశోవంత—ఆనాఁడు ఢిల్లీ రాజసభయందతఁడు వచించిన పలుకుల నన్నిఁటిని విశ్వసించితిని. ఆకస్మికముగ, నతఁడెట్టి మాయఁబన్నె నన, ఏరీతి మహాత్మ్యము నభినయించెనన, ఏగతి స్వార్థత్యాగము నటించెనన, ఏమాడ్కి యాంతరదైన్యవృత్తిఁ దోపించెనన, వాని యుపన్యాసానంతరము నేను జమత్కృతుఁడనై—చమత్కృతుండ నైతి నననేల, సమ్మోహితుండనై, యిట్టి త్యాగి,నిట్టి యుదారు, నిట్టి మహాత్ము, నిట్టి ధార్మికునిఁ బాపి యని కూళయని యేల భ్రమించితినని నన్ను నేను నిందించుకొని నాయవిశ్వాస ప్రకృతిని వీడి సభికులందఱికంటె మొదట నేనే మోదపుర్స్సరముగ జయ్

ఔరంగజేబుకు జయ్' అని జయధ్వానము సలిపితిని. ఆదినమందౌరంగజే బందిన విజయము—సమ్రాట్షుజాయా సంగ్రామముల విజయంబులకంటె నెక్కుడద్భుతమైనవి! కాని, పిమ్మట షుజాయా యుద్ధరంగమున మరల వాని దౌష్ట్యకౌటిల్య చక్రాంతములు దృగ్గోచరములగుటచే నేను వాని నిజప్రకృతిఁ గాంచఁగలిగితిని.

జయసింహ—మహారాజ్! షుజాయాయందు మీకుఁ జేసిన ద్రోహాచరణమునకు, నిక్కముగ నాతఁడు పశ్చాత్తాపపడినాఁడు.

యశవంత—మహారాజ్! ఈవిషయమును నన్ను విశ్వసించుమనుందురా?

జయసింహ—పోనిండావిషయమిపుడెందులకు! ఔరంగజేబు తమకవజ్ఞసూపినందులకు మిమ్ము క్షమాపణ వేడుకొనెడు. పిమ్మట మీరొనర్చినవానికి క్షమాపణ వేడుకొన నవసరము లేదు. అతఁడు చేసిన యన్యాయమునకు మీరు ప్రతీకారమొనర్చి పగఁదీర్చుకొంటిరని యతఁడు తలఁచుచుండెను. ఇప్పు డతఁడు మీ సహాయమును వేఁడుకొనుటలేదు. దారా పక్షమునుగాని, తన పక్షమునుగాని యవలంబింపక, తటస్థులై యుండుఁడని యతఁడు మిమ్మిపుడుకోరుచున్నాఁడు. మీ తాటస్థ్యమునకు బహుమానముగ నతండు మీకు రత్నగర్భయగు ఘూర్జరసీమను ప్రసాదించును. తా మొక కల్పితాన్యాయప్రతిశోధనార్థ మౌరంగజేబునకు విరోధులై నిజశక్తి క్షయముఁ గావించుకొనుచుంటిరి. కాని యిపుడు చేతుల ముడుచుకొని యొకచోటఁ గూరుచున్న మాత్రముననే మీ కొక మహత్తర దేశము లభ్యమగుచుండెనని యెఱుంగుఁడు. శక్తిక్షయము కావలయునో, ఘూర్జరసీమ కావలయునో యెన్నుకొనుఁడు. సర్వస్వమును గోల్పోయి ప్రతిహింస సలుప నభిలషించుచో నట్లే కావింపుఁడు. లేక భీషణ విప్లవమునుండి తొలఁగి స్వచ్ఛందముగ సుఖజీవనము గడుపవలయునన్న నట్లొనరింపుఁడు.

వీనిలో నొకదాని నెన్నుకొనుట కష్టకార్యము కాదు. మీకుఁ గావలయునదదియా, లేక యిది యా?— తెలుపుఁడు!

యశవంత— కాని, దారా—

జయసింహ— దారా మీ కేమగును? అతఁడును ముసల్మానే, ఔరంగ జేబును ముసల్మానే. మీరు స్వదేశార్థమై కదనము గావించుచో, నేనేమియుఁ బలుక కూరకుండు వాఁడనే కాని, దారా మీకెవఁ డు? తా మెవరికొఱకై రాజపుత్రుల రక్తమును బ్రవహింపఁ జేయుచున్నారు? దారాయే జయించిన మీకు గాని మీ జన్మ భూమికిగాని యేమైన లాభ మొదవునా!

యశవంత— అట్లగుచో మనము స్వదేశార్థ మాహవము సల్పుదము రండు. మీవారు పతియగు రాజసింహుఁడును, బికనీరు ప్రభువు లగు తాముసు, యోధపురరాజు నగు నేను నేకమగుచో ఒక్క నిముసములో మొగలు సామ్రాజ్యమును గగనతలమున కూదివేయ గలము! రండు!

జయసింహ— పిమ్మట సార్వభౌముఁ డెవరు?

యశవంత— ఎవరందు రేమి! రాణా రాజసింహుఁడు!

జయసింహ— నే నౌరంగజేబు ప్రభుత్వమున కియ్యకొందును గాని రాజసింహుని ప్రభుత్వమున కియ్యకొనఁజాలను.

యశవంత— అదేమి మహరాజ్! అతఁడు స్వజాతి యనియా?

జయసింహ— అవును! జ్ఞాతి దుర్వాక్యమును సహింపనేరను. నే నెట్టి మహాత్మ్యాభినయము సలుపఁజాలను. నాయందుచ్చ ప్రవృత్తులేమో యున్నవని తెలుప శంకింపను. పృథివి నా కొక క్రయవిక్రయప్రదే శము. ఎచటఁ దక్కువ వెలకు విశేషవస్తువులు లభ్యమగునో, నే నయ్యెడ కరుగుదును. ఔరంగజేబు తక్కువ ధర కెక్కుడు వస్తు వుల నిచ్చుచుండెను. ధ్రువసంపత్తునుద్యజించి, యనిశ్చితాభ్యంతర

మునఁ బ్రవేశింప నే నిచ్ఛగింపను.

యశవంత—అట్లా!—(కొంచెము సే పూరకుండి) మంచిది! మీరిఁక పోయి విశ్రమింపుఁడు. యోచించి మీకుఁబ్రత్యావమునఁ బ్రత్యుత్తర మొసఁగెదను.

జయసింహ—అది మంచిమాట—ఇది సాంసారిక క్రయవిక్రయము మాత్రమని తలంపుఁడు! మనము స్వాధీనభూపతులము గాలేకున్నను, నిక్కముగ రాజభక్తులము కాఁగలము. రాజభక్తికూడ ధర్మమే కదా! [నిష్క్రమించును.]

యశవంత—హిందుసామ్రాజ్యము కవిస్వప్నము. హిందువుల ప్రాణములు శుష్కించి హిమసన్నిభంబులైనవి. హిందువులకుఁ బరస్పర ప్రణయమసంభవము! “స్వాధీనభూపతులము కాలేకున్న, నిక్కముగ రాజభక్తులము కాఁగల” మని జయసింహుఁడు తెలిపిన విషయ మనృతముకాదు! నేనెవరికొఱకై సమర మొనర్ప నేగుదును! దారానాకెవఁడు!—నర్మదాయుద్ధపరాజయమునకుఁ దగుప్రతిశోధనమునకుజుమా రణరంగమందుజరిగినది.

(మహామాయా ప్రవేశించును)

మహామాయా—మహారాజ్! దానిని ప్రతిశోధనమందురా! నే నింతదనుక యంతరాళమందు నిలువఁబడి మీయపౌరుషముఖచిహ్నలఁగాంచుచుంటిని.—రెండుపక్షముల సమభారమున్న త్రాసువంటి (Like the equal weights in a balance) మీయాందోలనమును విలోకించుచుంటిని.—బాగుబాగు! ఎట్టిప్రతిశోధముఁగొంటిరో బాగుగ తెలిసినది. మహారాజ్! దానిని ప్రతిశోధనమందురా! ఔరంగజీబు పక్షావలంబులై, వానిశిబిరమును కొల్లఁగొట్టి పలాయనమునకుపుట ప్రతిశోధనమగునా? అట్టిప్రతిశోధనము కంటెఁ బలాయనమే మేలని నేఁదలఁచెద! అదిపరాజయము పైఁబడిన పాప

భారతము! రసపుత్రులుకూడ విశ్వాస ఘాతుకులు కాఁగలఁగుదు
రని తామే యిపుడు ప్రథమపర్యాయము నిదర్శనము జూపితిరి.

యశవంత—రాజ్ఞీ! కొల్లగొట్టక పూర్వమునే నౌరంగజేబు పక్షమును
బరిత్యజించితిని.

మహామాయా—ఏపక్షమందుండనపుడు మొగలు లేమరియుండ వారి
విత్తమును కొల్లగొంటిరా?

యశవంత—యుద్ధమొనరించి కొల్లగొంటిని. అపహరింపలేదు.

మహామాయా—దీనిని యుద్ధమందురా!—ఆశ్చర్యము!

యశవంత—సతీమణీ! ఇట్టియుక్తులుదక్క వేరుమాటల నీవెఱుంగ
వనితలంచెద. దివారాత్రములందు నీగద్దింపువలుకుల వినుటకే
నిన్నుఁ బరిణయమాడితినా?

మహామాయా—మహారాజ్! మఱియేల వివాహమాడితిరి?

యశవంత—ఏమి యీయాశ్చర్యప్రశ్న! లోకులు వివాహమాడు చెందు
లకో నేఁగూడ నందుకే.

మహామాయా—పరిణయ మాడుట సంభోగార్థమని తలంతురా?
విలాసప్రవృత్తులఁ దీర్చుకొనుటకా? ఏమందురు?

యశవంత—[కొంచెము సేపూరకుండి] అవును! ఒకవిధంబుగ నందులకే
యని చెప్పవచ్చును.

మాహామాయా—అటులైన నొకవారకాంతను రావించుకోరాదా?

యశవంత—(అన్యమనస్కుఁడై) ఝుంఝూశిల ముత్పన్నమగుచున్న
ట్లు దోఁచుచున్నది.

మహామాయా—మహారాజ్! మీ పశుధర్మప్రవృత్తిని దీర్చుకొనఁ
గోరుచో కామంబు నారాధింప నభిలషించుచో, మీయభీష్టము
కులాంగనల పవిత్రాంతఃపురములందు నెరవేరఁజాలదు—ఆయభీ
ష్టసిద్ధి వారాంగనల యలంకృతాగారములందు లభించును. అచ్చోటి

కొనుగుదు. మీరు ధనమొసంగ వేశ్యయైనను ధనదానమొసం
గును. లాలసత్వమున మీకలామెను జేసదరు—అంకటిమంటచే
నామె మిమ్ముం జేరును. సతిపతులసంబంధ మట్టిదిగాదు!

యశవంత—ఎట్టిది?

మహామాయా—సతిపతుల సంబంధము ప్రేమ సంబంధము. అది పై
పై స్నేహముకాదు. ఏప్రణయము, పరస్పరమనస్యులం గావింపక
కాలముగడచుకొలందిం బ్రియతమములం గావించునో,—ఏప్రణయ
మాత్మచింత మఱచి, తన దేవతాచరణతలమున నాత్మోత్సర్గమొన
రించునో,—ఏప్రణయము, ఉదయభానుకిరణమువలె సోకినవారినెల్ల
స్వర్ణవర్ణులం గావించునో, భాగీరథీజలమువలె దాకినవారినెల్లం
బవిత్రులంజేయునో, దేవతావరమువలె నంటినవారినెల్ల భాగ్యశా
లులంగావించునో,—ఆప్రణయమే ఈప్రణయము—ఉత్సర్గమయ
మగుటచే, నదియచంచలమై, యనుద్విగ్నమై, యానంద
మయమైయుండును.

యశవంత—సతీ! నీవు నాకట్టిప్రేమం జూపుచుంటివా?

మహామాయా—అవును! ప్రియా! మీకు గౌరవముంగూర్ప బ్రాణ
ములంగూడ విడువంగలను. మరణము ప్రాప్తింపనున్నను, ప్రియుండు
యశస్విలకుండగునేని ఏసతీతిలకము సంతసమున మేనువీడకుండును?
వల్లభా! భర్త్రృమానహరణచింతచే దుఃఖించుచుంటిని! మీకీర్తి
చంద్రికలు మాపువడుటకు పూర్వమంధత్వము నాకుం బ్రాప్తించు
గాకని కోరుచుంటిని. రసపుత్రుల ప్రతిభాజ్యోతియు, మార్వారు
యశఃప్రభయు మీకతన నశించిపోవుట వీక్షింపకపూర్వము నేను
మరణింపనిచ్ఛగించుచుంటిని. మిమ్ము నేనెట్లు ప్రేమించుచుంటినో
మీరిపుడు గ్రహించితిరా?

యశవంత—ప్రేయసీ! ఈశ్వరుండు నీకుం జిర సుఖం బొసంగు గాక.

మహామాయా—వల్లభా! అకస్మాట్టు రౌద్రదీప్త గిరిశ్రేణులవిలో కింపుఁడు!—ఆచూపట్టు ధూసరవాలు కాస్తూవములవీక్షింపుఁడు! అల్లదె యల్లనల్లనపోవు శైలనిర్ఝరిణిని గాంచుఁడు!—ఆహా! —ఆ సరిల్లలామము పర్వత పార్శ్వములందుఁ గలస్వనమొనరించుచు కంపితయగు సుందరివలెఁదోఁచుచున్నది. నాథా! పర్వతమును జుం బించునాగగనంబును గాంచితిరా? గిరిశిఖరములం దాగగన చుంబ నముచే బ్రేమరసంబెట్లు స్రవించుచున్నదో! అంతరిక్షము తన యంతరంగము నుండి స్నేహసీలిమమును బిండి గిరికాంతాగండభా గంబులకెట్లు పూయుచున్నదో తిలకింపుడు! ప్రియా! ఆవినంబడు చున్న విహంగ గానము వినుఁడు. ఆహా! ఆశకుంతీస్వనమెంత మధు రముగనున్నది! వల్లభా! ఒకప్పుడీతావునందు సురలు వసించువా రు! మనపురంబులు పూర్వకాలమున దేవతావాసంబులు! మార్వా రు మీాహారులు శౌర్యలక్ష్మికిఁగవలబిడ్డలు — మార్వారు మీావారలు మహత్వనిశాకాశమందు భాసమానములగు బృహస్పతి శుక్రతారలు. ప్రియా! పూర్వమహిమాహోపాము నాకన్నులముం దు మెల్లమెల్లగఁ జనుచుండెను! (కొంచెము సేపూరకుండి) చారణ బాలకులారా! రండు! ఆగాథను గూర్చిపాడుడు.

యశవంత—సతీ!—

మహామాయా—నాథా! ఇవుడు పలుకరింపకుఁడు. ఈభావస్రోతము నాచిత్తమందుఁబ్రవహించు నపుడు పూజాసమయ మానన్న మయ్యెనని తలఁచుచుండును. శంఖములూదుఁడు. ఘంటానినదము నలుపుఁడు! ప్రసంగింపకుఁడు.

యశవంత—సతీ! ఏమి నీ మాతృభక్తి!

[మెల్లమెల్లగఁ దరలిపోవును.]

మహామాయా—అమ్మా! యెవ్వతె వీవు నాసమ్ముఖమందు నిలువం

బడితివి! తల్లీ! ఏమి యీసౌందర్యము! ఏమి యీ సౌమ్యము! ఏమి యీ శాంతము!!! [చారణబాలకులు ప్రవేశింతురు] బాలకులారా! వచ్చితిరా? పాడుఁడు! 'అందె మడియఁగఁ గోరుద మార్యులార!' అను గాథను పాడుఁడు:—

చారణబాలకులు పాడుదురు:—

సకల శుభముల నొసఁగెడు స్థానమేది?
అంచిత సుఖంబు లిచ్చి మన్నించునేది?
నిర్మలానంద మాత్మను నిలుపునేది?
కఠినబాధలఁ బోఁద్రోలి కాచునేది?
సత్యవంతుల పాలిటి సౌధమేది?
ఐహికాముష్మికము లిచ్చునట్టిదేది?
అట్టి భారతవర్షానఁ బుట్టి మనము
అందె మడియఁగఁ గోరుద మార్యులార!



# షాజహాన్



## చతుర్థాంకము



### ప్రథమదృశ్యము

టాండాయందలి సుజాప్రాసాదాగారము—సంధ్యాకాలము.

పియారా పాడును.

నిన్ను నమ్మచునుందు నీరేజ దళనేత్ర,
ధర్మమార్గమునందు దవిలియుండి
సద్భక్తి మ్రొక్కెద సర్వలోకేశుఁడ,
భాగవతుల గూడి భజనఁ జేసి
ప్రవిమలాత్మను యాచు పద్మపత్రేక్షణా,
మెలకువతో నెప్డు మెలగుచుండు
అన్ని వేళలయందు నంభోజనాభుఁడ,
నిన్నె దలచుచుందు నెమ్మితోడ
దివ్యభూషోజ్వలాంగుఁడ దివిజవంద్య!
కరుణఁ జూపుచు గావుము గరుడగమన
నీవె దిక్కని నమ్మితి నీలగాత్ర!
నిఖిల భూతేశ! శ్రీకృష్ణ! నిర్మలాంగ!

(సుజా ప్రవేశించును)

సుజా—సతీ! కడపటి కదనమందుఁగూడ దారా యౌరంగజేబుచేఁ బరాజితుఁడాయెనను వార్త వింటివా?

పియారా—ఏమి! ఈమాఱుకూడ దారాయే పరాజితుఁడయ్యెనా!

సుజా—ఔరంగజేబు మామ కృపాణపాణియై దారా పక్షమున భంజన మొనరించి, ప్రాణముల వీడెను. అతని మరణ మెంతయుత్కృష్టమైనదో జూచితివా?

పియారా—ఉత్కృష్ట మైనదేనా!

సుజా—కాదా? ధర్మార్థము మాత్ర మావృద్ధ యోధుఁడు తనయుల్లునిఁ బాసి, విపక్షుల పక్షమున బవరము సలిపి, ప్రాణముల విడచెను! అవ్విధమున నెందఱునుఱుల వీడఁగలరు? షాహానాబాజ్! శబాస్!! శబాస్!!!

పియారా—బేష్! బేష్!! అని మాత్రము వచించుటకు నేనియ్యకొందునుఁగాని, దానికి మించిన పదము నుచ్చరింప నియ్యకొనను.

సుజా—యశవంతసింహుఁ డీమాఱు సైన్యసమేతముగ దారాకుఁ దోడ్పడి యుండినచో—అహా! అతఁ డట్లొనరింపలేదు గదా! దారాకు సహాయ మొనరింప నంగీకరించి తుదకతఁడు పరాఙ్ముఖుఁ డయ్యెను. తరుణమున, దప్పుకొనుట వానికిఁ దగునా?

పియారా—ఆశ్చర్య మాశ్చర్యము!

సుజా—ఆశ్చర్యమా! ఇందాశ్చర్యపడవలసిన విషయ మేమున్నది?

పియారా—విషయ మేమున్న దందురా! అట్లేదో యున్నదని తలఁచితిని! అందుచే నాశ్చర్యపడితిని!

సుజా—ఖజువా రణాహవమందు మహారాజెట్లు విశ్వాసఘాతుకత్వమును జేసెనో యీమాఱు దారాను గూడ నట్లే మోస మొనరించెను. మరల నాశ్చర్యపడుచుంటివా యేమి?

పియారా—అవునవును! ఆశ్చర్యమాశ్చర్యము!!

సుజా—అంత యాశ్చర్య మెందుకు?

పియారా—ఎందుకేమి! అవునవును! కాదుకాదు! అదిగాదు! ప్రథమమున తుదివఱకు వినుఁడు!

సుజా—ఏమో తెలుపుము.

పియారా—ఇంతకు బూర్వమెందుల కాశ్చర్యపడితినో యని తలఁచి, నే నిపు డాశ్చర్యపడుచుంటిని!

సుజా—ఇదిచాల నాశ్చర్యముగ నున్నది!

పియారా—ఆశ్చర్యమన్న నాశ్చర్యమే!

సుజా—కాని ఆశ్చర్యపడవలసిన సంఘటన మొకటి సంభవించెను.

పియారా—అదేమొ తెలుపుఁడు.

సుజా—ఔరంగజేబు తనయుఁడైన మహమ్మదు నిజజనకుఁ ద్యజించి, మన తనయను వివాహమాడ మన పక్షముఁ జేరు టాశ్చర్యము కాదా!

పియారా—అం దాశ్చర్యమేమున్నది! అనురాగంబుచే లోకులింతకంటె మిగుల గష్టతరములగు గార్యములఁ గావింతురు. ప్రేమకొఱకై మానవు లున్నత భిత్తికలపై కెగఁబ్రాకుదురు! ప్రేమకై మానవులు సౌధాగ్రములనుండి నేలపై దుముకుదురు. ప్రేమకై మానవు లీఁతఁగొట్టి గభీరస్రవంతుల దాటుదురు! ప్రేమకై మానవు లగ్నికుండమునఁ జొత్తురు!—ప్రేమకై మానవులు గరళంబు మ్రింగి ప్రాణముల విడుతురు. మీరు వచించిన దొక ఘన విషయముకాదు! జనకుని బరిత్యజించివచ్చుట కష్టకార్యమా? అట్లెందఱు చేయఁగలరు. అందుచే నే నిందుకై యాశ్చర్యపడను.

సుజా—మంచిది. ఆ విషయము లెట్లున్నను, నిజముగ నక్కజపడు విషయంబుఁ దెలిపెద. నేనును మహమ్మదును గలసి యీ మా ఔరంగజేబు సైన్యములను వంగభూమినుండి దఱిమివైచితిమి! వింటివా? సతీ! ఇంకను ఆశ్చర్యపడవేమి?

పియా—ఎల్లపుడు యుద్ధవిషయములే కాని చెప్పుటకు మీకు వేరు విషయము లేవియు గోచరింపవా? కదనపు తలంపులను మఱపింప

నేను యత్నించిన కొలఁది, మీరు వెనుకకాళ్ళఁ దన్నుచునే యున్నారు. నా కళ్ళెమునకు లొంగకున్నారు!

సుజా—యుద్ధమందు మహదానంద మొకటి గలదు. అంతియకాక—

(పరిచారిక ప్రవేశించును)

పరిచారిక—ప్రభూ! పకీరొకఁడు మీ దర్శనార్థమై వెలుపల వేచి యున్నాఁడు.

పియారా—ఎట్టి పకీరు? పొడుగుగడ్డము వాఁడా?

పరిచారిక—అమ్మా! అవును (సుజానుద్దేశించి) ఇప్పుడే మిమ్ము దర్శింపవలయునఁట! ఎంతయో యవసరమున్నదఁట!

సుజా—మంచి దిప్పుడే వానిని లోనికిఁ గొనిరమ్ము. సఖీ! నీ విచ్చోటి నుండి నిష్క్రమింపుము.

పియారా—మంచిది! మీకు నన్నుఁ దఱిమివైచుచుంటిరా? పోనిండు. నేఁ బోవుచుంటిని. మంచిది లెండు! ఇంతే! సరే. ఇఁక నుండను. చూడుఁడు! పోవుచున్నాను. [నిష్క్రమించును.]

సుజా—(పరిచారిక నుద్దేశించి) వాని నిటకుఁ గొనిరమ్ము.

[పరిచారిక నిష్క్రమించును]

సుజా—నా ప్రేయసి నిక్కంబుగ నొక నవ్వుల మూటయే! అట్టి హాస్యంపుటూట యింకెందుఁగాన్పించును! ప్రియా! నీ వొక యర్థశూన్యవాక్య ప్రవంతివి! పలువిధంబుల నాబవరంపు చింతను మఱపింపఁ బ్రయత్నింతువు!

(దిల్దారు ప్రవేశించును)

దిల్దారు—వందేగిషాహాజాదా!

సుజా—వందేగి!

దిల్దారు—అయ్యా! గుమ్మముకడ 'పక్కాఫకీరు' నిలచితిని!

సుజా—ఇప్పుడే కదా నీవు వచ్చితివని వింటిని! నీ రాకకుఁ గతమేమి?

దిల్దారు—తమకొక కమ్మఁ గొనివచ్చితిని!—

[జాబు నొసఁగును]

సుజా—[జాబుఁ దెఱచి చదివి]- ఇదేమి! ఫకీరూ! నీ వెచ్చటినుండి వచ్చితివి? నీకు దీని నెవ రొసంగిరి?

దిల్దారు—ప్రభూ! చమత్కారమా?

సుజా—ఏమి!

దిల్దారు—జాబునందు సంతకము లేదా? ముఖముఁజూడగనే బాబయ్య గారి బుద్ధి అంతయు బయలుపడుచున్నది. ఆహా! ఏమి మీతమాషా! మీ టక్కుటమారము!

సుజా—తమాషయేమి? టక్కుటమారమేమి?

దిల్దారు—పాపము బ్బాయిగారుసుజాగారిబుల్లెమ్మను పెండ్లిజేసుకొని— ఓహోహో! మంచిబేరము తగిలినదనికాఁబోలు! ఆహాహా! మా మంచి పండునోడిలోవైచుకున్నారు. ముందునుండి బాణఘాత విడచుటకంటె వెనుకనుండి—వో: ఆబాబుకు కొడుకులు గారా బాబూ?

సుజా—వెనుకనుండి యమ్మును విడచువా రెవరు?

దిల్దారు—నాకుభయ మెందులకు! —నేనీమాటసుజాసుల్తానుకుఁ దెలుపు చుంటినాయేమి? నాకెందుకు వెఱపు? —స్వామీ! మఱచి జాబువానికిఁ జూపెదరేమో!

సుజా—ఓరిపెద్దమ్మా! నేనే సుజాసుల్తానును! మహమ్మదు నా యల్లుఁడు!

దిల్దారు—వహావ్వా! బాగున్నది! మహమ్మదు బాబూ! ఏమయ్యా! నీటక్కులు! దీదీదీ! వహావ్వా!

సుజా—అరే!

దిల్దారు—అదే! వహావ్వరె వహావ్వా! మత్తకురమజా! లంకసారమజా!

లహాలుబత్తాషా! నామస్రులోఁ బుట్టినా! ముక్కికిముక్కీ! లిక్కికిలక్కీ! డీ! డీ!! డీ!!! [గంతులు వైచును.]

సుజా—అరే! ఊరకుండుము!

దిల్దారు—అయ్యా! మీతమాషాలు నాకడనా! మంత్రములేతరదియో ముదురుదియో కప్పించుట లేదనుకున్నారా! మహమ్మదుబాబా! ఈవిద్యయెప్పటి నుండి నేర్చితిరి?

సుజా—పిచ్చివాఁడా! నేఁజెప్పినది వినుము. నేను మహమ్మదును కాను! సుజాను!

దిల్దారు—మంచిది! మీరు మహమ్మదుగారైతే నేఁ జెప్పిన దంతయు నిజమని నమ్ముఁడు. లేకమీరు సూజాసుల్తానగుచో నేవచించిన దంతయుఁ గల్లయని నమ్ముఁడు. అందొక యథార్థమైనను నిజము కాదని యెఱుంగుఁడు.

సుజా—నీవు వచించిన దేమి?

దిల్దారు—ఇదీ బాగానే వుంది! నాకేమి తెలియును!

సుజా—వెఱ్ఱిపకీరూ! ఇఁక నీ వడుగుము. దీని విహితమును నే నిప్పుడ గావించెదను. నీవు పోయి విశ్రమింపుము.

దిల్దారు—ఏ మందురు?

సుజా—పోయి విశ్రమింపుము.

దిల్దారు—అయ్యా! నాపేరు మార్చుటకు మీ రెంతవారు! నా పేరు విశ్వనాథము కాదు!

దిల్దారు—హో హొమ్మ!

దిల్దారు—మంచిదండి! మంచిదండీ!!

[గంతులు వైచుచు నిష్క్రమించును]

సుజా—ఏమి! మహాసమస్యయందుఁ బడిపోతిని! బాహ్యశాత్రవులతో వేగుచుండ, గూఢుఁడగు నౌరంగజేబు నాకంతశ్శత్రువులఁగూడఁ

దగుల్బాజీనఁ జేసెను! కాని వీఁడిచట నిఁకెంతకాల ముండఁ గలఁడు! లగ్గుఁజేయఁబూనిన యెగ్గుఁ గావింప గమకించునా! మంచిది! నే నిప్పుడ జాగ్రత్తపడియెదను! కాలహరణముఁ గావింపను! భాగ్యవశమున నీ పత్రము నాచేతనే పడెను! అదుగో! ఆ మొండికట్టె యియ్యెడకే వచ్చుచున్నాఁడు!

(మహమ్మదు ప్రవేశించును.)

సుజా—మహమ్మదూ! ఈ లేఖఁ జదువుకొనుము.

[పత్రము నొసఁగెను.]

మహమ్మదు—(జాబును చదివి)—ఏమి! ఇదెవ్వరి జాబు! దీని నెవరు వ్రాసిరి!

సుజా—నీజనకుఁడు లిఖించెను! పితృహస్తాక్షరముల గుఱుతింపఁ జాలకుంటివా! నీ జనకుని విపక్షమున, విద్రోహాచరణము సలిపి, యిమ్మట బశ్చాత్తప్తహృదయుఁడవై, నీ మామను నీ తండ్రికి విరోధినగు నాకెంతే నెగ్గు గావించి, తన్మూలమున నీతండ్రి కగ్గలంపు లగ్గొనరించి పితృద్రోహదోషహరణము నీశ్వరసాక్షిగ, సలుప యత్నమొనరింతునని నీజనకున కీవు కమ్మ లిఖించినట్లే లేఖవలన బోధపడుచున్నది.

మహమ్మదు—ప్రభూ! నేను నా జనకున కెట్టి లేఖను లిఖించి యుండలేదు. ఇది యొకకపట తంత్రంబని నమ్ముఁడు.

సుజా—నీపలుకుల నేను విశ్వసింపఁజాలను. నీవు నేఁడే—నేఁ డేమి, యీ ముహూర్తమందే నాయిల్లు వీడిపొమ్ము!

మహమ్మదు—అట్లు వచించుచుంటిరేమి!—నన్నిపు డెందు బొమ్మందురు?

సుజా—నీ జనకునికడకు!

మహమ్మదు—అయ్యో! నేను శపథపురస్సరముగ—

సుజా—చాలుచాలు! నీశపథములఁ జాల వింటిని. సమ్ముఖ యుద్ధ

మందు విజయుండనఁగుటయు లేక నిర్జితుండనఁగుటయు వెఱుపిపయు ములఁ! అర్థివేషంబుల ధరించు పత్యర్థుల కేను నాయింటఁ దావీయఁ జాలను! గృహశాత్రవులతోఁ ఘోర నాశరము గాదు. మహమ్మదూ! ఇంటఁదని నింటివాసంబుల లెక్కింపదార కొంటివి! ఇపుడేనీవు వేరొక చోటి కరుగుము. దోషపూరిత యత్నంబులు విఫలంబులగుట నిక్కము. ప్రతివచన మొసఁగక వేగమే వెడలిపొమ్ము!

మహమ్మదు—నేను—

సుజా—ఇఁకేమియు నే విసను! పొమ్ము? ఇపుడే పొమ్ము!!!

[మహమ్మదు నిష్క్రమించును]

సుజా—ఇట్లప్రమత్తుఁడనై యుండకున్నఁ జేటు మూడుట నిక్కము. మహమ్మదూ! పెద్దబాబూ! గొప్పయెత్తు వైచితివోయీ! కాని, యెత్తుపడినదిగాదు! ఏ మోసచేయఁగలనని వచ్చితివా? మిగుల నేర్పరినని తలఁచితివి! నీవు కొమ్మకొమ్మకుఁ బ్రాకఁగలుఁగుచో, ఆకు ఆకు చాటున నేను మసలఁగలను!—సతీ! రమ్ము!

[పియారా ప్రవేశించును].

సుజా—పట్టుకొంటిని.

పియారా—ఎవరిని.

సుజా—ఇఁకెవరిని! మహమ్మదును! పావమబ్బాయి—మంచి పన్నగడ ఇందేదో మోసమున్నదని నీ కింతకు ముందే దెలిపి యుండలేదా? ఇపుడంతయుఁ దేలినది! నీరము వలె నంతయుఁ దేట తెల్లమయ్యెను. ఇపుడే వానినిచ్చటినుండి దఱిమి వైచితిని!

పియారా—ఎవరిని దఱిమి వైచిరి?

సుజా—మహమ్మదునే!

పియారా—ఏమి?

సుజా—వెలుపలవిరోధులు! ఇంట విరోధులు! వహవ్వా! వేసినాఁడు!

పాపిని! కాని, పడినదికాదు! పట్టివైచితిని! —సతీ! ఈజాబును జూడుము.

పియారా—(జాబు చదివి) మీకుమతిపోయినట్లున్నది! వైద్యునిపిలుతునా?

సుజా—అట్లనుచుంటి వేమి?

పియారా—ఇది మీరనుకొన్న పన్నాగముకంటెఁ బెద్దయెత్తు.—ఇది కపట పత్రికయని గ్రహింపఁజాలకపోతిరా! ఇది యౌరంగజీబు పన్నాగము! ఈమాత్రము గ్రహింపలేకుంటి రేమి!

సుజా—ఏమేమి! సతీ యిట్లని నే నెఱుఁగకపోతిని!

పియారా—ఈ తెలివితేటలతోఁ, నీ బుద్ధిబలంబుతోఁ జిత్తులమారియగు నౌరంగజేబుతోఁ బోరఁబోయితిరా! బురదపామును బట్టుకొనలేని బాబు త్రాచుపామును బట్టఁబోయినట్లున్నది! ఉట్టి కెగురలేనమ్మ స్వర్గంబున కెగుర యత్నించినట్లున్నది. ఇట్లని నాకు ముందుగా నేల దెలుపలేదు? అల్లుని వెడలఁగొట్టితిరా! ఇట్టి కొఱ్ఱి మఱొకటి యుండునా!—ఆహా! ఏమి మర్యాద! మంచి నిర్వాకముఁ జేసితిరి! నడువుఁడింక అమ్మాయిని, అల్లుని బ్రతిమాలుఁడు! పొమ్మనుట, రమ్మనుట—గద్దించుట, కాళ్ళు పట్టుకొనుట—ఇవి మామల కన హాజములుకావు! ఇఁక నడువుఁడు!

సుజా—సతీ! ఇది కపటపత్రికయా!—అట్లని ప్రథమమున నీవేల జెప్పితివి కావు? జాగరూకుండనై యుండవలెనని యిట్లాచరించితిని!

పియారా—జాగరూకులై యుండుట కల్లుని వెడలఁ గొట్టవలెనా?

సుజా—అయ్యో! చాలఁ బొరపడితిని! పోనీ! ఒక యుపాయ మాలోచించితిని. పిల్లనువానితోఁ బంపుదును. వలయుసైన్యము నొసఁగుదును. ఇట్లొనరించిన జామాత నాదోషమును మఱచును! వెఱ వేమి! నడువుము—అతనికిఁ దెలియఁజెప్పుము! పిమ్మట సెలవొసంగుదము.

సిపారా—సెలవొసంగుటేల?

నజీ—దినములు బాగుగా లేవు! అప్రమత్తులరై యుండుడు. ముందిది గ్రహింపలేరా?—నన్నంపుము తెలిపెదను.

[ఉభయులు నిష్క్రమింతురు]

'Marriage between the issue of paternal uncles is not uncommon in Moslem Society'.

ద్వితీయదృశ్యము.

షహల్దాను గృహముందు బాహ్యాగారము రాత్రికాలము.

సిపార్, జహరతు నిద్రపాలు నిలువంబడి యుందురు.

జహరత్—తమ్ముఁడా!

సిపార్—ఏమక్కా!

జహరత్—విలోకించుచుంటివా?

సిపార్—ఏమి?

జహరత్—మనమీరీతి ఘోరాటవిలోఁ గ్రుమ్మరుచు వన్యమృగముల వలె గహనములనుండి గహనాంతరములకు వెడలఁగొట్టఁబడుచుంటిమి! హంతకులవలె నొక గిరిగహ్వరంబు నుండి మఱొక గిరిగహ్వరమునకుఁ దలఁదాచుకొన బర్వెత్తుచుంటిమి! మార్గమందలి బికారివలె ఒక గృహస్థుని ద్వారమునఁ బరాహతులమై మఱొక గృహస్థుని కవాటప్రాంతమున ముష్టిభిక్షఁ జేయుచుంటిమి. నిద్రాహారముల కెడమై వివిధప్రదేశములకు భ్రమించుచుంటిమి!—సోదరా! ఈ దురవస్థను విలోకించుట లేదా?

సిపార్—విలోకింప కేమి! కాని, దానినుండి తప్పించుకొనుట కుపాయమేమున్నది?

జహరత్—ఉపాయమేమున్నదా! పురుషుండవయ్యు, 'ఉపాయమేమున్న'దని నిరస్వరమునఁ బలుకుచుంటివా? నేనబలనుఁగాక పురు

షుండనగుదునేని తగు వెరవును వెదుకలేకుందునా!

సిపార్—ఏమి వెరవును వెదకుదువు?

జహారత్—(మొలనుండి చురకత్తిని వెలికిదీసి)—దీనిని గొనిపోయి దస్యుఁడైన యౌరంగజీబు ఱొమ్మున గ్రుచ్చెడుదానను.

సిపార్—ఏమి! హత్యగావింతువా!!

జహారత్—అవును! హత్యగావింతును!!! ఉలికిపడుచుంటివేమి?—హత్యఁ గావింపఁజాలవా? తెమ్ము! ఈ చురకత్తినిఁ దీసికొని ఢిల్లీ పొమ్ము. నీవు బాలకుండవు. నిన్నెవ్వరును శంకింపఁజాలరు—పొమ్ము.

సిపార్—అక్కా! ఎన్నటికట్టిబోధనము సలుపకుము. నేను చేయఁజాలను.

జహారత్—భీరూ!-జనని మరణించుచుండుట విలోకించు చుండుట లేదా?—జనకుఁ డున్మత్తుఁడగుట వీక్షించు చుంటలేదా?—

సిపర్—అక్కా! వీక్షింపకేమి!

జహారత్—ఊరక చోద్యము జూచుచుంటివా?

సిపార్—ఏమిచేయవలెను?

జహారత్—కాపురుషా—

సిపార్—సోదరీ! నేఁగాపురుషుండను గాను. సమరభూమియందేను జనకుని పార్శ్వమున గజారూఢుఁడనై ప్రాణముల విడువ భయపడక భండనమునలిపి యరాతివర్గమును చండాడితిని! ఎదుటఁబడి పోరాడ సంసిద్ధుఁడనుగాని దొంగపోటున హత్యచేయలేను.

జహారత్—మంచిది!

[నిష్క్రమించును.]

సిపార్—అక్కా! ఈ వృథాక్రోధమేల! ఇపుడే వెరవూహింతము—!

[నిష్క్రమించును]

## తృతీయదృశ్యము

### నాదిర శయన మందిరము—రాత్రికాలము.

పర్యంకముపై నాదిర పవ్వళించియుండును. ఒక పార్శ్వమున దారాయు, మఱొకపార్శ్వమున సిపార్ జహరతున్నీసాలు వివర్ణవదనులై కూరుచుండి యుందురు.

దారా—ప్రేయసీ! పృథ్వి నన్నుఁ బరిత్యజించినది. ఈశ్వరుఁడు నన్నుఁ బరిత్యజించినాఁడు! నీవొక్కరితవు మాత్రము నన్నిన్ని దినములనుండి పరిత్యజింపలేదు! నేఁడు నీవుకూడా నన్ను విడిచి పోవుచుంటివా?

నాదిర—నాథా! నాకొఱకై పలుబాధలఁ బడితిరి!—ఇఁక—

దారా—హృదయేశ్వరీ! దుఃఖానలజ్వాలాదగ్ధుఁడనై నిన్నెంతయో దూఱితిని.

నాదిర—ప్రియా!—మీ సుఖదుఃఖములందు పాలుగొనుట నాపరమ భాగ్యము! ఆభాగ్యస్మృతి మనంబున నామోద మొసఁగ, నేఁబర లోకయాత్ర సలుపుదును!—సిపార్! నాయనా—జహరత్! అమ్మా! నేఁబోవుచుంటిని—

సిపార్—అమ్మా! మమ్ము విడచి నీవెందరుగుచుంటివి?

నాదిర—బిడ్డా! ఎందరుగుచుంటినో తెలుపఁజాలను. కాని నేఁబోవు ప్రదేశమున క్షుధాపిపాసాజ్వాలలు, వ్యాధితాపములు, విరోధములు, కష్టములు, దుఃఖము ఉండవు

సిపార్—అమ్మా! అట్లైన, మేముకూడ నచటికే వచ్చెదము. నాయనా! రమ్ము! ఇఁకనీ కష్టముల సహింపఁజాలము.

నాదిర—తండ్రీ! ఇఁక మీ కిడుములఁ గుడువఁ జాలరు. దయాళుండగు జహన్నాథాశ్రయము మొసఁగెను. కష్టములుగడచెనని తలంపుఁడు!

సిపార్—నాయనా! ఈ జహన్నాథానెవండు?

దారా—అతఁడు నాపూర్వ మిత్రులలో నొకఁడు.

నాదిర—నాయనా! వానిని మీ జనకుఁడు రెండుమాఱులు మృత్యు ముఖమునుండి రక్షించెను. ఆమేలును మఱువక మీకు వలయు సదుపాయముల నతఁడు చూచుచుండును.

సిపార్—కాని, వాని యందెన్నఁడు నాకు నమ్మకము లేదు.

దారా—ఏమి తండ్రీ?

సిపార్—అతని ముఖచిహ్నములు చాల వికృతముగా నున్నవి. ఇప్పుడే యతడు తన భృత్యులం దొకనితో నేదియో గుస గుస లాడుచు, చోరుని వలె నాపైఁగోఁచిచూపుల నిగుడింపఁదొడం గెను. అమ్మా! వానిపైశాచికదృష్టులకు వెఱగొంది నీ కడకు బరువెత్తుకొని వచ్చితిని!

దారా—ప్రియా! తనయుఁడు నిజముచే వచించెను. జిహ్వాను ముఖ మునఁ గుటిలహాసము కన్పట్టుచున్నది! వాని కన్నులందు క్రౌర్య దీప్తి తోఁచుచున్నది. వానినిమ్నస్వరమువినిన, వాఁడొక కత్తి నూరుచున్నట్లనుమానము తట్టకమానదు! ఆనాఁడతడు నాకాళ్లపైఁ బడి ప్రాణ భిక్ష వేఁడినపుడు వానిముఖ లక్షణము నొకతీరున ఇపుడు మఱొక తీరున గన్పట్టు చున్నవి. వాని ప్రస్తుతదృష్టి, ప్రస్తుతస్వరము, నాకపరిచితములు.

నాదిర—వానికి మీరు రెండుపర్యాయములు ప్రాణదానమొసంగితిరి గదా! అతఁడు మనుష్యుఁడు కాని సర్పము కాదుకదా!

దారా—మనుజుఁడు విశ్వసనీయుఁడని తలంపకుము! సర్పము కంటె నతఁడెక్కుడు ఖలుఁడు. కాని, ఒకానొకప్పుడు ప్రాణేశ్వరీ! మిగుల బాధ కలుగుచున్నదా?

నాదిర—నాథా! నొగులు దిగులు నేమియు లేదు. మీప్రేమకటాక్షా మృతమందు నాబాధయంతయుఁ గరగి పోవుచున్నది. కాని,

ప్రియా! నాకిఁక కాలముసమీపించినది. మన చిట్టివి మీకప్పగించి పోవుచుంటిని. వానికి కడు జాగరూకులై పెంపుఁడు. తనయు నల్లారు ముద్దుగఁ బెంచుఁడు! అయ్యో! పెద్ద వానినిఁ జూడఁజాలకపోతిని! ఈశ్వరా! నా నాథుని రక్షింపుము!! రక్షింపుము!! రక్షింపుము!!!

[ప్రాణములవిడుచును]

దారా—(పత్నిముఖమున ముఖమిడి) ప్రేయసీ! ప్రేయసీ!— అయ్యో! ప్రాణసమానా! ఊరకుంటివేమి? ఏమి స్థిర నిమేషములో మంచువలెఁ జల్లనై పోతివేమి? ప్రాణేశ్వరీ! అయ్యో! అయ్యో!! ఇఁక నన్నుఁ బలుకరింపవా? అర్ధాంగీ! ఈయధముని గట్టుకొని నీవిన్ని యగచాట్లనుభవించితివే! అయ్యో! నాహృదయము మండిపోవుచున్నది! ఒక్కమాఱు కన్నెత్తి చూడవా? ఛీ! పాడుబ్రతుకు! ఛీ! అధమజీవనము!! సహధర్మచారిణీ! ఎంతకష్ట పెట్టితినే! సతీ! దురాత్ముఁడనై నిన్నుతిట్టి నీహృదయమున గాలమైన గాయమొనరించితిఁగదా! కూటికి గుడ్డకు లేక నిన్ను భూతలనరకమందుఁ బడఁద్రోసితిఁగదా! మేలిమిబంగారు మేడ నిలువలఁగాఁపురము సేయు నీకు ఎడారులు నివాసములయ్యెనా! సతీమణీ! నీకెట్టియవజ్ఞఁజూపినను, నిన్నెంతదూషించినను, ఒకమాఱైన తలయెత్తి నీవు మాఱుమాటాడలేదుగదా! అర్ధాంగలక్ష్మీ! రాజ్యలక్ష్మిని గోల్పోయినను, నాభాగ్యలక్ష్మి యుండ నాకేమి కొఱఁతయని యుప్పొంగిన నాగర్వమంతయు నడంచివైచితివా! అయ్యో! నన్ననాథుని గావించి లేచిపోతివా! ఇప్పుడు నావంటి హతభాగ్యుఁడెవఁడు? నాబహిఃప్రాణమా! ఎందరిగితివి! ఇఁక నో—ఇఁక సహింపఁజాలను! ధర్మపత్నీ! ప్రాణతుల్యా! పతివ్రతా! సహధర్మిణీ! అయ్యో! అయ్యో!! అయ్యో!!!

[పత్నిపైఁబడి విలపించును]

(సిపార్ జవహరత్ లుకూడ జననిపైఁబడి గోలుగోలున విలపింతురు.)

దారా—అయ్యో! నిముసములో దీపమారి పోయినది. (బిడ్డలం గవుంగిలించుకొని) బిడ్డలారా! కలవరింపకుండు! మీజనని మరణింప లేదు! మీజనకుండు మరణించెను! ఇట్టి పాపి కడుపున నేలబుట్టితిరి!—భగవానుండా! వేడుక చూచుచుంటివా తండ్రీ! నన్నిట్లు బాధించుచుంటివేమి? నీకు నే నెట్టి యపకారమొనరించితిని? దయామయా! దయమాలితివేమి?—పత్నీ! ఈబిడ్డల నేమి చేయుమందువు! వీరలనెట్లు పెంపంగలుగుదును! సతీ! ఒకమారు కన్నెత్తి నీకన్న బిడ్డలను జూడుము! వారియెడలనైన జాలికలుగుటలేదా? అర్ధాంగీ! ఊరకున్నావు! వీరల నీవే పెంపుము! నాకు సాధ్యము కాదు! సాధ్యముకాదు! ఇదుగో నేం గూడ వచ్చుచుంటి! ఇదేమి! ఇదేమి!! అసంభవము! ఎట్లు! పాడు బ్రదుకు! పాపము! ప్రారబ్ధము! ఛీఛీ! దారా! దారా!! నీభార్య యేది! ఇంక నీ దారియేది? ఏల!—కాదు! కంఠము రుద్ధమగుచున్నది. పత్నీ! పత్నీ!! పత్నీ!!!

[పత్నిపైం బడి మూర్ఛిల్లును]

"అమ్మా! అమ్మా!!" అని గోలుగోలున విలపించుచు, సిపారు నేలపైంబడి పొరలును. జహరత్ నిజపతుమును బలంబుగ హస్తంబుచేం బట్టుకొని పై కనిమేషనయనయై జూచిచూచి పిదప చివాలున నేలం గూలును.)

[ఖడ్గపాణులైన నలువురు సైనికుల వెంటనిడుకొని
జిహాన్ఖాను ప్రవేశించును.]

జిహాన్ఖాను దారా వీంపుపైం దట్టును.

దారా—(లేచి, డగ్గుత్తికతో) మీర లెవరు? ఈసమయమందీతావును కలుషితమొనరించుచుంటిరేమి?

జిహాన్—అరే! ఊరక చోద్యముం జూచుచుంటిరేమి! బంధింపుండు!

బంధింపుఁడు !!

దారా—ఏమి ! జిహన్ఖానూ! నన్ను బంధించెదవా ?

సిపార్—[భిత్తికనంటియున్న ఖడ్గమును దీసి] నాజనకుని బంధింప నెవరికి సాధ్యము ?

దారా—బిడ్డా!క త్తిదింపుము. ఈయాహూ ర్తమత్యంతపవిత్రమైనది!— ఈచోటొక మహాపుణ్యతీర్థము! ఇప్పుడు మీజనని పూతాత్మశకుంత మిచ్చోఁ దన రెక్కల ముడుచుకొని నిలుచంబడి యున్నది!— ప్రపంచ సుఖదుఃఖములనుండి సెలవుఁ గొనకపూర్వ మొకమారు నాల్గుదిక్కులవీక్షించి,కడసారిచూపుఁ జూచుకొనుచున్నది! స్వర్గము నుండి యాపవిత్రాత్మను గొనిపోవ నప్సరస లింకను రాలేదు. ఆ ఆత్మమహానము మానసము జేయుట కింక నాలస్యము లేదు! ఇపుడు దానిని బీడింపవలదు! కరవాలమును బారవేయుము!—జిహన్ఖానూ! నన్ను బంధింపఁ దలఁచుచుంటివా ?

జిహన్—అవును !

దారా—అట్లొనర్ప నీ కౌరంగజీ బాజ్ఞ యొసఁగెనా ?

జిహన్—అవును!—

దారా—ప్రాణేశ్వరీ! నీ వీతని పలుకుల వినుచుండుట లేదు గదా? వినినచో కదలక మెదల కట్లు పడియుండఁగలుగుదువా? ఈ కూళునిపై జాలిచూపులఁ బఱపకుందువా? ఈ విపరీత కృత్యమును మానముగఁ జూచుచుండఁ గలుగుదువా? భగవాన్! ఏమిరా నీ యనుకంపము ! సతీ ! నీకీశ్వరుని యెడల భక్తి మెండు గదా!

జిహన్—భృత్యులారా ! బిఱాన మీరితని రెక్కల విఱిచి కట్టివేయుఁడు! స్వాధీనుఁడు కాకున్న, సంకోచింపక కత్తి నుపయోగింపుఁడు!

దారా — స్వాధీనుఁడను గాకుండు టేల! హంతకులారా! రండు! నా చేతులఁ గట్టివేయుఁడు. నిస్సహాయుఁడనై, వలవాంచి మీకు లొంగియుందును. నే నేమియు నక్కజపడుటలేదు! [ఈదృశ ఘటన మొకటి రాఁగలదని నే నాశ పడుచునే యుంటిని! అన్యుఁ డింకొక విధమున నూహింపవచ్చును! ఇదెట్టి కృతఘ్నత యనియు, నెట్టి విశ్వాస ఘాతుకతయనియు, నెట్టి దురంతకృత్యమనియు, ఎవ్వఁడు రెండు మాఱులు ప్రాణభిక్షకై గాళ్లపైఁబడెనో, యతండే కపటాశ్రయ మొసఁగి, దుస్తర సతీవియోగ పరితాపమునఁ బొక్కుచున్న నాపై నిసుమంతైన జాలిఁగొనక, నల్వురు బంటులఁ వెంటఁ గొనివచ్చి, నన్ను ద్రాళ్లతోఁ గట్టఁ గమకించి, తన యవాచ్య నృశంసతను వ్యక్తీకరించుచున్నాఁడని యన్యుండు భావించి యుండును! నే నట్లు భావింపను! జగమందలి యుచ్చప్రవృత్తు లన్నియుఁ బాప భయంబున, తమ తేఁల మంచెయందు దాచుకొని పైకిమాత్రము జూచుచున్నది. ఇప్పట్టున వెక్కివెక్కి యేడ్చుచుండుట నే నెఱుంగుదును! పృథివియందిపుడు స్వార్థ సిద్ధియే ధర్మమనియు, శౌర్యమే నీతి యనియు, ముఖస్తుతియే పూజ యనియు, ప్రతారణమే కర్తవ్య మనియు నే నెఱుంగుదును!! ఉదారభావము లన్నియుఁ బురాతనము లగుట నే నెఱుంగుదును!!! సభ్యతాలోకంబు కతన ధర్మాంధకారము తొలఁగిపోయెను! (With the light of civilisation, the darkness of Religion has been removed!) ఆ ధర్మమందవశిష్టమేమైన నున్న, నది యిపుడు కృషీవల కుటీరములందును, అనాగరికతాభ్యంతర మందును తోఁపవచ్చును!] జహన్ఖానూ! మహాత్మా! నన్నిఁక బంధింపుము!

సిపార్ — అటులైన, నన్నుఁగూడ బంధింపుఁడు.

జిహాన్—నిన్ను విడచుటొంటుట తలంపకుము. నీకుం గూడ నిట్టిగౌరవ మే జరుగును! ఇప్పుడు నీకు గొంపోయిన బహుమానము మొక్కవ ముట్టును.

దారా—నిక్కమే! నిక్కమే!! ఈ ఘోరాత్మతత్త్వ తనకుం దగు మూల్యముం బడయుచుంటివా! నీయుత్తములు స్వర్గము లెట్లగు!— నిక్కము గ నీవు విశేషార్థముం బడయుచుంటివి!—కృతఘ్నప్రసా దముం బొందుచుంటివి! జిహాన్ఖానా! ఏమి నా నీచ సుఖము! నీయానన మునఁదా నెట్టి కాంతి యెట్లు వెలుంగుచున్నదో! ఆశాదీప్తుల చే నీనేత్రము లెట్లు దీప్తములగుచున్నవో! జిహాన్ఖానా! నేడు నీపుణ్యము పండినది. సఫలీకృతమనోరథుండవు కాఁగలవు! ఇంక నన్నుం ద్రోసివేయుము! నీకు విశేషార్థప్రాప్తి కలుగును! నీవా విత్తమును మూటఁగట్టుకొని పరలోకమునకుం గొంపోవవచ్చును!

జిహాన్—(భృత్యుల నుద్దేశించి) ఏమిరా! ఆలస్యమేల!—బంధింపుం డు!! బంధింపుండు!!!

దారా—బంధింపుండు! బంధింపుండు!!—కాదు! కాదు!! ఇప్పు డట్లొ నరింపకుండు! వెలుపలికి రండు! ఈ స్వర్గమందు నరకాభిన యమేల? ఈ నాకమందు నరకకృత్యమేల? ఇట్టి ఘోరా నియమ మిందేల?— జననీ! వసుంధరా! ఈ ఘోరతరభావ మును వహించుచు మిన్నకుంటివా! తల్లీ! ఏమి నీసహనము!— ఈశ్వరా! చేతులు ముడుచుకొని చిరునగవుచ నీ నృత్యమును విలో కించుచుంటివా?—జిహాన్ఖానా! మహానుభావా! తండ్రీ! రమ్ము! వెలుపలికి రమ్ము!

[అందఱు వెలుపలికిం జన నుద్యమింతురు]

దారా—నిలువుండు! నిలువుండు! జిహాన్ఖానా! నాప్రార్థన మాలిం చెదవా? కృపాళుండవై నాకోరికం దీర్చెదవా?—తండ్రీ! ఈదేవి

మృతశరీరకమును లాహోరునకంపి, యమునా చక్రవర్తి జ్ఞాతుల ప్రత్యేక శ్మశానవాటికయం దీపతితులమునకు సమాధిం గావింప నీచాకుల కనుజ్ఞ యిమ్ము. అర్ధాంగి కంత్యక్రియలం గావించుట కైన నీయభాగ్యునకు శక్తిలేదు! దీనావనా! ఈదీనుని విన్నపమాలించి, యతండు కోరిన చందమున నాచరింప నీసేవకుల కాజ్ఞాపింపుము. రెండుమాటలు నీకుం బ్రాణదాన మొసంగుటచే నిపుడు ని న్నిభిక్ష వేడుచుంటిని. లేకున్న నీమాత్రమైన నిన్నుం గోరక యే యుందును!—దయాళూ! నాకోరికం దీర్పుము.

జహాన్—ఛీ! దుర్మతీ! నోరుమూయుము! నీగొంతెమ్మ కోరికల నింకం గట్టిపెట్టుము! ఆలస్యము చేయక యీశవంబునచట దిగవిడిచిరమ్ము. మాప్రభువగు నౌరంగజీబు ననుమతి లేనిదే మేమేమియు విన నిచ్చగింపము. అట్లొనరించిన మాతండు కోపించును.

దారా—నీప్రభువౌరంగజీబా! మంచిది!—ఇకనేం జెప్పునదేమియు లేదు! ఇంక నెట్టివంతయు లేదు!—నడువుము!—[వెనుకకుందిరిగివచ్చి పత్నీ! పత్నీ!! పత్నీ!!! [బిట్టలివియేడ్చి యాకస్మికముగం జతికిలపడి పిదప మెల్లగలేచి, శవముప్రక్కనం గూర్చుండి చేతులతో ముఖము గప్పుకొని యేమేమో పలికి పిదప లేచి శవముపై దృష్టి నిగుడించి జహన్ఖాను నుద్దేశించి] నాయనా ఇంక నడువుము! (అందఱా గుమ్మముదాటిరి. సిపార్ జహారత్ లు గిఱ్ఱునదిరిగివచ్చి జననిపైం బడి మరల గోలపెట్టసాగిరి. దారావారల ననుగమించి మరల పత్నిపైంబడి విలపింపం దొడంగెను. అదిగాంచి జహన్ఖాను మిగుల క్రుద్ధుండై భృత్యసహాయమున వారల నువ్వారను శవముపైనుండి లాగివైచి వెలుపల కీడ్చివైచెను. అపుడు దారానీరవుండై పోయెను! సిపార్ రోదన మెక్కుడాయెను!! జహారతున్నిసా మూర్ఛిల్లి పోయెను!!!) [తెరపడును]

## చతుర్థదృశ్యము.

యోధపురమందు యశోవంత సింహుని భవనము. సాయంకాలము.

జాయాసమేతుండై యశోవంతసింహుఁడు విషాదంబడియుండును

మహామాయా—మహారాజ్! హతభాగ్యుఁడైన దారా మొగఁజూపిన కృతఘ్నతకుఁ బురస్కారముగ ఘూర్జరప్రదేశమును బడసి, ప్రహృష్టమనస్కులరై యుంటిరా?

యశోవంత—రాజ్ఞీ! ఘూర్జరసీమను బరిగ్రహించుటవలన నపరాధమే మున్నది?

మహామాయా—అపరాధమే మంకురా! అపరాధము కాకున్న నిదేమి? మహత్సమ్మానమా! పరమగౌరవమా!

యశోవంత—గౌరవము కాకపోవచ్చును. కాని, యిది యన్యాయ కృత్యమని నేఁ దలంపను. దారాకుఁ దోడ్పడుటయుఁ, దోడ్పడకుండుటయు నా యిష్టానిష్టములు! దారా నా కెవండు?

మహామాయా—ప్రభువు మాత్రమే! మఱొకఁడు కాఁడు!

యశోవంత—ప్రభువా! ఒకప్పుడు వాఁడు ప్రభువై యుండుట నిక్కమే! కాని యిప్పుడు నా కతఁ డేమియుఁ గాఁడు!

మహామాయా—దారా నేఁడు మీకుఁ బ్రభు వెట్లగును! నేఁ డతఁడు నియతి చక్రము క్రిందఁ బడియుండెను! అతఁ డిప్పుడు భాగ్యవంచితుఁడై పోయెను! మానవ ధిక్కృతుఁ డాయెను! బంధు తిరస్కృతుండై చనెను! ఇఁక వానితో మీకు సంబంధ మెట్లుండును? మీకుఁ బురస్కార మొసఁగ సమర్థుఁడై యున్నపుడు, ప్రతి సమయమందు వేత్రాఘాతముఁ గావింపఁగలిఁగి నపుడు మీకు దారా ప్రభువై యుండెను! ఇపు డెట్లగును! రాజా! మీ రనినది నిక్కవమే! నిక్కవమే!!

యశోవంత—ఏ మంటివి! వేత్రాఘాతమా?

మహామాయా—ప్రభూ! "ఒకప్పుడు ప్రభువై యుండె" నందురా? ఈ "వైయుండె" నను దాని కేమియు మూల్యము లేదా? జరిగిపోయినదానిని మరచిపోఁగలరా? వర్తమానమునుండి బలంబుగ దానిని విచ్ఛిన్నము గావింపఁగలరా?

[A similar idea we find in "The Past' of Maurice Maeterlinck, the mystic-philosopher and dramatist of France. "The past belongs to us" observes Maeterlinck, "quite as much as the present, and is farmore malleable than the future. Like the present, and to a much greater extent than the future its existence is all in our thoughts, and our hand controls it…… ……………it is true above all of our moral past, and of what we consider to be most irreparable there"]

ఒకప్పు డెవడు మీ దయాళుప్రభువై యుండెనో, నేఁ డతఁడు మీకడ విలువ లేనివాఁడై పోయెనా? వల్లభా! ఇట్లు వచించుటకు బిడియ పడరేమి?

యశవంత—రాజ్ఞీ! నీతోఁ దర్కించు నవసరము నాకేమియు లేదు. ఉచితమని తలఁచినచొప్పున నేఁ గార్యాచరణము సలుపుచుంటిని. శ్రమపడి నీవు నా కేమియు నుపదేశ మీయునక్కఱ లేదు!

మహామాయా—ఇఁక నావలన మీకుఁ గావలయున దేమి! బవర మందుఁ బరాజితులై వచ్చియు, విశ్వాస ఘాతుకులై వచ్చియు, కృతఘ్నులై వచ్చియు, తా మిఁక వాంఛించున దేమి? నా భక్తియా! యే మనెదరు?

యశవంత—అదొక దొడ్డ వాంఛయా?

మహామాయా—కాదు! సంపూర్ణ స్వాభావికము! క్షత్రియవీరులయ్యు, తాము క్షత్రియ కులమునకు గళంకముఁ దెచ్చితిరి! రజపుత్ర చింతామణులయ్యు, రజపుత్రుల కపయశముఁ గలిగించితిరి! నేఁడు రాజస్థాన మంతయు మిమ్ము ధిక్కార మొనరించుచున్నది!

పలాయన మొనరించెనా? వస్త్రయానాన్నను జేసి గృహద్వారమునఁ గుటుంబసహితముగ సుజా బిచ్చ మెత్తుచుండెనా? మురాదు గ్వాలియరుదుర్గమున నరి కట్టఁబడెనా? తల్లీ! ఇవిగాక జెప్పవలసిన వార్తలిఁ కేమున్నవి?

జహానారా—నాయనా! దుర్వార్తాభారము, ననుదినము మూఁపున నిడుకొని, మీకడఁ జేరవైచుట నాదౌర్భాగ్యము! కాని, చేయున దేమి? దౌర్భాగ్యము లొంటరిగ రావుగదా! (Sorrows come in battalions. Shakespeare)

షాజహాను—అమ్మా! ఇఁ కేమున్నవో తెలుపుము.

జహానారా—జనకా! హతభాగ్యుఁ డైన దారా పట్టువడెను!

షాజహాను—పట్టువడెనా?—ఎట్లు?

జహానారా—జిహన్ఖాను వానిసిఁ బట్టి యిచ్చెను!

షాజహాను—ఏమి! జిహన్ఖానా!—జిహన్ఖానా!— ఏమనుచుంటివి? జిహన్ఖానా?

జహానారా—అవును!

షాజహాను—లోకాంతము సమీపించినదా యేమి?

జహానారా—ఏనుఁగు శవముపై నున్నటిదినమున నౌరంగజీబు దారాను పుత్రసమేతముగ గూర్చుండఁబెట్టి ఢిల్లీనగరవీధులఁ ద్రిప్పి, నగరముచుట్టుఁ బ్రదక్షిణము జేయించెను. చినిగినబట్టలతో మట్టిబొమ్మల పగిదినున్న, దారా సిపాయిల దురవస్థ గాంచి, యారాజనగరమునఁ గంటఁ దడిబెట్టనివారు లేరు.

షాజహాను—అట్లయ్యు, ఆ హతభాగ్యుల రక్షింప నెవ్వరును ముందునకు రాలేదా? కుందేళ్ళవలె తలలుమాత్ర మెత్తుకొని యాకఠిన దృశ్యమును వీక్షించిరా? వారలు మానవులా లేక పాషాణములా?

జాహానారా—పాషాణములు కూడ కావు. పాషాణములు తప్తము లగును. వారల బురదయునవచ్చును! ఔరంగజేబు ఫిరంగుల విలోకించి, వెఱఁగొంది, మంత్రముగ్ధులవలె స్తబ్ధులై, మస్తకముల నెత్తి సాహసింపక, యల్గిరాకు వీక్షించుటను భయమున ముఖముల మఱుగుపఱచుకొని వెక్కి వెక్కి యేడ్చిరి!

షాజహాను—తదుపరి ?

జాహానారా—తదుపరి, ఔరంగజేబు దారాను ఖిజిరాబాద్‌నందొక చీకటియింటిలో బంధించివైచెను.

షాజహాను— సిపారుజహాఁత్తు లేమైరి?

జాహానారా—సిపారు జనకుని వీడలేదు. జహాన తిప్పు డౌరంగజేబు నంతఃపురమందున్నది.

షాజహాను—ఔరంగజేబు దారా నేమి చేయఁదలంచెనో యెఱుంగఁగలిగితివా!

జాహానారా—ఏమిచేయునో యెఱుంగను.—కాని—కాని—

షాజహాను—ఏమితల్లీ! ఉలికిపడితి వేమి?

జాహానారా—అయ్యో! అట్లొనరించునేమో!

షాజహాను—ఏమి!—తల్లీ! యేమి!--ముఖమును మఱుగుపఱచుకొంటి వేమి? అది--అదిసంభవమా!—సోదరుఁడు సోదరుని హత్యఁగావించునా?

జాహానారా—ఊరకుండుఁడూరకుండుఁడు!—అదెవ్వరిపదశబ్దము!— అయ్యో! వినఁగలిఁగెను!—తండ్రీ! ఏమిచేసితి రేమిచేసితిరి!

షాజహాను—అమ్మా! ఏమిచేసితిని?

జాహానారా—ఆమాట యుచ్చరించితి రేమి! అయ్యో! ఇఁక రక్షణము లేదు! ఏమిబుద్ధి యేమిబుద్ధి!

షాజహాను—తల్లీ! వెఱఁగొందు చుంటివేమి?

జాహనారా—ప్రాయశః ఔరంగజేబు దారాను హత్యఁగావింప నిచ్చ గించియుండఁడు. ప్రాయశః ఇట్టిపాపభావము వానిచిత్తమునకుఁ దట్టియుండదు. జనకా! మీరాభావము నిప్పుడు వానిమనమందు దయింపఁజేసితిరి! ఏమిచేసితి రేమిచేసితిరి! అయ్యో! సర్వనాశన మొనరించితిరే!

షాజహాను—అమ్మా! ఔరంగజేబిచట లేడుగదా. ఎవరువినిరి?

జాహనారా—అతఁడు లేకుండుట నిక్కువమైనను ఈగోడ లున్నవి గదా! ఈ యగ్నియున్నదిగదా! ఈప్రదీపమున్నదిగదా! నేఁడివన్ని యు, వానికుట్రయందుఁ గూడినవి! ఈహర్మ్యము మీదని తలఁచుచుంటిరి!—కాదుకాదు! తండ్రీ! ఇదిమీ భవనముకాదు!—ఔరంగజేబు పాషాణహృదయము! ఈవీచునది పవనమని తలంచుచుంటిరా!—కాదిది యౌరంగజేబు విషాక్తనిశ్వాసము! ఈవెలుఁగునది ప్రదీపముకాదు!—ఇది యమాంతకుని భీషణదృష్టి! ఈప్రాసాదమం దీరాజపురమం దీసామ్రాజ్యమందు మీకైన నాకైన స్నేహితుఁ డొకండైన నుండెనని తలంపఁబోకుఁడు! అట్టి తలంపు వట్టిభ్రమ! ఎల్లరు వానింగూడిరి—లోకులందఱు స్తోత్రపాఠకులైరి!—ప్రపంచకులుగ మాఱిరి!—ఈఛాయ యెవరిది?

షాజహాను—ఎవరు?

జాహనారా—(వీచులొగ్గి) ఎవరును లేరు.—అదేమి! ఆదిక్కునట్లు చూచుచుంటిరి?

షాజహాను—నేను క్రిందికి దుమికెదను!

జాహనారా—అదేమి నాయనా!

షాజహాను—దారాను రక్షింపఁ గలనేమో చూచెదను—అయ్యో! వానిని జయింప వార లుద్యుక్తులౌచుండిరి! నే నాదృశ్యమును చూడలేను! స్త్రీవలె, శిశువుచందమున నిరుపాయుఁడనై నే నిం

ము గూరుచుండునా! అయ్యో! ఎట్టిఘటనములం జూచితిని! ఎట్టి భయానకదృశ్యముల వీక్షించితిని, జానక, మొక్కటియట్లె తినుచు, నిద్రించుచు, ఈపాడుప్రాణములం గాపాడుకొంటిని! కరముల ముకుళించి గూర్చుచుంటిని! అయ్యో! అయ్యో!! దేవుఁడా! నిన్నుఁ జంపివైచుచుంటిరా! ఇదుగో! వచ్చుచుంటిని! దురాత్ములారా! ఆగుఁ డాగుఁడు! లేకున్నఁ జచ్చెదరు! హాయనా! వెలువకుము! వచ్చుచుంటిని! [లంఘింపఁబోవును]

జాహానారా—(అకస్మికముగ లేచి జనకుని పట్టుకొని)—తండ్రీ! ఇదేమి! ఇదేమి! ఉఱుకుచున్నారేమి! ఎక్కడికి గెదరు! దారా యేడీ! అయ్యో! ఇచటినుండి లంఘించిన మీప్రాణములు— దక్కునా?

షాజహాను—ప్రాణములు దక్కకున్న నేమి! బ్రతికింపఁ గలనేమో చూచెదను!—ఉండుము! నన్నుఱికనిమ్ము!

జాహానారా—జనకా! మీరిప్పుడు జ్ఞానరహితులై యున్నారు! మీప్రాణములు నిలువకున్న, మీరు దారా నెట్లు రక్షింపఁగలరు?

షాజహాను—అవునవును! నాప్రాణములు నిలువకున్న, నేను దారా నెట్లు కాపఁగలను?—నిజము వచించితివి. కాని—కాని—మంచిది—అమ్మా! ఒకమాఱు నీ వౌరంగజేబు నిచటికిఁ గొని రాఁగలవా? చెప్పుము! చెప్పుము!! తల్లీ! వింటివా! వాని నిచటి కొక పర్యాయము తీసుకొని రాలేవా?

జాహానారా—జనకా! ఆదుష్టుఁ డిచటికి రాడు. లేకున్నచో, స్త్రీనయ్యు, ఒకమాఱు వానితో ద్వంద్వయుద్ధ మొనరించి చూచుదానను. ఆనాఁడు పేరోలగంబున, నెదుట నిలచి వానితో వాగ్యుద్ధము సలిపితిని! కాని పరాజితనై పోతిని. తదనంతరము నాకుఁ గూడ వెలుపలి కరుగుట కనుమతిలేదు. ఇంకుండి పోవు టసంభ

వమే. లేకున్న వానితో నొకమాఱు పోరి చూతును!

షాజహాను—లంఘించుచుంటిని!!

[లంఘింపఁబోవును]

జహానారా (జనకునిగట్టిగఁబట్టుకొని)—జనకా! ఉన్మత్తులుగాకుఁడు.

షాజహాను—అవు నవును!—ఏమి! నే నున్మాదినై పోవుచుంటినా! సత్యమేను—ఏల! లేదు లేదు లేదు! అట్లు కాదు! ఈశ్వరా! నే నున్మత్తుఁడనుగాను! అట్లు కాఁగోరను! భగవాన్—భగవాన్! ఈశీర్ణ శుష్కబలజరాజీర్ణ ఆశారహిత, అసహాయషాజహానును వీక్షింపుము!—నీకు జాలి కలుగుటలేదా! జాలికలుగుటలేదా! ఆహాహా!

[Reader ! See the striking similarity of Shajahan's appeal (heart-rending in its piteousness) to heaven with that of Lear whose very flesh and blood rebelled against him: you see me here, you gods, a poor old man. As full of grief as age; wretched in both ... ... ... ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ... .. .. .. ... ... ... ...

O Heavens,

If you do love old men, if your sweet sway
Allow obedience, if yourselves are old,
Make it your—cause. &c. &c. &c.]

ఏపుత్రుఁ డొకప్పుడు పితృభయంబునఁ గంపించువాఁడో, ఆతండే నేఁడు జనకుని బంధించివైచెను!—ఇట్టి యవిచారమా! ఇట్టి యత్యాచారమా! ఇట్టి యస్వాభావికకృత్యమా! ఈశ్వరా! ఇట్టి దౌష్ట్యము, నిట్టి దురంతము, నిట్టి దౌర్జన్యమును సహించి యూరకుంటివా! నీ నియమ మంతకఠినమైనదా! ఇట్లు! ఇట్లు!! నాయాత్మజుఁడే, నాతనూభవుఁడే, నన్నిట్లు—సర్వేశా! నేనట్టిపాపమేమి గావించితిని?—హా!—(One crtic says this is really shakesperian)

జహనారా—ఇట్టి శోకమూర్తి వారికి నామముండు చూడఁ గలిగినచో— [పల్లి కొరుకుకును]

షాజహాను—[తాజ్‌మహాలు నెదుటకు స్మృత్యుల పాటించి] సతీ! ముంతాజ్! నీవు భాగ్యవతివి! నను భర్తవుగా లభవు? ఈమర్మాంతమున దృశ్యమును చూచుగతి ప్రాప్తింపకముందే, దివిఁ జేరితివి! పుణ్యవతివి గాన, నీవు సుఖం దరిగితివి!—అమ్మా!

జహనారా—ఏమి తండ్రీ!

షాజహాను—తల్లీ! ని న్నాశీర్వదించెద రమ్ము.

జహనారా (జనకుని పాదవనజముల కెరగి)—మంచి దాశీర్వదింపుఁడు.

షాజహాను—(కుమారి మస్తకమున జేయివైచి) 'నందనీ! నీకుఁ బుత్రసంతానము కలుగకుండుఁగాక!' శాత్రవులారా! మీకుఁ గూడఁ గొమరులు పుట్టకుందురుగాక!

(పడంబడి నతమస్తకుండై షాజహాను విశ్రమించును)

(జహనారా కెల్లగఁ దండ్రిననుగమించును.)

షష్ఠదృశ్యము

ఒకపత్రిక చేతఁబట్టుకొని, ఔరంగజేబు పచారి చేయుచుండును.

ఔరంగ—దారా మృత్యుదండన మిందు విధింపఁబడి యున్నది! ఇది న్యాయాధిపతుల తీర్మానము!—ఇందు నాయపరాధమేమున్నది?—కాని నేను—కాదు!—ఏల?—ఇది తీర్మానము—తీర్పరులు మొఱకులుగారు—శిక్షను కలుషిత మేలగావింపవలయును!—జరిగినది విచారణకదా!—శంకయేల!—

(దిల్దార్ ప్రవేశించును)

దిల్దార్—హత్య! హత్య!!

ఔరంగ—(చమకితుఁడై)—ఎవరు!—దిల్దారహా! నీవా! ఈసమయమం దిచటి కేలవచ్చితివి ?

దిల్దారు—అయ్యా! ఏల! తగుసమయమున, తగు తావునకే వచ్చితిని! కావలసినచో చూచుకొనుఁడు! నేనీప్రదేశమున నుండకపోయినచో, ఈహత్య—

ఔరంగ—(కంపితస్వరమున)—దిల్దారహా! ఇది విచారణకర్తల తీర్మానము ?

దిల్దారు—ఏమి! అటులా మంచిది! కాని, అయ్యా! అసలువారెవరో చెప్పివైతునా ?

ఔరంగ—చెప్పుము !

దిల్దారు—కాని, అయ్యా! మీరాకస్మాత్తుగఁ గంపించి పోతిరేమి !
(You started like a—guilty thing. Shaksp. Hamlet)
మీ స్వరము శుష్కమారుతోచ్ఛ్వాసమువలె కంఠమునుండి వెడలెనేమి!—ఎందువలన!—ఎందువలననో జెప్పివైతునా ?

ఔరంగ—ఏమి!—ఏమి!—దిల్దారహా!

దిల్దారు—నిజంబేమన,—మీరు దారా మరణమును గోరుచుంటిరి.

ఔరంగ—నేనా !

దిల్దారు—'నేనా' యేమి! మీరే! మీరే!! మీరే!!!

ఔరంగ—కాని, యిది న్యాయాధిపతుల తీర్మానము.

దిల్దారు—ఏమేమి! న్యాయాధిపతుల తీర్మానమా! న్యాయాధిపత్యము రాజ్యాధిపత్యమును బట్టియే యుండును! మీ న్యాయాధిపతులు నిక్కముగ న్యాయాధిపతులో లేక యన్యాయాధిపతులో మీరెఱుంగకపోలేదు! ఈమరణదండనము విధించినపుడు మీ న్యాయాధిపతులు జగదీశ్వరుని ముఖంబు వీక్షింపలేదు—ఈ మృత్యుదండనము విధించినపుడు మీ న్యాయాధిపతులు ఢిల్లీశ్వరుముఖమును

ఔరంగ—అగ్రజా! ఇంక ప్రయత్నము? సామ్రాజ్యపు సింహాసనమును వీడవలసియున్నను, శంకారహితచిత్తుండనై విడచివైతును! ఇంత వంతమేల గావింపవలయును! మంచిది! అంతమొందించేమి! ఇపుడీ విధిపత్రమును చించివైచెదను.—[చించివైవ సముద్యమించును.] ఇపుడుకాదు! నయస్తఖాను సమక్షమున దీనిని చించివైచి ఈకించి ద్మహాత్త్వమును కార్యమందు జూపెదను.—అదుగో! నయస్తఖాను బిలబిల జరువెత్తుకొని యిక్కడకే వచ్చుచుండెను!—నయస్తఖానూ! రమ్ము.

[నయస్తఖాను, జిహన్జాఖులు ప్రవేశించి సలామొనరింతురు]

ఔరంగ—సేనాధిపతీ! విచారణయందు నా జ్యేష్ఠునకుఁ బ్రాణదండనము విధింపఁబడెను.

జిహాన్—ఆపత్ర మిదియేకాఁబోలు!—ఖోదాబంద్! (స్వామీ!) ఈ పత్రమును నాకొసంగుడు! మిగిలిన కార్యమంతయు నేఁబూర్తిఁ గావించివైచెదను! కాఫరు మరణశిక్షాపత్రమునఁ జిక్కొననాకరములు మిగుల తమకపడుచున్నవి. ఇంక దీనిని నాకొసఁగివేయుఁడు!

ఔరంగ—కాని నేను నాయన్నను మన్నించివైచితిని!

నయస్తఖాను—అదేమి ప్రభూ! ఇట్టి శత్రువునా మన్నించుట! ఈదృశ ప్రతిద్వంద్వినా క్షమించుట!!

ఔరంగ—అతండు నా ప్రతిద్వంద్వి యని యెఱుంగుదును. దానం జేసియే వానిని మన్నించుట పరమభాగ్య మనియు, మహాగౌరవం బనియుఁ దలఁచుచుంటిని.

నయస్తఖాను—స్వామీ! ఈ పరమభాగ్య క్రయమూర్ధము తాము తమ సింహాసనమును విక్రయ మొనరించి వేయవలెను!

ఔరంగ—ఏ బాహుబలంబున సింహాసనమును స్వాధీనము గావించు

కొంటివో, ఆ శాపబలంబుననే నాసపి [illegible]గలను.

నయస్తఖాను—ప్రక్కలో బల్లెము నుంచుకొని నిద్రింపఁ గలుతురా! ప్రభూ! ఒక మహా పదార్థమును సంపాదించుకొని, ఆ మరణము రాజ్యమును శాసింపఁ బ్రయత్నింతురా! స్వామీ! ప్రజావర్గంబులును, వాహినీ దళంబులును రాజన్యవ్రాతంబులును దారాపక్షము నవలంబింప [illegible] లూహించుండిరి! ఆ నాఁడు దారా కొఱకై వారలు బాలకులవలె విలపించి, దేవరపై శాప వృష్టిఁ గురిపించిరి! ఒకమాఱు వారలకు తిరుణము చిక్కెచో,—

ఔరంగ—ఏ మేమి!

నయస్తఖాను—దారాను దేవర రేయుంబవళ్లు కాచియుండఁజాలరు. తాము కార్యార్థులై దూరమం దున్నపుడు భవత్సైనికులు తగిన యదను జూచి దారాను, విడిపించిన—ప్రభూ! గ్రహించితిరా?

ఔరంగ—గ్రహించితిని.

నయస్తఖాను—అంతే కాక, వృద్ధ సామ్రాట్ దారా పక్షావలంబి యను విషయమును మఱువకుఁడు. సైనికు లతనిని, గురుభావమున బూజించి, పితృభావమునఁ బ్రేమింతురని యెఱుంగుఁడు!

ఔరంగ—(మూలిగి తలవంచి పచారు గావించుచు) అట్లే యగుచో, సింహాసనము నొసఁగివైతును.

నయస్తఖాను—అటులైన, వింత శ్రమపడి సింహాసనము నేల హస్తగత మొనరించుకొంటిరి? జనకుని సింహాసనచ్యుతుఁ గావించి, అన్నలను బంధించివైచి, ప్రభూ! చాల దూరము సాగిపోతిరి!

ఔరంగ—కాని—

జిహాన్—ఖోదాబంద్! (స్వామీ!) దారా కాఫరు! తాము కాఫరును మన్నింతురా! ప్రభూ! ఇస్లాము ధర్మ రక్షణార్థమై, తాము నేఁడీసింహాసనమున నాసీనులై యుంటి రను విషయమును మఱువ

కుఁడు. ధర్మరక్షణ మొనరింపుఁడు! మతగౌరవము నిలుపుఁడు!

ఔరంగ—జిహాన్ఖానూ! నిక్కము బలికితివి! దుర్నయదౌష్ట్యములు నెన్నని నా శిరమున వహించి యుండఁగలను, కాని పవిత్రమైన యిస్లాము మతమునకుఁ గలుగు నీ యవమానమును సహింపఁ జాలను. ఈ యుద్దేశము నీ వఱలో మౌల్వీల సమక్షమున శపథ పూర్వకముగ వెల్లడించితిని. మంచిది! మృత్యువే దారాకుఁ దగు శిక్ష! జిహాన్ అలీఖానూ! ఈ మరణశిక్షా పత్రమును, నీ విఁకఁ గొనిపొమ్ము! ఆగుము! సంతకము చేసి యిచ్చెదను.

[సంతకము మొనరించును]

జిహాన్—స్వామీ! ఇఁక నిచ్చివేయుఁడు. నేటి నిశీధమందే దారా ఛిన్న మస్తకమును దేవరకుఁ జూపెదను. వేగమ పోయి యీ విధిపత్రము ననుసరించి కార్యమును నిర్వర్తింతును. వెలుపల నా శిక్ష వేచియున్నది.

ఔరంగ—నేఁటి నిశీధమందే!

సయ్యస్తఖాను—[పత్రము నౌరంగజేబు కరములనుండి గైకొని] ఆపద యెంత శీఘ్రమున గడచిన, నంత మేలు. [జిహాన్ఖానునకు పత్రము నొసఁగును]

జహాన్—ప్రభూ! ఇఁక పోయి వచ్చెదను. సలాము!

[నిష్క్రమింపఁ బోవును]

ఔరంగ—కొంచెము తాళుము! [విధిపత్రమును దీసుకొని, దానిని చదివి] మంచి దిఁక పొమ్ము!

[పత్రము నొసఁగివైచును]

జిహాన్—స్వామీ! ఇఁక పోయి వచ్చెదను. వందేగి! (సలాము)

[నిష్క్రమింపఁ బోవును]

ఔరంగ—కొంచెము తాళుము! [పత్రమును దీసుకొని దానిని

చదివి మంచి దిక్కైపొమ్మా!

[పత్రము నొసంగివైచును. జిహానరీ నిష్క్రమించును]

ఔరంగ—(జిహానరపోయిన ద్వారము కడకుఁ బోవును; మరల దిరిగి వచ్చును; తదుపరి కొంచెముసేపు యోచించి, పిదప "ఇంకేల! ఎందులకు! జిహానరీ! జిహానరీ!! లేదు! వెడలిపోయెను! సయస్త ఖానూ! సయస్తఖానూ!

సయస్తఖాను—ఏమి ప్రభూ!

ఔరంగ—ఏమిపని జేసితినోయి!

సయస్తఖాను—దేవర యుక్తముగనే యాచరించితిరి! బుద్ధిమంతుని వలెనే కావించితిరి!!

ఔరంగ—కాని పోనిమ్ము!!

[మెల్లమెల్లగ వెడలిపోవును]

సయస్తఖాను—ఔరంగజేబూ! అటులైన నీకుఁ గూడ నంతరాత్మ యున్నదా?

[నిష్క్రమించును]

[Sayastakhan's ejaculation strikes the key-note of Aurangzeb's—character He was not (as we observed heretofore) the embodiment of absolute evil which we find in full-abundance in Iago to whom conscience or honour is an absurdity. Aurangzeb, the Moghul fratricide can therefore be aptly compared with Richard III, the English fratricide who, not withstanding his villainous and Machiavellian deeds, could'nt suppress the qualms of conscience.]

## సప్తమదృశ్యము.

ఖిజిరాబాదునందలి కారాగారము — రాత్రికాలము.

(సిపారు కటికినేలపై నిద్రించియుండును. దారా మేల్కాంచి విన్నఁబోయిన మోమున దనయుని విలోకించుచుండును)

దారా — నిద్రించుచుంటివా! తండ్రీ! నిద్రించుచుంటివా! నిద్రా! సర్వ సంతాపహారిణీ! ప్రత్యహము నీవు మానవుల చింతల నన్నిఁటిని గొంతసేపు విస్మృతిగర్భమున ముంచియుంతువు! జననీ! యిపుడు నాచిన్ని తనయుని వంతల నన్నింటిని మఱపించుము!

[See Macbeth's address to sleep:
—the innocent sleep.
Sleep that knits up the ravell'd sleave of care,
The death of each day's life, sore labour's bath,
Balm of hurt minds, great nature's second course,
Chief nourisher in life's feast,—
Also see Henry IV's apostrophe to sleep:
O Sleep! O gentle sleep!
Nature's soft nurse, ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
And steep my senses in forgetfulness—

Also see:
His body couched in a—curious bed,
... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
His wonted sleep under a fresh tree's shade,
All which secure and sweetly he enjoys &c &c
(Henry VI)

See also:
Sleep so soundly as the wretched slave,
Who
Gets him to rest,—cramm'd with distressful bread;

He, like a lackey from the rise to set.
Sweats in the eye of Phaebus, and all night
Sleeps in Elysium, ... ... ... ... ... ... ... ...

(Henry V)

నీడవలె నా బాలుఁడు ప్రవాసమందు నన్ననుగమించి, శీతాతపములందుఁ గుంది, జీవచ్ఛవమై పోయెను! నిద్రా! వానికీవు తగిన యూఱట నొసంగుము. నే నశక్తుఁడను. తన బిడ్డల నెట్టి లోటు లేకుండ, పోషించుట జనకుని కర్తవ్యము. నే నాకర్తవ్యమును గావింపఁజాలనైతి—వత్సా! క్షుద్బాధచేఁ గృశించిపోతివి! పట్టెడన్నము నీకుఁ బెట్టనేరనైతి! దాహముచే నీ హృదయము వ్రయ్యలయ్యెను. ఒక్క నీటిబొట్టునైన నీ కొసఁగి నీ దప్పి దీర్పఁజాలనైతి! నాలుక తడియాఱి పిడుచ గట్టిపోవుచున్నదని నీవు విలపింప నిన్నుజంపగమకించితిని. చలిచేఁ గంపించుచున్నను నీకు గప్పుకొన వస్త్రము నొసఁగలేనైతి—అన్నవస్త్రములకు నేనే దూరమైపోతిని! చిన్నప్పుడు తన హృదయమున జేర్చుకొనిన నిద్రాదేవికిఁ గూడ నాపైనింతయైన జాలి కలుగలేదు. కాని నీకష్టములవలె నాకష్టములు నాయెడఁద నంతగా బాధించుటలేదు. నాకెన్ని బాములు కలిగినను సహింపగలను. కాని, నీయగచాట్లను నేను చూచి సహింపనేరను. నీవు కష్టపడుచుండ నే వీక్షింపఁజాలను. కాని తండ్రీ! (డగ్గుత్తికతో) నీదుఃఖమున కూఱటఁ గానలేకుంటి. నీయంగలార్పు నడంపనేరకుంటి. ప్రాణాధికా! అనిమేషనయనుఁడనై నిన్ను వీక్షించుచు బ్రతికియుండు నేఁడు నీవును నేనును దక్క నింకనన్యులెవ్వరును లేరని తలఁచుచుంటిని. దుస్సహాఖేదముచే బాధపడుచున్నను, కారాగారమందు స్రుక్కుచున్నను, మక్కువతో నీముద్దుమోమును విలోకించినంతనే నాదురంత సంతాపమంతయు మఱపునకు వచ్చుచున్నది!

[ దిల్దారు ప్రవేశించును ]

దారా—ఎవరు!—నీవు?

దిల్దారు—నేను—ఆహా!—ఏమిదృశ్యము!

దారా—నీవెవరవు?

దిల్దారు—పూర్వమున నేను సుజాసుల్తాను విదూషకుఁడను. ఇపుడు నే నౌరంగజేబు సభాసదుండను.

దారా—ఇచటి కేల వచ్చితివి?

దిల్దారు—వచ్చుటకు ముఖ్యకారణ మేమియు లేదు. ఒకమాఱు మిమ్ముఁజూడ నరుదెంచితిని.

దారా—నన్నుఁ జూచు టెందులకు?—నాతోఁబరిహాసమాడ వచ్చితివా? మంచిది. పరిహాసింపుము.

దిల్దారు—పుణ్యాత్మా! నేను గేలిసేయరాలేదు. ఒకవేళ నట్లేవచ్చి నను ఈదృశ్యము కన్నులఁబడిన యక్షణమే ఆతలంపుకరిగిపోయి యశ్రుస్రవంతి ప్రవహించి భూమినీఁదడిపి వైచెడిది.—ఆహా! ఏమి యీదృశ్యము! అట్టిసుకుమారుఁడు నేడిట్టులయ్యెనా! [భగ్నస్వరమున] భగవాన్! ఏమి యీదుర్నయము! ఆ—(కంఠము రుద్ధమై పోవును.)

దారా—అదేమి! నీనేత్రములనుండి బాష్పము లొలుకుచున్న వేల? విలపించుచుంటివా?—విలపించు టేల? నాయనా!

దిల్దారు—నేను విలపించుటలేదు!—ఈదృశ్యమత్యంతమహిమ మయమైనది. పర్వత మొకటి ప్రక్కలైపోయెను! మహార్ణవ మొకటి మరుభూమి యైనది!—ఆహా! ఆదిత్యుఁడు మలినుఁడై పోయె! బ్రహ్మాండమున నొకవంక సృష్టియు, మఱొకవంక ధ్వంసమును జరుగుచుండెను! పృథివి తాదృశమైయున్నది! ధ్వంసము! ధ్వంసము!—పవిత్రము! మహిమమయము!! విరాటు!!!

దారా—యువరాజా! నీవొక దార్శనికునివలెఁ గన్పట్టుచున్నావు!

దిల్దారు—యువరాజా! నేను దార్శనికుండను గాను. విదూషకుండను. సభ్యాసనము నధిరోహించితిని. దార్శనికపదవి నింక నలంకరింప లేను. కాని తిండి తినుచుతినుచు నమయమున నొక్కమాఱు ముఖమెత్తి చూచుటయే దర్శనమగుచో నేను దార్శనికుండననియే చెప్పవచ్చును! ప్రాజ్ఞులారా! మండుచేగాని చల్లారుట దీపమునకు స్వాభావికముకాదనియు, వెలుగుచేగాని తఱిగితఱిగి యంతమగుట త్రైణమున కుచితముకాదనియు, సుఖమేగాని దుఃఖమీశ్వరునివలన బ్రాప్తించదనియు, మొఱకులు తలతురు. కాని, యీ ద్వంద్వావస్థ లోకే నియమమునకు కిరుపార్శ్వములని వారెఱుంగరు.

దారా—నేనట్లు భావింపను.—దుఃఖమందు మందస్మిత మొనరించు వారెవరు? మరణింపనిచ్చగించు వారెవరు? నేను మరణింప నిచ్చగింపను.

దిల్దారు—పవిత్రమూర్తీ! మీ మరణదండనాజ్ఞను నేను రద్దుపఱిచివచ్చితిని. తాము కారాగారమునుండి విడివడఁ గోరుదురేని, తమబట్టల వదలి నాబట్టలధరించి వెడలిపొండు. మీవస్త్రముల ధరించి నే నియ్యెడఁ గూర్చుండెదను. యువరాజా! శంకలేకుండ నావేడికోలు నాలింపుఁడు.

దారా— తదనంతరమున నీవేమగుదువు?

దిల్దారు—నేను మరణింప నువ్విళులూరుచుంటిని. మృత్యువు నాకెంతయో యానందకరము. నాకొఱకై విచారించు వారు జగంబున లేరు.

దారా—ఏమి! నీవు మరణింపఁ గోరుచుంటివా! చచ్చుటంత సులభమా!

దిల్దారు—ప్రభూ! నావిషయమున నట్లే యనితలపుఁడు. అసువుల వీడ [illegible] మృత్యువున నాకు కడు

ప్రియుఁడను. మీపై నేఁడు నేనెంత కృతజ్ఞుండనో మాటలతో నెఱింగింపఁ జాలను

దారా—మహాత్మా! కృతజ్ఞత యెందుకు?

దిల్దారు— మేను వీడుటకొక మంచితరుణ మొసఁగి సంతసిలుడు. ఇఁక నాలస్యము చేయక బట్టలుమార్చుకొనుట కియ్యకొనుఁడు.

దారా—(తలపైకెత్తి)—దయామయా! నాక మనని దేనా! మఱొకటి కలదా!—మిత్రమా! నీవు నుడివినచొప్పున నాచరింప నేనియ్యకొనను.

దిల్దారు—(డగ్గుత్తికతో)—ఏమిస్వామీ!—మరణార్థమిట్టి మంచితరుణమును భిక్షగాఁబడయఁజాలనా! జనకా! నా ప్రార్థన మంగీకరింపుఁడు.

[సాగిలపడి దారాపాదములఁ బట్టుకొనును]

దారా—మిత్రపుంగవా! నేను నిన్ను మరణింపనీయను. అంతేకాక, యీ బాలకుని వదలి నే నెందును పోఁజాలను.

[జిహాన్‌ఖాన్ ప్రవేశించును]

జిహాన్—ఇఁక నెందు బోనక్కఱలేదు! ఇదిగో నీ మరణ శిక్షాపత్రము.

దిల్దారు—(చమకితుఁడై)—ఏమేమి!

జిహాన్—కాఫర్! మరణింప సంసిద్ధుఁడవు కమ్ము! ఘాతుకులు వేచియున్నారు.

దిల్దార్—అటులైన చక్రవర్తి తన యుద్దేశమును మార్చుకొనెనా?

జిహాన్—అవును! దిల్దార్! అనుగ్రహపూర్వకముగ నీ వింక వెలుపలికి దయచేయుము. మా కార్యము మేము చేతుము!

దారా—ఔరంగజేబు తన ప్రకాండసామ్రాజ్యమందు నిశ్వాసమును విడచుటకు నాకొక జానెడు నేల నైన నొసఁగజాలఁడా? నేనీ

యమునకు తీరమున, నీ దుర్గంధమయ ప్రదేశమున నుంటినిగదా! నాశరీరమున నీచినిగిన బట్ట యొక్కటియే యున్నదిగదా! ఒకటి, రెండు, రొట్టెలు మాత్రము ప్రాణముల నిలుపుకొనుటకై మెసవు చుంటినిగదా! వీనిని కూడ నతఁడు తన యన్న కొనఁగజాలఁడా?

దిల్దార్—(కరముల జోడించి)—జిహానాలీ! నీవు నేఁటికి తాళుము. నేను చక్రవర్తి యాదేశమును గొని వచ్చెదను.

జిహాన్—దిల్దార్! తాళఁజాలను! నేఁటి నిశీథమందే దారా ఛిన్నశిరమును దనకుఁ జూపవలెనని సామ్రాట్టు వాజ్ఞ యొసఁగెను.

దారా—ఈ యాదల!—నేఁటి నిశీథమందే! యింత శీఘ్రమే!—వానికిఁ గావలసివచ్చెనా! దీని నొసఁగకున్న, వాని నిదురకు భంగము కలుఁగునా!—ఈ పాడు శిరమున కింతమూల్యమున్నదా!

జిహా—నేఁటి రాత్రియే నీ ఛిన్నశీర్షమును గొంపోవనిచో మా ప్రాణములు నిలువఁజాలవు.

దారా—అటులా! అటులా! జిహానలీ! అట్లగుచో నీవేమి చేతువు? మంచిది! అట్లైన నన్ను వధింపుము. చక్రవర్తి యాజ్ఞ కదా!—నేఁడు చక్రవర్తి యెవఁడు! ప్రజలెవ్వరు!—నవ్వుచుంటివా? నవ్వుము!

జహాన్—నీవు సిద్ధముగ నుంటివా?

దారా—సిద్ధముగనే యుంటిని. సిద్ధముగనుండకున్న నుపోయిన దేమి! (దిల్దార్ నుద్దేశించి) ఒకప్పుడీజిహానలీఖాన్ నాసమ్ముఖమునఁ జేతులు మోడ్చి ప్రాణభిక్ష వేఁడెను. నేనా భిక్ష నొసఁగితిని. నేఁడు—విధీ! ఏమి రచనాకౌశలము! చమత్కారము—చమత్కారము!

జిహా—చక్రవర్తి యాజ్ఞ? న్యాయమూర్తుల విచారణ! నే నేమి చేయుదును!

దారా—చక్రవర్తి యాజ్ఞయా! న్యాయమూర్తుల విచారణమా!

నిక్కము. నిక్కము! నీ వేమి చేతువు!—(డిల్దార్ నుద్దేశించి) ఇఁక పొమ్ము. నీకును నాకు నిదియే తొలి చూపు! ఇదియే కడ సారి చూపు!

దిల్దార్—సాధ్యము కాలేదు. రక్షణ మొనరింప సాధ్యము కాలేదు. ఇది కృపాళుఁడైన భగవానుని యిచ్ఛ కాఁబోలు. గ్రహింపఁజాల కుంటిని! కానీ, యిందొక మహదుద్దేశముండి యుండవచ్చును. దీనికొక మహత్పరిణామముండవచ్చును! కానిచో, యింత నిర్మమత—ఇంత దురంత, మింత యఘము, వృథయై పోవునా! యువరాజా! మీ వంటి బలి నిక్కువముగ నవసరమై యుండవచ్చును. ఆ యవసరమేమియో నాకు బోధపడుటలేదు. కాని, అక్కఱ మాత్రముండి యుండును. ఇట్లని యెఱింగి ప్రవృత్త చిత్తులై తాము తమ ప్రాణముల బలి యొసఁగుదు.

దారా—నిక్కువముగ నేనట్లే యొసఁగెదను. దుఃఖమేల! ఎప్పుడో యొకప్పుడు పోకతప్పదుగదా! రెండుదినములకు ముందో లేక రెండు దినములకు వెనుకనో పోవలయును. నేను సిద్ధముగ నున్నాను:— మిత్రమా! ఇఁక నాకు సెల వొసఁగుము. ఈ క్షణమాత్రకాలమే నీతోఁ బ్రసంగించితి. నీ వెవరవో నే నెఱుంగను, కాని నీ వొక పూర్వసుహృద్వరునివలెఁ దోఁచితివి.

దిల్దార్—అట్లగుచో—ఆహాహా!!!

[క్రిందఁ జతికిలపడి పోవును]

జిహాన్—దిల్దారూ! ఏమి యీ యాలస్యము! వేగమ వెలుపలికిఁ బొమ్ము.

దిల్దార్—(జిహాన్ ఖాన్ పాదములఁ బట్టుకొని) నేఁటికి తాళుము! నేఁడు వీనిని రక్షింపుము! నీ కెంతయో పుణ్యముండును. తండ్రీ! నా ప్రార్థన మంగీకరింపుము. ఇకించుక ...

జూపుము!

జిహాన్—ఛీ! పొమ్ము! ఈ దొంగయేడ్పులకే జిహానలీఖాన్ మెత్తపడువాఁడుకాఁడు! పొమ్ము! లేకున్న నిన్నిప్పుడే యావలి కీడ్పించి వైచెదను!

డిల్దార్—తండ్రీ! వినవా! వినవా!

జిహాన్—(పదాఘాత మొనరించి)—ఛీ! పో! మా కడ్డురాకుము.

డిల్దార్—(లేచి యూర్ధ్వముఖుఁడై) ఆహా! ఏమి యీ దుర్నయము. అయ్యో! ఇఁక నీతఁడు వినఁడు. ఎంత క్రౌర్య మెంత క్రౌర్యము! నేనీ భీషణదృశ్యముఁ జూడఁజాలను! యువరాజా! ఇఁక నేఁ బోవుచుంటిని! ఇదే కడసారిచూపు! ఆహాహా! భగవాన్! భగవాన్!! భగవాన్!!!

[నిష్క్రమించును.]

దారా—జిహానలీ! నాయనా! ఇఁక నన్నుఁ జంపివేయుము!

జిహాన్—నాజిర్!

[నలుగురు ఘాతకులు ప్రవేశింతురు]

(జిహాన్ సంజ్ఞ యొసఁగును)

దారా—ఒకించుక తాళుఁడు. ఒక మాట—నాయనా! నాయనా!! అయ్యో! యేల పిలచితిని.

సిపార్—(లేచి) నాయనా! ఇదేమి!—అయ్యో! వీర లెవరు!—నాకు భయము వేయుచున్నది.

దారా—తండ్రీ! వీరలు నన్నుఁ జంపివేయ వచ్చిరి! నీ కడ సెలవు పుచ్చుకొనుటకై నిన్ను లేపితిని. వత్సా! నాకు సెలవిమ్ము.

(ఆలింగన మాచరించుకొని) ఇఁక పొమ్ము—జిహానలీ! నా పుత్రుని యెదుటనే నన్ను వధించుటకు నీవంత ఘోర పిశాచివి కావని తలఁచెద. వీని నింకొక గదిలోనికి దీసికొనిపొమ్ము.

జిహా౯—(ఒక ఘాతుకు నుద్దేశించి)—వీని నయ్యాగారములోనికిఁ గొనిపొమ్ము.

(ఘాతకుఁడు నీరవుఁడై నిలువంబడును.)

సిపార్—(జిహానలీ యీడ్చుచుండఁ దండ్రి చేతులఁబడి) నేను రాను! నేను రాను!! మీరు మా యయ్యను జంపివైచెదరు. ఎందులకు చంపివైచెదరు. (జిహానలీ కరములనుండి విదలించుకొనివచ్చి)—నాయనా! నిన్ను విడచి నేను పోను. (జనకుని కాళ్ళను గట్టిగబట్టుకొనును.)

దారా—(తనయుని జేతులలోనికిఁ దీసికొని)—తండ్రీ! నన్నుఁ బట్టుకొని మాత్ర మేమి చేయఁగలవు! ఈ విధంబుగనైన నన్ను నీవు రక్షింపగలుగుదువా! వత్సా! పొమ్ము. వీరలు నన్ను వధించివైచెదరు. నీ వా దృశ్యమును జూడఁజాలవు.

(ఘాతకులు నల్వురు నేత్రములఁ దుడిచికొనసాగిరి)

జిహాన్—అరే! దుర్మతులారా! తీసికొనిపొండు.

(ఘాతకులు సిపార్‌ను బట్టి యీడ్చుకొని పోఁదొడంగిరి)

సిపార్—(గోలుగోలున నేడ్చుచు)—రాను! నేనురాను! నేనురాను!! [యిట్లని సిపార్ ఘాతకుల కరములనుండి విదలించుకొన యత్నమొనరించును.]

దారా—ఆగుఁడాగుఁడు. నేనువానికి బోధచేసి చెప్పెదను. పిమ్మట నతఁడు మీకడ్డురాడు!—విడచివేయుఁడు [ఘాతకులు విడచివేయుదురు. సిపారాకస్మికముగఁ దండ్రినిఁగవుంగిలించు కొనును.]

దారా—(తనయుని నిజయూరువులఁ జేర్చి)—తండ్రీ!

సిపార్—ఏమి?

దారా—కన్నతండ్రీ! నాకుసెలవిమ్ము! నీవిన్నాళ్ళిన్ని కష్టములందుఁ గూడ నన్నువీడలేదు. చలియందును, నెండయందును, తిండిలేక,

నిదురలేక, అడవులందును, కొండలందును, నీవు నాతోఁ గ్రుమ్మఱితివి.—నిముసమైన నన్ను వీడి యుండలేదు. దుఃఖముచే నంధుఁడనై నీగుండెలందుఁ గరవాలముఁ బ్రస్వాగమకించితివి. అట్లయ్యు, నీవు నన్ను విడచితివిగావు. ప్రవాసమందును, బవరమందును, కారాగారమందును, ప్రాణంబువలె హృదయాంతరాళ శోణితంబుతో కలసిపోయి యుంటివి! అట్టినిన్ను నేఁడు దురాత్ముండగు నీజనకుఁడు (దారాస్వరము రుద్ధమైపోవును. కొంతతడవైన పిదప బహుకష్టమున నాత్మదమన మొనరించుకొని డగ్గుత్తికతో) దురాత్ముం డగునీ జనకుఁడు నేఁడు నిన్నువీడి పోవుచుండెను!

సిపార్—అయ్యో! అమ్మ వెళ్ళిపోయినది! నీవుకూడా—(ఏడ్చును)

దారా—తండ్రీ! ఏమిచేయుదు! వేఱుపాయము లేదు. నేఁడే నేను చనిపోవలయును. నిన్ను వీడి పోవుటకునా కెంత దుఃఖము కలుగుచుండెనో నా మేనువీడిపోవుటకు నా కంతసంతాపము కలుగుచుంటలేదు. (కండ్లుతుడుచుకొని) అన్నా! ఇకపొమ్ము! వీరలునన్ను వధించెదరు. అదిమిగుల భీషణదృశ్యమైయుండు!—దానిని నీవు చూడఁజాలవు!

సిపార్—నిన్నువిడచి పొమ్మందువా! నాన్నా! నేనుపోను! పోవను!

దారా—చిట్టీ! ఎన్నఁడు నీవునామాట కడుగుదాటలేదు!—ఎన్నఁడు—(పొంగిపొరలివచ్చు యశ్రువారిఁదుడుచుకొని) బాబూ! ఇక వెళ్ళుము. నామాట వినుము. నేను బ్రతిమాలుకొనుచుంటిని. (క్షణమూరకుండి) కన్నతండ్రీ! ఈవరకో నెన్నఁడు నీవు పిత్రాజ్ఞనుల్లంఘించి యుండలేదు. ఇదేనా కడపటి యాజ్ఞ—నా యీకడసారి వేడికోలుఁ ద్రోసి వైవకుము. తండ్రీ! పొమ్ము—నామాట వినవా! నాయనా! బాబూ! పొమ్ము!

[సిపార్ నతముఖుఁడై వెడలి పోవనుద్యమించును.]

దారా—"తండ్రీ!"

సిపార్—మరలివచ్చును.

దారా—(డగ్గుత్తికతో)ఒకపర్యాయము—కడపటిమాఱు వక్షమునఁ జేర్చుకొననిమ్ము. (బిగ్గఁగౌఁగలించుకొనును) అయ్యో!—ఓః!— తండ్రీ! ఇకపొమ్ము!

[ మంత్రముగ్ధునిమాడ్కి నతముఖుఁడై సిపారొక యాఘాతకుని వెంట మఱొక యాగారములోని కరుగును. ]

దారా—(ఊర్ధ్వముఖుఁడై యెదచేయుంచుకొని)—హేయీశ్వరా! హేదయామయా! పూర్వజన్మమం దేనెట్టిమహాపాపములఁ గావించితిని! ఆ పాపంబున కిదె తగుశాస్తియా! మంచిది! నీచిత్తమెట్లో యట్లాచరింపుము—(నతముఖుఁడై) ఓః! —సతీ! నీ వదృష్టవంతురాలవు! నీవీ ఘోర--(కంఠము గద్గదమైపోవును. మరలఁగష్టంబుతో) ఈ ఘోరదృశ్యమును జూడకుండ, లే—లేచిపోతివి—అమ్మా! జహారత్! ఆపాపి నిన్నేమి చేసివైచునో గదా! నీవెట్లెంగలావ్రుచుంటివోగదా! ఎట్టి కష్టములఁ బడుచుంటివోగదా!—చిట్టీ! నిన్ని నరకకూపమందుఁ బడఁద్రోచిపోవుచుంటినా! నీవెట్లు బ్రదుకఁగలవు! అయ్యో! నాయనా! నిన్నుగూడ నీహంతకులు జంపివైతురేమో! తండ్రీ! ఎట్టిచేటుకలిగెను!—బిడ్డా! నీ విప్పుడే యడవులఁబడి నడయాడుచుంటివి! ఈ ఘోరవార్తవిని యాత్మహత్యఁ గావించుకొందు వేమోకదా! నీవు—

జిహాన్—ఛీ! యూరకుండుము! నీ దొంగయేడ్పులు! బుడిబుడిదీర్ఘములు మానుము. ఇఁక మరణింప సంసిద్ధుఁడవు కమ్ము!

దారా—తండ్రీ! క్షమింపుము. ఘాతకులారా! ఇకమీపని కానిండు!

(నతమస్తకుఁడై యూరకుండును.)

జిహాన్—ఘాతకులారా! వీనిని గదిలోనికిఁ గొనిపోయి తుదముట్టించి రండు! ఆకార్యము గావింప నక్కఱలేదు.

[దారాయాఘాతకుల ననుగమించి పార్శ్వయాగారములోని కరుగును.]

జిహాన్—నా ప్రాణదాత హత్యను నాకన్నులతోఁ జూడకుండుటేమం

నేపథ్యమునఁ—ఓ! ఓ!! ఓ!!!

జిహాన్—హా! పూర్తియాయెను! హా! హా!! హా!!!

సిపార్—(తాను బంధింపఁబడిన గదినుండి) నాన్నా! నాన్నా!! (కవాటమును బ్రద్దలు గావింపఁ బ్రయత్నించును.)

[ఘాతకులు దారాఛిన్నమస్తకముఁ గొని మరలఁ బ్రవేశింతురు.]

జిహాన్—ఆశిరమును నాకిండు. నేను చక్రవర్తి కడకు దానిని గొని పోవుదును.

ఘాతకులు—(రుధిరసిక్తయుత్తమాంగమును జిహానలీఖానున కర్పింతురు)

జిహాన్—(దానిని గైకొని నవ్వుచు)—వహవ్వా! బహుమానము!! బహుమానము!!!

[గంతులు వైచును.]

సిపార్—(కవాటమును భేదించివైచి) నాన్నా! నాన్నా!! (యని యుచ్చైస్స్వనమున విలపించుచు వెలుపలఁబడి నిజ జనకుని ఛిన్నశీర్షము విలోకించి, చివాలున నేలఁగూలి మూర్ఛితుఁడగును.)

[Dara's murder reminds us of the murder of Clarence. But Shakespeare, inasmuch as he belongs to the Elizebethan Era makes the awful occurrence take place on the Stage. Roy, on the other hand, would have the murder happen behind the curtain since he is (wilfully I use the Present tense) cognisant of the fact, and rightly so, that an Indian audience can't stand the terrible spectacle. Nevertheless the tragic scene in "*Shajahan*" is not a whit less terrific than that we find in "*Richard III*", and I make bold to aver that here, in the delineation of this doleful and dreadful scene Dwijendralal excels even the Mount Everest of world's master-dramatists. Dara's tragic end is indeed horrible; but, horrible as it is, it doesn't so much draw tears from our eyes as the unspeakably Pathetic scene of the crying parent and the clinging lad—a scene more horrid and heart-rending than the merciless spilling of blood, a scene, to witness which even the very walls of the prison must have wept, a scene the like of which we can in vain find (not barring even the tragic-bed-scene of the saintly Desdimona and the noble Moor) anywhere in the great chambers of world's literature !]



# షాజహాన్.



## పంచమాంకము.



### ప్రథమదృశ్యము.

ఢిల్లీయందలి దర్బారుమందిరము—ప్రాతఃకాలము.

మయూరసింహాసనమం దౌరంగజీబాసీనుఁడై యుండును.

సమ్ముఖమందు మీర్జుమ్లా, సయస్తఖాన్, యశవంతసింహా, జయసింహా, దిలీర్ ఖాన్, ప్రభృతులుందురు.

ఔరంగ—నా ప్రతిజ్ఞానుసారముగ మహారాజునకు ఘూర్జరసీమ నొసంగితిని.

యశవంత—దానికి బదులుగా దేవరకుఁ దోడ్పడ సేనాసహితుండనై యరుదెంచితిని.

ఔరంగ—యశవంతసింహామహారాజ్! ఔరంగజీబెవరలో నెవరిని రెండుమార్లు విశ్వసించియుండలేదు. అయినను మేము జయసింహామహారాజు ముఖముచూచి యోధపురపతికి రాజభక్తి నేర్చుకొన రెండవతరుణ మొసఁగుచున్నాము.

జయసింహా—అది దేవర యనుగ్రహము.

యశవంత—స్వామి! వంచన మూలముననో లేక బలంబువలననో సింహాసనాధికార మార్జించి సామ్రాజ్యమందు దేవరస్థాపించిన శాంతిని జెఱచి మరల నశాంతి నుదయింప దొరకొనుట మహాపాపమని దలంచెద.

ఔరంగ—ఈమాట నేఁడు యోధకులాధీశ్వరు నోటినుండివిని మిగు

హాఁడు సులేమానునకు సైన్యసమేతము గ నాశ్రయ మొసఁగి సం గీకరింపఁడాయెను. అందుచే నతఁడు మమ్ములఁ బరిత్యజింపవలసి వచ్చెను. తదనంతరమందే దేవరవారి లేఖనుగొని భవదాజ్ఞానుసా రముగ పృథ్వీసింహునకడ కరిగి, "సులేమాన్" చక్రవర్తి యన్న కుమారుండనియు, సామ్రాట్ తనయన్న కొమారుని తనపుత్రుని వలెనే ప్రేమించుననియు దానంజేసి వానిచక్రవర్తి కప్పగించివైచిన క్షత్రధర్మవిరుద్ధము కాదనియు, నేనాతనితోఁ జెప్పితిని. ప్రథమ మందా ప్రభువు సులేమానును నాకుస్వాధీనమొనరింప నొప్పుకొన లేదు. కానియారాము నాఁడేఅతఁడేకతంబున నోదారాపుత్రుఁడిఁదన దుర్గమునుండి వెడలఁగొట్టెను.

ఔరంగ—అభాగ్యనందనుఁడు!—పిమ్మట నేమిజరిగెను.

దిలేర్—కాశ్మీర దేశమునుండి వెడలఁగొట్టబడి సులేమాను, టిబెట్టు దేశముబోవ యత్నమొనరించి, కొండొకదూరమరిగి పదమెఱుఁ గనిహేతువున రాత్రిరాత్రియంతయు భయంకర గిరికందర పర్వతో పత్యకాభ్యంతరంబులఁ గ్రుమ్మరి ప్రభాతసమయంబున మఱల శ్రీ నగర పట్టణప్రాంతమందు విడిసెను. అపుడు సైన్యముల వెంటఁబె ట్టుకొని నేనువానిని బట్టుకొంటిని. ఈకార్యమందు నాదోషమేమై ననున్న భగవానుఁడు నన్ను మన్నించుగాక! నేనెవరికిని దాసుఁ డనుగాను. సార్వభౌముని సైన్యాధ్యక్షుఁడను. దానంజేసి చక్రవర్తి ముదల ననుసరించి కార్యమొనరించుటయే నాకర్తవ్యము.

ఔరంగ—ఖాన్సాహేబూ! నీవిపుడా పోవువాని విటకుఁ గొనిరమ్ము.

దిలేర్—చిత్తము మహాప్రభూ!

[నిష్క్రమించును]

ఔరంగ—మహారాజా!జిహానలీఖానును పౌరులు హత్యఁగావించితిరా!

జయసింహ—స్వామీ! అవును. జిహాన్ఖాన్ నిజానుచరుల వలననే

చావఁబడెనని వింటిని.

ఔరంగ—ఈశ్వరుఁడు పాపాత్మునకు సముచిత దండనమునే విధియించెను.—అదిగో సులేమాను నిచటికే వచ్చుచున్నాఁడు—కుమారా! రమ్మా!

[దిలీర్ ఖాన్ ననుగమించి సులేమాన్ ప్రవేశించును.]

ఔరంగ—కుమారా! నిన్నుఁ గాంచి చాలదినములాయెను! తండ్రీ! ఇదేమి తలవంచుకొని యుంటివి.

సులేమాన్—సామ్రాట్!—(ఏమో చెప్పబోవుచు స్తబ్ధుఁడగును.)

ఔరంగ—వత్సా! వచింపఁదలఁచిన దేదియో వచింపుము. నీకేమియు భయములేదు,—నీజనకుని మరణమావశ్యకమైనందుకు మేమెట్లుంగలార్చితిమో యల్లాయెఱుఁగును. ఆవశ్యకమే కానిచో—

సులేమాన్—ప్రభూ! నివారించిన కార్యంబునకు నేనే హేతువు నడుగుటలేదు. దిగ్విజయుండైన యౌరంగజేబు నేఁడెవ్వానికైన నిజకార్యములకు సమాధానముల దెలుపనక్కరలేదు. తెలిసినను వానిని విచారించువారెవరును లేరు! నన్ను వధించివేయుము. పౌరుషవంతుల కత్తి వాఁడిగనే యుండును. దాని నిఁక విషాక్తము గావింపనేల?

ఔరంగ—సులేమానూ! మేమునిన్నుఁ జంపఁదలంపము. కాని—

సులేమాన్—ఆ "కాని" యనుదాని యర్థము నే నెఱుంగకపోలేదు! మృత్యువుకంటె భీషణకృత్య మొకటి నటుపఁ దలంచుచుంటివి. క్రూరకార్య మొకటొనరింప నీచిత్తమున నిచ్ఛవొడముచో శత్రువర్గము మిగుల బెగ్గిలవలయును. రెండు క్రూరకృత్యములు లోఁపర్చు తలంపు నీచిత్తమునఁ బొడముచో నెయ్యది క్రూరతరమో నీవు పలుపుదువని నేనెఱుంగుదును. ఔరంగజేబు ప్రతిహింసకంటె వానికరుణయే యధికభయంకర మెనని.—హా! ఇఁక నీయానతి

నొసంగుము.

ఔరంగ—కుమారా! కోపింపకుము.

సులేమాన్—కోపమేల? ఆహా! దురాత్ముండగు మానవుఁడిట్టి మృదుమధుర భాషణంబులెట్లుపలుకఁగలఁడో!

ఔరంగ—సులేమాన్! నిన్నుఁ బీడింప మేమిచ్చగించుటలేదు.—నీయభీష్ట మేమైననున్నఁ దెలుపుము. అనుగ్రహపురస్సరముగ దానిని దయసేయుదుము.

సులేమాన్—ఔరంగజేబూ! నాయభీష్టమీవు దీర్తువా? అట్లగుచో వినుము. నావాంఛ యొక్కటి గలదు. నీచిత్తమువచ్చిన తెఱంగున బీడింపుమనియే నేఁగోరుచుంటిని. దుర్మతీ! నాపితృహంతకుని కడనుండి లేశమాత్రపు కరుణనైన నేవాంఛింపను. దురాత్మా! నీ వెట్టి కార్యంబొనర్చితివో యొకమారు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. ఎవ్వఁడు నీకు సోదరుఁడో,-ఎవ్వనితో ఒకతల్లికడుపున నుద్భవించితో ఎవ్వనింగూడి ఒకతండ్రిచే ప్రణయార్ద్ర కటాక్షలాలితుండవైతివో ఎవ్వనిరక్తనాడులం దొకేరుధిరము ప్రవహించుచుండెనో,—ఎవ్వనికంటె నధికు లీపృథ్వీతలంబున నెవ్వరును లేరో,—ఎవ్వఁడు శైశవమందుఁ గ్రీడాసంగియో- యౌవనమం దెవ్వాఁడు నీప్రియసహపాఠియో-ఎవ్వనిపైఁ బఱపిన శాత్రవరోషకటాక్షము నిజవక్షమును నిర్ఘాతసన్నిభంబై వేధింపవలయునో,—ఎవ్వని పరునియాఘాతము నుండి రక్షింప నిజహృదయమును ముందుకు జాచవలయునో, ఎవ్వని వేడుకొనిన నీ ప్రకాండమహీతల రాజ్యమును ముష్టిమాత్ర ధూళివలె నీముఖమున నూదివైచి యుండునో- ఎవ్వఁడు నీకెన్నఁ డెట్టి యనిష్టము గావించియెరుఁగఁడో,—ఎవ్వని యేకమాత్రాపరాధము తానుసర్వజన ప్రియుండగుటయో- అట్టిసచ్చరిత్రు, నట్టిసు

మిట్టిపడుచు గట్టిడితనమున నీవు నీపొట్టింబెట్టుకొంటివి! దురాత్మా! పరలోక మందివారిని గాంచునో తలయెత్తి వారిముఖమును జూడసాహసింతువా? పిశాచమా! భూతమా! హింసాభయానకమా! అనుగ్రహపురస్సరముగ నేదియో నాకు దయసేతువా! శునకమా! నిన్నును నీయనుగ్రహంబును కూడ నేను కాలితో ద్రొక్కివైతును. రాక్షసా! బిడియంబున స్తబ్ధుండవుగాక "కుమారా" యని ప్రేమాతిశయంబు సూపుచుంటివేల?

ఔరంగ—మంచిది! నీపొగరెల్ల డంపవలయునో నేనెరుంగకపోలేదు! నీవిప్పుడనా చేతిలోఁ జచ్చెదవు. (సింహాసనము నందుండి దిగి) సులేమానూ! కాలమందిరము జేరకపూర్వ మొకమారల్లాను స్మరించుకొమ్ము!

(బాలక వేషధారిణియై జహరతునిసా వాయువేగమున
నిండోలగంబునఁ బ్రవేశించును.)

జహరత్—అరేదురాత్మా! ఔరంగజేబు! సులేమానునట్లుంచి నీవే యిప్పు డల్లాను స్మరించుకొమ్ము (కత్తి నెత్తి యౌరంగజేబుపై లంఘింప గమకించును.)

సులేమాన్—ఇదేమి! ఇదేమి!! సోదరీ!!! ఊరకుండు మూరకుండుము!!!

(సులేమాన్ సోదరీకరములఁ బట్టుకొనును)

జహరత్—వదలుము!—వదలుము!!—అన్నా!ఏల నన్నడ్డుపెట్టెదవు? ఈపాపాత్ముని శిరమును నాకరవాలమున కెరఁజేయుదును! నన్ను వీడుము!—వీడుము!!

సులేమాన్—చెల్లెలా! ఇదేమి చెడుకార్య మొనరింప గమకించుచుంటివి!—శాంతింపుము! శాంతింపుము!! హత్యకుఁ బ్రతిశోధము! హత్యగాదు. పాపమందుఁ బుణ్యప్రతిష్ఠ కాఁజాలదు. సాధ్యమగుచో నేనీ దుర్మతిని సమ్ముఖసంగ్రామమందే సంహరించివైతును! కాని

సోదరీ! హత్యమహాపాపము కాదా!

జహారత్—ఛీ! భీరులారా! బొమ్మలవలెఁజూచుచుంటిరా! కన్నవారి కడుపు జెడఁబుట్టితిరి! మీరలు నిజవంశంబుల దగ్ధమొనరింప నుద యించిన కులాంగారములు!—అన్నా! ఇకనీవుపొమ్ము! నన్నుఁ బ్రతిఘటింపకుము. పితృహంతకునకుఁదగుశాస్తిఁగావింపవలయును! వానిని జంపకున్న నేనిలువనేరను! వీడుము! వీడుము!!—అరే! యుద్ధనిపుణుఁడా! దుష్టచోరుఁడా!! మనుష్యఘాతుకా!!!—(సోద రుని విదళించుకొన యత్నించి చివాలున నేలపైఁగూలి మూర్ఛిల్లును.)

ఔరంగ—(సులేమాను నుద్దేశించి)—నీమహౌదార్యము నన్నక్కజ పడఁజేసినది. నిన్నువధింపనే నిచ్ఛగింపను!-సయస్త్ఖాన్!-నీవీతనిఁ గొంపోయి గ్వాలియరుదుర్గమందు బంధించి వేయుము. దారా కన్యను నాజనకుని నికటమున నాగ్రాప్రాసాద దుర్గమందు బం ధింపుము.

ద్వి తీ య దృ శ్య ము

ఆరకానుప్రభు భవనము—రాత్రికాలము.

సుజా, పియూరాలు ప్రసంగించుచుందురు.

సుజా—విధిమనలఁ దుదకీ యారకాను ప్రభువు నాశ్రయమందుఁ బడ వైచునని యే రెఱుంగుదురు!

పియూరా—మరల నీప్రదేశమునుండి యేప్రదేశంబునకడిగొంపోవునో యే రెఱుంగుదురు!

సుజా—ఈవన్యనృపుఁ డేమిచాటెనో యెఱుంగుదువా?

పియూరా—యేమి చాటెను!గొప్పదియగు విశేషమొకటి ప్రకటించి యుండుట నిక్కువమని దోచుచున్నది. అదేమో వేగఁదెలుపుఁడు.

వినాట్లకై తడఁబడిపోవుచుంటిని. చెప్పుఁడు! చెప్పుఁడు!!

సుజా——నేనీ నలువది యాశ్వికులఁ దోడ్కొని యర్థాను నీమ స్వాధీనపఱచుకొన నరుదెంచితినని యూషలువలేని దోషమునాపై నారోపించెను.

పియూరా——నలువదిమందితో నా కార్యమొనరించుట యక్క జమా!— భక్తియారుఖిల్జి పదునేడ్గురాశ్వికుల సాయంబునే వంగభూమి యందు విజయధ్వజము నెలకొల్పెనని వింటిని.

సుజా——అసంభవ మసంభవము! అట్లు విద్వేషు లెవరో ప్రకటించి యుందురు. ఆ కార్యము విశ్వాసనీయముకాదు.

పియూరా——మీరు విశ్వసింపక పోయినందువలన నష్టమేమి?

సుజా——నతీ! ఈ అడవిరేఁడేమి యాజ్ఞనొసంగెనో యెఱుంగుదువా? రేపటి ప్రభాతమందే ఇచ్చటినుండి వెడలిపొండని మనకాజ్ఞనొసఁగెను.

పియూరా——ఒకమంచి పీలైనచోట మనలనుంచుటకే యతఁడట్టి యాజ్ఞనిచ్చి యుండును. అతడు మన శ్రేయోభిలాషి యనియే దలఁచెదను!

సుజా——ఏమతిమైననీవొకమారు కలిన ఘటనారాజ్యమందడుగిడఁజాల కుంటివేమి! ఈయసమయమునఁగూడ బరిహాసము నలుపవలయునా!

పియూరా——అయో! త్వరపడితిని. ఈసమయమునపరిహాసమనవసరము కాఁబోలు! ఇట్లనిముందే జెప్పుకొనరా!—పోనిండు జరగినదేదో జరిగినది. ఇప్పుడుగంభీరముగనే యుంటిని! చూచికొండు.

సుజా——మంచిది! గంభీరమైవినుము. మఱొకవిషయమును నీకుఁదెల్పెద. దానినివినినచో నీకనులనుండినిప్పులురాలును. క్రోధముచేనీకంఠము రుద్ధమైపోవును! నీరక్తనాళములందు అగ్నిద్రావకము ప్రవహించును!

పియూరా——ఓయినాయనో!!!

సుజా—ఇకఁజెప్పెదవినుము—ఆయుపకారమునకు బదులుగ నీమరా త్మఁడేమి వాంచించుచుండెనోయెఱంగుదువా!—ఆపాపి నీహాంద న పేక్షించుచున్నాఁడు!—సర్వదైవహాతి వేమి!—నలువుము- పరిహాస మునలుపుము—

పియూరా—మంచిది! మంచిది!! మనమింక నీతనికతివినయంబున భక్తి శ్రద్ధలఁజూపవలయును- ఈజెట్టి సర్వంబెఱింగిన సద్గుణమూర్తి! మా నవచరితంబెఱింగిన మాన్యశాలి! వనితలఁబ్రోచెడి వరప్రసాది! నడ వడియెఱింగిననరోత్తముఁడు!మహాత్వ మెఱింగిన మహాత్ముండు! పావన—

సుజా—ఊరకుండుము. నాకుపిచ్చియెత్తుచున్నది. ఇది నీ యెడఁబరి హాసముకావచ్చును; కాని మర్మశల్యమైన నన్నది వేధించుచుం డెను—రమణీ! నీవునాకే మగుదువో యెఱుంగుదువా!

పియూరా—భార్యను!

సుజా—ఒకభార్యవే కావు! నీవు నా రాజ్యంబవు! నా సంపదవు! సర్వ స్వంబవు!—ఇహకాలమవు! పరకాలమవు! రాజ్యమును గోల్పో యినను ఇంతదనుక గష్టమేమియో నేనెఱుంగను—కాని. యిప్పు డు నా కట్టి కష్టము దోచుచున్నది!

పియూరా—ఏల! ఏల!! ఏల!!!

సుజా—ఏది నాకడ జీవన మరణవిషయంబో దాని గురించి నీవు పరి హాస మొనరించుచుంటివి.

పియూరా—బాగుబాగు! మీరంతదూరము పోవుచుంటిరేల!—ద్వి తీయపరిణయము గావించుకొను వ్యక్తులనేకు లుందురు. కాని ఇట్లి వరును ఖిన్నులు గాఁజాలరు.

సుజా—సతీ! గ్రహించితిని! నీవుముఖమున మాత్రము పరిహాస మొన రించుచుంటివి. కాని నీ యంతరాళంబు దుఃఖముచే బ్రద్దలగు

చున్నది. సింహాసనమున మృషా మందహాస మచులు దోచుచున్నను నీ నేత్రము లశ్రుపూరితంబులాయెను!—

పియారా—కనుఁగొంటిరా!— నా కన్నులందు నీరేది చూడుఁడు. (నయనముల దుడుచుకొని) ఇప్పు డశ్రు సలిలము జూపుఁడు.

సుజా—ఇపు డేమిచేయవలయునో తెలుపుము.

పియారా—ఇపు డేమిచేయవలయునో తెలుపుడు.

సుజా—నీవే యెఱింగింపుము.

పియారా—ఇంక నాలస్య మాచరింపక న న్నాపలపు కానికి విక్రయించెదరా?

సుజా—నన్ను నీవు ప్రేమించుచో నిట్టి పరిహాసమును కట్టిపెట్టి నే జెప్పునదేమియో వినుము. ఇపు డేమి నేయఁదలఁచుచుంటినో గ్రహింపఁగలిగితివా?

పియారా—లేదు.

సుజా—(కొండొకవడి యోచించి) ఏమి కావింపవలయునో నాకుఁ గూడ దోచుటలేదు.—ఔరంగజీబు కడ కేగుదమా?—వలదు. దానికంటె మృత్యువేయుత్తమము. ఏమందువు? యూరకుంటివేల?

పియారా—ఆలోచించుచుంటిని.

సుజా—మంచి దాలోచింపుము.

పియారా—(కొంచెము సేపాలోచించి) కాని కొడుకును కూఁతురున—

సుజా—అవును. కన్నబిడ్డల నేమిగావింతుము?

పియారా—ప్రియా! నా కేయుపాయము తోచుటలేదు.

సుజా—నేనేమి సలుఁప దలంచుచుంటినో యెఱుఁగుదువా?

పియారా—ఎట్టులుంగను—

సుజా—ఏమియుఁ దోచుటలేదు. ఆత్మహత్య నిచ్ఛగించుచుంటిని— కాని, నిన్ను వీడఁజాలను—

పియారా—ఒంటిగ గష్టపడకుండుటకై నేఁగూడ నా కార్యమే గావింతును.

సుజా—జీవనమందువోలె మరణమందు గూడ నీవు నాకు సహచారిణి వగుచో, సుఖంబుగ మేను వీడఁగలను.—కాని నాకొఱకై నీవు నీయసువులనేలఁ గోల్పోవలయును?

పియారా—కోల్పోయిన నేమి? ప్రత్యూషమున వెడలఁగొట్టఁబడకమున్నే మీరు యుద్ధమునకు సంసిద్ధులై యుండుఁడు. ఈనలుబదియాశ్వికులమాత్రమే దోడ్కొని యీవన్య రాజ్యము నాక్రమించుడు. అట్లొనరించి కండకావరమున మిట్టిపడు నీచమాఘునిసంహరించి వీరునివలె తమరు వీరస్వర్గము జేరుఁడు. నీపక్కననిలువంబడి నేనుగూడ మిమ్ముఁగూడి పరలోకమహాయాత్ర గావింతును. ఇఁక బిడ్డల విషయమందురా!—వారలు తమమానరక్షణము తామే కావించుకొనఁజాలకపోరు—మీయుద్దేశమేమి?

సుజా—మంచిది!—కాని అట్లొనరించినందువలనఁ బ్రయోజనమేమి?

పియారా—అంతకన్న వేరుపాయ మికేమికలదు. మీరొక్కరు మాత్రము స్వర్గముచేరిన నన్నీలోకమందు రక్షించువారెవరు!—ఇంతదనుక శూరుని మాడ్కి తాము జీవించితిరి. దానంజేసి, ఈయవని యేలిక నీచప్రస్తావనకుఁదగు ప్రతిఫలంబు వానికొసఁగి పిమ్మట నాకము నేరుదాము.

సుజా—మంచిదట్లే యాచరింతును. రేపు మనమిర్వురము కలిసి నిలువంబడి యొక్కముహూర్తమందే యసువులఁద్యజింతము.—అర్ధాంగీ! మనయిహజీవన సంయోగశేషరాత్రియిదియే; ఇంతదనుక నీ ప్రేమానందమధురవచనమందహాసస్వాదు గానములచే నన్నాహ్లాదపయోధితరంగంబులఁ దేలియాడించుచుంటివో యాకడసారిరాత్రిగూడ దానిలో నన్నలరింపుము.—ఆలసింపక నీ విపంచికఁ

గొనివచ్చి నీగానమహిమంబునే స్వర్గమును మర్త్యలోకమున
నవతరింపఁ జేయుము. నీవీణాఝంకారమును నభోమండలమున
వ్యాపింపఁ జేయుము నీవిహాగమగాన సౌందర్యస్ఫూర్తులచే నీతమం
బునందుమిరుమిట్లు గొలుపఁ జేయుము. నీపవిత్రపత్నీప్రణయంబున
నన్ను నింపివేయుము. నీవింజేయుందుము. నేనిప్పుడవోయి ప్రాతః
కాలమున సంగరమునకు సంసిద్ధులకండని మన యాశ్రితుల కొన
తిచ్చి వచ్చెద. పదపదడి నేఁటినిశీథమున దాంపత్యసుఖాంబుధి మగ్న
మానసులమై మనగృహమునుండి విదురను వెడలఁ గొట్టి
వేయుదము!

[నిష్క్రమించును.]

పియారా—మంచిది! మృత్యువే యాసన్నమౌగాక! ఎందు,
నవైవాహిక కాశలు శేషించునో,—ఎయ్యది సుఖదుఃఖ సమాధి
యో—ఆమృత్యువాసన్నమగు గాక!—ఏగాఢ నిద్ర యిహ
లోకమున జాగరణ మెఱుంగదో—ఏయంధకారమున కేమర్త్య
లోకమునఁ బ్రభాతంబు లేదో,—ఏ స్తబ్ధత యీజగంబున భం
గము కాఁజాలదో—ఆమృత్యువాసన్నమగుగాక!—వెఱపేల!—
ఎపుడో యొక్కప్పు డది యాసన్నమౌట నిక్కమము. దానం
జేసి వేగమే దానిఁ జేయు టుత్తమము!—ఆరిపో నున్న దీపపు
మంటవలె మహాంధకారపటలము దీయూపను ప్రజ్వలించుగాక!—
ఈగానమధుస్వనము నభంబును జేరి, నక్షత్రరాజ్యమును గొల్ల
గొనుగాక! నేటిసుఖము విపత్తువలె గంపించుగాక!—నేటి యూ
నందము శోకము భాతి మొఱలిడునుగాక!—జీవనమంతయు
నేఁడొక సుఖచుంబన మందంతరించుగాక!—నేఁడు మా శేషస
మ్మేళన నిశీథము! నేఁడు మాయుత్సవయోగ విభావరి!!

(నిష్క్రమించును.)

## తృతీయదృశ్యము

ఆగ్రాదుర్గము లోపలి కారాగారము—గభీరనిశీథము.

వెలుపలవాన, మెఱుపులు, పిడుగులు భయమును గొల్పుచుండును.

షాజహాన్ జహారత్తునిస్సాలుండుదురు.

షాజహాన్—దారాను హత్యఁ గావింపనేరి తరము? సామ్రాట్టునగు నే నే స్వయముగ నాతనయుని చుట్టును గస్తి దిరుగుచుంటిని!— ఎవరి శక్యము! ఎవరి తరము!—అరే ఔరంగజీబు! తుచ్ఛా! తులువా! దుర్మతీ! కనులెఱ్ఱఁజేసినంత నీవు మహాభయంబునఁ గంపించిపోదువు!—భీషణ ఝంఝామారుతమా! రమ్ము—పుట్టుము—అదిగో!—ప్రచండ ధ్వానమునల్పుచు ఝంఝానిలముత్పన్నమగుచున్నది.! ఘోరాశనీ! నభంబునుండి గుభాలున బృథ్విపైఁబడుము—అదిగో! అదిగో!! భీషణనిర్ఘోషము నల్పుచు మహానిర్ఘాతము జగంబుపైఁబడుచున్నది! మేఘములారా గర్జింపుఁడు.—అదిగో! ఘోరకరాళ సహస్రారావసన్నిభంబులై జలధర గర్జితములు వినంబడుచున్నవి!

(మేఘగర్జనము)

A great English critic remarks that the tornado raging in the mind of Lear is represented by the terrific and Stormy broil prevaling in the atmosphere. The same critique can be applied to Shajahan. A similar instance we find in one of the famous novels of the illustrious Bankimchandra.—The novelist, while delineating in his inimitable way the wounded feelings of the disgruntled Ayaśi, whose love-overtures were unceremoniously brushed aside by the redoubtable Rajaput Prince, says that in her front the deep swells with the disturbed foamy waves. So it is the wont of master-writers to depict Nature as if she echoes human feelings and acts accordingly :—

జహారత్—ఓః!—ఏమి యీభయంకరఘోషము! ఏమి యీ

ఇఁక నొక యడుగైన ముందుకు రాకుము.

జహారత్—దాదాజీ! రాత్రి గభీరమై యున్నది! శయనింతురుగాని రండు!

(జాహానారా ప్రవేశించును.)

జాహానారా—ఏమి యీ కరుణాదృశ్యము! తండ్రిలేని బాలిక హత పుత్రుఁడగు వృద్ధునకు సాంత్వన మొసఁగుచున్నది కాని, ధూళి ధూసరిత తనూలతగల నీ బాలిక హృదయాంతరాళమునందు, భుగుల్భుగుల్మని యొక యగ్నిజ్వాల ప్రజ్వలిత మగుచున్నది. ఏమి కరుణ! ఔరంగజేబూ! ఒకసారు చూచి పొమ్ము! నీ మహా త్కార్యము నొక పర్యాయము చూచి పొమ్ము!

జహారత్—అత్తా! నీవు లేచి వచ్చితివేమి!

జాహానారా—మేఘగర్జనచే నిద్రాభంగ మాయెను. దాదాజీ మరల నట్లే ప్రేలుచుండెనా?

జహారత్—అవునత్తా!

జాహానారా—ఔషధ మిచ్చితివా?

జహారత్—ఇచ్చితిని. కాని యీ పర్యాయము జ్ఞానము వచ్చుట కేల యాలస్య మగుచుండెనో తెలియకున్నది.

షాజహాన్—ఎవరు గావించిరి?—ఎవరు గావించిరి!

జహారత్—ఏమి దాదాజీ!

షాజహాన్—వధించెనా! వధించెనా!! అదిగో రక్తము వేగముగ స్రవించుచున్నది! ఓహోహో! గృహ మంతయు రుధిర ప్రవాహముచే నిండిపోయెను! ఏది! ఏది!! [ముందుకుఁ బర్వెత్తి] ఓః! ఇది యింక నష్టముగనే యున్నది! ఆహా! ఇందుండి ధూమ మెట్లుత్పన్న మగుచున్నదో!

జాహానారా—జనకా! ఇంత రాత్రి యైనను, తాము పరుండలేదేమి?

షాజహాన్—ఔరంగజేబూ! నన్ను చూచి నవ్వుచుంటివా! నవ్వుము, నవ్వుము!—అహో! ఏమి [illegible] బెట్టితివి! అరే! దుర్మతీ! నీకుఁ దగు శాస్తి చేసెదను! ఘాతుకా! నిలువుము! కరముల జోడించి నిలువఁబడుము! ఏమి! క్షమాభిక్ష వేఁడుచుంటివా? క్షమా! క్షమ నీకా! నా పుత్రుఁడవని నిన్ను మన్నింతు నని కోరుచుంటివా? ఛీ! హంతకా! నిన్నెట్లు మన్నింతును! నిన్నుఁ దుషానలమందు దగ్ధ మొనరింప నే నిప్పుడ యాజ్ఞ నొసఁగుచుంటిని! అరే! భృత్యులారా! తీసుకొని పొండు! జాలిఁ దలఁపకుఁడు!

జహానారా—జనకా! శయనింతురుగాని రండు.

షాజహాన్—ఏమి! ఏమి నీ యనురోధము! వాని పక్షము జేరి నీ వాతనికొఱకై క్షమాభిక్ష వేఁడుచుంటివా! నేను మన్నించు వాఁడను కాను. విచారణచేసితిని. వాఁడు మనబహిఃప్రాణమగు దారాను వధించెను.

జహానారా—జనకా! వధింపలేదు. శయనింతురుగాని రండు!

షాజహాన్—వధింపలేదా! వధింపలేదా! నిక్కమే! వధింపలేదా! అట్లైన నే నిపుడు జూచిన దేమి! స్వప్నమా?

జహానారా—అవును పితా! మీరు స్వప్నమునే వీక్షించితిరి.

షాజహాన్—అట్లయిన సంతసమే! కాని, అమ్మా! ఆహా! ఏమి దుస్స్వప్న మేమి దుస్స్వప్నము! అది నిక్కమే యగుచో! ఏమి! జహారత్! విషాదవేదనాదోదూయమానమానసవై యిట్లుంటి వేమి! అయ్యో! విలపించుచుంటివేమి తల్లీ! అట్లగుచో నిది స్వప్నము కాదు!—ఓ—హో!—హో!!—హో!!! హో!!!!

(మేఘ గర్జనము)

జహారత్—ఏమి! యీ భయంకర ఘోషము! నేటి రాత్రియే పృథివి

యొక్క యంతిమనిశీథమా! అన్నియు నెగిరిపోవుచున్నవా!
సలిలానలానిలాకాశ మృత్తిక లన్నియు విజృంభించిపోయినవా!
ఊః! ఏమి భయానకనిశీథి!!

షాజహాన్—అమ్మా! ఇవేమి నినదములు!

జాహానారా—తండ్రీ! రాత్రిగభీరమైయున్నది! ఇంక శయనింపుఁడు. మీ రున్మత్తులు గాకుఁడు.

షాజహాన్—అమ్మా! నే నున్మాదిని గాను! గ్రహించితిని!—గ్రహించితిని! తల్లీ! కర్ణపుటముల భేదించు నీఘోరఘోషంబులేమి?

జాహానారా—వెలుపల నొకప్రళయంబు జరుగుచున్నది! జనకా! వినుఁడివిగో! వారిదగర్జితము! వృష్టిశబ్దంబు! వాయుహుంకారము! మాటిమాటికి వజ్రధ్వని!—ఆహా!—ఏమియీకల్పాంతవహ్నిసన్నిభానల్పదావపావకము! నభోభాగమునుండి వర్షము జలపాతమువలె నేలఁబడుచున్నది. ఏనుఁగుతొండమువంటియీజలధారలను బంధురానిలము పృథ్వీముఖమునఁ జిమ్మివేయుచున్నది.

షాజహాన్—పలువలారా! కానిండు! మీయిష్టానుసారముగఁ గానిండు! కానిండు! కానిండు! పృథ్వీకాంత నీరవయై—నిస్తబ్ధయై సర్వమును సహించును! ఏలమీకామె జన్మమొసఁగె! మిమ్మామె తనవక్షస్థలమునఁ జేర్చి పెంచి పెద్దవారింగావించెను! మీరలిపుడు వయోవాహినియందుఁ జాలదూరము సాగిపోతిరి. ఆజనయిత్రి నిఁకేల లత్యాపెట్టెదరు! నిజకర్మఫలమామె నిక్కముగ ననుభవింపవలయును! పలువలారా! కానిండు! ఆమె యేమి కావింపఁగలదో చూతము! రాసులురాసులుగ గైరికజ్వాలాపరంపరల వెడలఁగ్రక్కఁగలదు! అట్లే కావింపనిండు! ఆ గైరికజ్వాల లాకసమునంటి ద్విగుణీకృతవేగమున నామెముఖముననే మరలఁదాకును. ఆమె సముద్రతరంగములఁ గ్రోధఘూర్ణితములఁ గావించి పెల్లుప్పొంగఁజేసి భయంకర

బులఁబెకలించి వేయుచు, నధ్వగ్రవాతమును దండవ్యామానంబు-
గావించు నశనిపరంపరలయొకుట వక్షమును బ్రసరింపఁజేసి నిలువ
వాంఛించు చుంటిని! నాహృదయకుహరాంతరమందలి యాత్మను
వెలికూడఁబెఱికి దాని నీశ్వరునకుఁ జూపవాంఛించు చుంటిని!
ఇదిగో!—మరల గర్జనలు వినంబడుచున్నవి! మేఘములారా! ఏల
నిష్ఫలముగ గర్జించు చుంటిరి! మీయాఘాత పరంపరలచే నీవసు
మతీకాంతవక్షమును దుత్తునియలు గావించి వేయుఁడు!—జీమూ
తపటలమా! ఏల ఘనీభవించు చుంటివి! వియత్తలమున సంచరించు
చంద్రతారార్కులను దిగమ్రింగి నీగభీరోదరాభ్యంతరమందుఁ
బడవైచుకొనుము!—ఏమి యీయుభీలనిర్ఘోషము! ఏమియీ—
హో! హో!! హో!!!

[జలధర గర్జనము]

జహానారా—ఇవిగో!—మరలవినంబడుచున్నవి! మువ్వురొకచోట
నుండి—ఓః!—ఏమినిశీధమేమి నిశీధము!

[The out bursts of the distracted Shajahan's exasperated feelings savour of the curses of Lear and Timon on life and man. The Niagara of anathemas which Shajahan showers upon the world constrain us to believe that to him it appeared as the mother of evil and ingratitude and that it should therefore (to borrow an expression from *King Lear*) 'wearout to nought'.

Shajahan's words further remind us of the famous lines we find in Shakespeare's "*The Tempest*"

the great globe itself
Yea, all which it inherit shall dissolve
And, like this insubstantial pageant faded,
Leave not a rack behind.

The recollection of incurable and gross evil in the 'moster' provokes in Prospero a passion of ire and subsequently that

mystical and mealonchoiy thought that the world must perish completely. The same idea we find in the magnificent speeches of Shajahan who was beside himself with incalculable grief and ineffable indignation and (to quote an expression from *Hamlet*,

whose brains still beating puts him thus
From fashion of himself.

A very remarkable versimilitude can be found between the last speech of Shajahan and Lear's appeal:

And thou. all shaking thunder,
Smite flat the thick rotundity O'the world!
Crack nature's moulds. all germens spill at once,
That makes ingrateful man!

The reader would further Perceive that one of Shajahan's distracted ejaculations bears a singular similarity with a line in the great speech on 'degree' in Troilus and Cressida!

Each thing meets
In mere oppugnancy: the bounded waters
Should lift their bosoms higher than the shores
And make a sop of all this solid globe.

Further, the mad Shajahan tearing off his silver hair put us in the thought of the distracted Lear who tears off his clothes and who 'shifts himself into a mad-man's rags: to assume a semblance that Very dogs disdained!' The curses of Shajahan, to boot. remind us Lear s ravings;

Oh heavens,
"Rumble thy bellyful! Spit! fire! spout! Rain!
You nimble lightnings dart your blinding flames
Into her (put 'his' in Shajahan's speech) sconful eyes!
Infect her beauty,
You fen-suck'd fogs drawn by the powerful sun,
To fall and blast her pride."

Fear of lengthiness precludes me from quoting some more similar passages]

## చతుర్థదృశ్యము.

గ్వాలియరు దుర్గము—ప్రభాతకాలము.

సులేమాను, మహమ్మదులు ప్రసంగించుచుందురు.

సులేమాన్—సోదరా! విచారణయందుంబిన తండ్రిగారికింగూడ మరణశిక్ష విధింపఁబడుట వింటివా?

మహమ్మద్—అన్నా! విచారణమనకు. విచారణయనఁబడు నవిచారణయనుము. శేషించిన యీయొక్కఁడు నేడంతమొందును!

సులేమాన్—తమ్ముఁడా! నీమామగారెట్లు మరణించిరి.

మహమ్మద్—ఎట్లుమరణించెనో నేనింకను నిశ్చయముగ నెఱుఁగఁజాలనైతి. పత్నీసహితుఁడై గభీరజలంబునఁ బడెనని కొందఱును జామాతాసమేతముగా యుద్ధమునందు మడిసెనని మఱికొందఱును వచించుచుండిరి. అతని బిడ్డలాత్మహత్యఁ గావించుకొనిరి.

సులేమాన్—అట్లయిన నతని వంశవృక్షము మిన్నక నిర్మూలమై పోయెనా?

మహమ్మద్—(నిట్టూర్పువిడచి) అవును!

సులేమాన్—ఈదుఃఖవార్త నీసతి యెఱింగెనా?

మహమ్మద్—ఎఱుంగును. చాలంజేసియే కడచినరేయి కన్నుమూయక తల్లిదండ్రులకై యన్నచెల్లెండ్రకై మిగులఁ బరితాపంబునఁ బొక్కెను.

సులేమాన్—సోదరా! నీవీదుర్భరదుఃఖమును సహింపఁ గలుగుచుంటివా?

మహమ్మద్—అన్నా! నీవుమాత్రము సుఖం బనుభవించుచుంటివా! తల్లిదండ్రులఁ గాంచ బయలువెడలి, వారల వీక్షింపఁజాలక యిహలోకమందు వారల విలోకించు భాగ్యము గోల్పోయి పలుబాములఁబడి యిచటఁబడి యుంటివి కాదా!

సులేమాన్—చూడుమతఁడు నిమీలితనేత్రుఁడై కన్నీటి నాపుకొన నెట్లు ప్రయత్నించుచున్నాడో, దుస్సహదుఃఖంబుకతె నహాహాకారం బొనర్ప నిచ్ఛగించుచు మాటరామి, గాఢమగు హృదయావేదనమున నతఁడు మిగులఁ బొగులుచున్నట్లు దోఁచుచున్నది!— బాలకా! సిపార్! తమ్ముఁడా!

(సిపారోకమూలు సులేమాన్ను వీక్షించి పిడపవెడలిపోవును)

మహమ్మద్—అన్నా!

సులేమాన్—ఏమి తమ్ముఁడా!

మహమ్మద్—కృపాపురస్సరముగ నన్ను మన్నింపుము.

సులేమాన్—మన్నించుటెందులకు! నీ కోప మేమి?

మహమ్మదు—అన్నా! దుర్భర పాపభారమును జనకుఁ డొక్కఁడు సహింపఁజాలకుండెను. దానంజేసి యాభారమం దర్ధభాగమును నేను నాతలపై నిడుకొంటిని. నేను ఘోరతరపాపిని. నన్ను మన్నింపుము. (మోకరించును)

సులేమాన్—సోదరా! మహానుదారవీరా! లెమ్ము! నిన్ను నేను మన్నింపనా!—నీవు వహించుభారమును స్వేచ్ఛగా ధర్మార్థము సహించుచుంటివి. పుణ్యాత్ముండవు. నేనే హతభాగ్యుండను.

మహమ్మద్—సోదరా! నాయందు నీకెట్టి విద్వేషము లేదనివచించి "అనుజా" యని నన్నాలింగన మాచరించుకొమ్ము.

సులేమాన్—అనుజా! ప్రాణతుల్యా! ఒకమాఱు మన మిర్వురము నీవనిసచందమునఁ బరస్పరాలింగన మాచరించుకొందము-రమ్ము

(ఆలింగనము)

మహమ్మద్—అన్నా! చూడుము. ఆహంతకులు హత్యాకార్యతత్పరులై మనపినతండ్రిగారిని వధ్యభూమికిఁ గొంపోవుచున్నారు!

(సులేమానాదికుల్లనకు దృక్కులసారించును— సేవకులతో

(పట్టుకొనఁబడు మురాదు నేత్రుఁడై ప్రవేశించును.)

మురాదు—(ఉచ్ఛ్వాసముతో)—అల్లా! నా పాపములకుఁ దగుదండనము నేననుభవించుచుంటిని. అందునకై నేఁ జరితపించను. కాని ఔరంగజేబు మాత్ర మేల దాటిపోవలయును?

(నేపథ్యమున)—ఎవఁడును దాటిపోఁజాలఁడు! పాపభారము క్రుంగక మానదు!

సులేమాన్—అది యెవ్వరిస్వరము?

మహమ్మద్—నా భార్యస్వరము!

నేపథ్యమున—ఆ దురాత్మునిఁ జంప సంసిద్ధమైయున్న దండనము నీశిక్షకంటె సహస్రగుణము లధికభీషణమై యుండును—అతఁడు తప్పించుకొని పలాయన మొనరింపఁజాలఁడు! అది నిక్కువము!

మురాదు—(సోల్లాసమున) వానికిఁగూడఁ దగుశాస్తి యానున్నమగునా? అట్లయిన నికనన్ను వధ్యభూమికిఁ గొనిపొండు! ఇఁకఁ జింత లేదు!—

(రాజభృత్యపరివృతుఁడై మురాదు వెడలిపోవును).

సులేమాన్—సోదరా! ఇదేమి! నీస్థిరదృష్టుల నాదిక్కున కేలసారించుచుంటివి? నీవేమివిలోకించుచుంటివి?

మహమ్మద్—నరకము! ఇదిగాక మరొండు నరకమున్నదా? ఈశ్వరా! అదెట్టిది?

## పంచమదృశ్యము

ఔరంగజేబు బహిర్మందిరము—రాత్రి రెండుజాముల వేళ ఔరంగజేబేకాకియై యుండును.

ఔరంగ—ఏమికావించితినో—ధర్మార్థమై కావించితిని! అన్యోపాయమే యున్నచో!—(వెలుపలికిఁజూచి) ఆహా! ఏమి యీగాఢాంధకారము!—ఈ కార్యములకు కర్తయెవరు!—నేనే!—ఇది

వ్యామోహాంధకారముల పిశాచాంగనా —ఆహా! ఈ భీషణశబ్దము! అవు నది వాయుఘోషణము! —ఇదేమి! — ఎట్టులైన నీచింతను చిత్తమునుండి దూరము నరింపఁ జాలకుంటిని. నిశీథమునఁ కనికిపాటులేగాని నిదురింపఁ జాలకుంటిని

['Uneasy lies the head that wears a crown'. So says Henry IV in his soliloquy when he was expatriated from the realms of sleep and obsessed by agonising thoughts.]

(దీర్ఘనిశ్వాసము) ఓః! ఏమి యీ నిశ్శబ్దము! ఎంత నిశ్శబ్ద మేల! [పచారిచేయుచు, చిరాకున నిలువఁబడును] అదేమి! అదేమి!! అది దారా ఛిన్నమస్తకము కాదా! అవునదియే! అదిగో సుజా రక్తాక్తశరీర మెంత భీషణమై యున్నదో!—ఏమి! అది మురాదు కబంధమా!—హాం! ఇందేల వచ్చితిరి!—నేను విశ్వసింపను!—అదిగో! వారలు నన్ను బిలుచుచుండిరి! సమీపించిరి! నన్నుఁ జుట్టివైచి వారలు నృత్యము సల్పుచున్నారు! మీరలెవరు? జ్యోతిర్మయములు ధూమశిఖమాల్య జాగ్రత్తంద్రావస్థల యం దరుదెంచి, నాకు వెఱపుఁగలుగఁ జేయుచుంటిరేల! పొండు! అదిగో! మురాదు మొండెము చేసన్న చేయుచున్నది!—దారా మొండెము నాపైఁ దీక్ష్ణదృక్కులఁ బఱపుచున్నది!—సుజా! నవ్వుచుంటివా!—ఏమేమి?—ఓః!—[నేత్రముల మూసుకొని] పోనిమ్ము!—జరిగిపోయెను!—ఆహా! నాశరీరమున రక్తస్రోతమతి వేగమునఁ బ్రవహించుచున్నది! శిరంబుపై నేమి యీ మహాశైల భారము!!

[The psychology of Aurangzeb bears a very remarkable similarity with that of all the villains (excepting of course Iago) of the Prince of English poets. Diverse instances can be quoted from Shakespeare; but space forbids any endeavour in that direction. The reader is, however, requested to see *Act 5, Sec 3. Richard III* where he will find that, like Aurangzeb, Gloucester, suffering from the excruciating writhings of a

దిశ భగ్నధ్వని హృదయాభ్యంతరమందు ప్రతిధ్వనించుచున్నది.—
ఇప్పుడీఁక ప్రాయశ్చిత్తము సలుపుఁడు.

ఔరంగ—నీవిచటనుండి వెడలిపొమ్మ! ఈ యౌరంగజీబు కుపదేశ మొసఁగుట కీవెవండవు?

దిల్దా—ఔరంగజీబూ! ఔరంగజీబు కుపదేశ మొసంగుటకే నెవండ నందువా? ఔరంగజీబు కుపదేశ మొసఁగువాఁడు మీర్జామహమ్మద్ నియామత్ఖాను!—

ఔరంగ.—(అబ్బురమున)—నియామత్ఖానుహాజీయా! ఆసియాఖండ మహాసుధీవరుండగు నియామత్ఖానా!

దిల్దార్—అవును! ఔరంగజీబూ! నే నానియామత్ఖానుండను! రాజనైతికాభిజ్ఞతకై యరుదెంచి, ఘటనావశమున నీ పారివారిక విగ్రహావర్తమధ్యమునందుఁ బడిపోతిని! అయ్యభిజ్ఞతకై, జఘన్య విదూషక వేషముఁ దాల్చి యొక మూర్ఖలోక సామాన్య చాతురియందు గూడఁ గాలిడితిని. కాని యే యభిజ్ఞతఁ గొని, నేఁ డిందుండి వెడలుచుంటినో, దానినిఁ గొనకపోవుటచే కరంబుత్తమమై యుండెడిదని తలఁచుచుంటిని!—మొగల్ పాదుషా రూకలకై నే నిన్నిదినములనుండి నీకు దాసత్వము సలుపుచుంటినని నీవు దలఁచితివి! ఐశ్వర్య మస్తకమునఁ బదాఘాత మొనరింపఁగల శక్తిని విద్య యింకను కోల్పోవలేదు. మొగల్ పాదుషా! నేనిఁక బోవుచున్నాను.

[The idea that Education is superior to wealth is expressed by Shakespeare thus :—

Wisdom and fortune combating together
If that the former dare but what it can,
No chance may shake it. (Ant. and Cleop)]

(నిష్క్రమింపఁబోవును.)

ఔరంగ—మహాత్మా!—

త్సుకా భీలశాస్త్రూల లోబపృష్ఠుల కంటించు నరాధముఁడెట్లు దరహాసచంద్రికా విభాసితేక్షణ ఖభశ్రీహసుఁడై, సుధాసంకాశ స్వాదుసంభాషణ విశారదుఁడై, జితేంద్రియుఁడగు కరమహాసశిఖా మణివలె ముకుళితహస్తుఁడై, జగద్రక్షకుని సాన్నిధ్యమునం దెట్లు నిలువఁగలఁడో యనితలఁచి విస్మయమునస్తబ్ధనై పోవుచుంటిని.

జహారత్—నిజజనకుఁ గారాబద్ధుఁ గావించి, పితృసమడైన సోదరు నొక్కనిఁ బుత్త్రిని జాలు జేసి, యతఁడెట్లు రాజకార్యనిర్వాహణార్థము తండ్రి యుపదేశము కొరకై, తాను గావించిన దుష్కార్యములకుమన్నన వేఁడుచు బ్రహ్మజ్ఞానసంభ్రమమునం దేలపడఁ బ్రవర్తిల్లఁ గలుగుచుండెనో యని తలఁచి నేనెంతయో యబ్బురపడుచుంటిని!
—అదుగో పితామహులిటు వచ్చుచున్నారు

(షాజహాన్ ప్రవేశించును)

షాజహాన్—ఏమద్భుతో చూడండీ! ఎట్టి వేషము వైచిత్రివో చూడండీ! ఈరత్నముల నన్నిఁటిని నౌరంగజేబు హరింపఁజాల కుండుటకై వానినలంకరించుకొని దిరుగుచుంటిని. నేనిప్పు డెట్లుంటిని! (జహారత్ నుద్దేశించి) ఏమేపిల్లా! ఇప్పుడు నన్ను పెండ్లిగావించుకొన వలెననువాంఛ నీకు గలుగుచుండుట లేదా!

జహారత్—మరల జ్ఞానరహితులైపోయిరి! నానాటికి నానాటికి జంద్రుని గప్పి, వెడలిచను శారదకాదంబిని కరణి, పితామహులని హృదయాకాశమునం దున్మత్తతాంధకారము సంచరించుచుండును.

షాజహాన్—(ఆకస్మికముగ గంభీరుఁడై)—కాని,—జాగ్రత్త! పరిణయము మాడకుము. (విద్యుత్స్వరమున) ప్రేతములు జనించిన విన్నాఁడను యదుపాజ్ఞలకు లోనుజేసిన నీనగలన్నిఁటిని బలవంతముగ నపహరించివైతురు. వివాహమాడకుము.

జాహనారా—అమ్మా చూచితివా! ఇది సంపూర్ణోన్మత్తత గాదు.

జాహనారా—అట్టిన జనకుని వధింపవచ్చితివా? పితృహత్యా మాత్ర మేల మిగులవలయును?—కానిమ్ము! కుంచము పిండనిమ్ము!

షాజహాన్—వధించెదవా!—వధించెదవా! ఔరంగజేబూ! వధింపుము!—అవనికి వినిమయంబుగ సింహాసనతారావళుల నీకొసఁగివైచెదను. నీవుజూపు మహానుగ్రహమునకై యవసానకాలమున నిన్నాశీర్వదించి ప్రాణములఁ ద్యజించెదను. ఇదిగో! యీలోలవక్షము నుముందుకుఁ జాచుచుంటిని. నిశాతకృపాణము నాహృదయమునందు గ్రుచ్చివేయుము!

ఔరంగ—(ఆకస్మికముగ మోకరించి)—తండ్రీ!—నే జీవితములో ఘోరతరాపరాధము సల్పితిని!—ఇప్పుడు ఘోరతమసాహసము గావింపసాహసింపను! నేనుపాపిని! మహాపాపిని!—ఆ పాపానల మహాజ్వాలయందు దగ్ధుఁడనగుచుంటిని!—తండ్రీ! ఈశీర్ణకాయమును, ఈమూతకన్నులను ఈశుష్కపాండుముఖమును విలోకింపుఁడు. ఇవన్నియు గాటముగ నాహృదయమారాటమునకు సాక్ష్యంబులు!

షాజహాన్—జీర్ణించిపోతివి—నిక్కముగా జీర్ణాంగుఁడవైపోతివి.

జాహనారా—ఔరంగజేబూ! భూమి నాప్రయోజన మేమియులేదు? నిన్ను బాగుగనెఱిఁగిన మానినియొకర్తుక యుండుఁగలదు. నూతనముగ, నేపైశాచిక కృత్యమునరింపఁ దలఁచుచుంటివో నుడువుము!—కూళా! నీకిందేమి కావలయును?

ఔరంగ—జనకుని క్షమాపణ.

జాహనారా—క్షమాపణయా! ఔరంగజేబూ!—ఇదొక యపూర్వ విషయమే!—

ఔరంగ—సోదరీ! నేను—

జాహనారా—ఛీ దురాత్మా! నోరుమూయుము!

షాజహాన్—అమ్మా! నీసోదరుఁ డేమి వచించుచుండెనో పూర్తిగ

వినుము—తనయా! నుడువుము! ఏమిచెప్పఁదలఁచితివో తెలుపుము.

ఔరంగ—తండ్రీ! నేనేమియుఁ బల్కవాంఛింపను. నేవాంఛించునది మీా సైరంపుమాత్రమే!

[జాహానారా వేళాకోళముగ నవ్వును.]

ఔరంగ—ఒకమాఱు సహోదరింగాంచి, పిదప జనకునుద్దేశించి] తండ్రీ! ఇది కపటవాక్యమని తాము యోచించుచో, వెంటనే నావెంబడిరండు. ఈముహూర్తమందే నేనుదుర్గద్వారములఁ దెఱచి వైచి, సర్వజనసమక్షమందు మిమ్ము సింహాసనాసీనులఁగావించి తల వంచిసార్వభౌములగు మీాకభివాదన మొనరించెదను! చూడుఁడిదిగో! నారాజమకుటమును భవచ్చరణ సరోజములపై నిడుచుంటిని.

[ఇట్లని యౌరంగజేబు మకుటమునూడదీసి జనకుని పాదములపైనిడును.]

షాజహాన్—నాహృదయము కరఁగిపోవుచున్నది!— నాహృదయము కరగిపోవుచున్నది!!—

ఔరంగ—తండ్రీ! ఈదీనుని మన్నింపుఁడు. [కాళ్ళను గట్టిగ బట్టుకొనును.]

షాజహాన్—నా కుమారా! లెమ్ము! [ఔరంగజేబును పైకిలేవదీసి] పిదప తన కన్నులఁదుడిచికొనును.

జాహానారా—[తలపంకించి] ఇదొక నూతనాభినయమే! ఆహా యేమి నీ కుహనాచాతుర్యము!

షాజహాన్—అమ్మా! ఊరకుండుము. నాయాత్మజుఁడు నాపదములఁ దలవాల్చి క్షమాభిక్ష వేఁడుచుండెను. నేను దాని నొసఁగకుండ నెట్లుండఁగలుగుదును! కన్నకడుపుకదా!—ఆహా!—పితృచిత్తమా! ఇంతదనుక హృదయాంతరాళమందు దాగియుండి యీమాత్రము నకై పెక్కునాళ్ళారాధన మొనరించుచుంటివా!—ఏమి! ఒక్క-

ముహూర్తంబులోనే క్రోధమంతయుఁ గరఁగి నీరైపోయెను!

ఔరంగ—తండ్రీ! రాజు!—మఱల మిమ్మాగ్రాసింహాసనమందు గూర్చుండబెట్టెదను. ఆయనిర్వచనీయానందదృశ్యము నేత్రపర్వంబొనర్చిన యనంతరంబ, మత్కృత ఘోరతరపాపమునకుఁ దగు ప్రాయశ్చిత్త మొనరించుకొనఁ బుణ్యధామమైన మక్కామహాక్షేత్రమున కరుగుదును!

శాజహాన్—పుత్రా! నేనిఁక జక్రవర్తిని గాఁగోరను. నా సంధ్యాసమయము వచ్చినది. నాయనా! ఇఁక మతిమంతుఁడవై దిగంతవిశ్రాంత ప్రతిభావంతుఁడవై, సర్వంకష ప్రజ్ఞుండవై, అఖిలవిద్వజ్జన సంస్తోత్రపాత్ర శేముషీయుతుఁడవై, అరిష్టదాయక శాత్రవాభీల కుంభి కుంభవిదళనోత్సుక భయానక కంఠీరవంబవై, సుఖంబుగ మహీతలంబేలుము. ఈమణిముక్త మకుటములన్నియు నీయవియే.—నందనా! అతీతమును విస్మృతిగర్భమునఁద్రొక్కివేయ యత్నము సలుపుదును. నీయపరాధములన్నిటిని మన్నించివైచితిని.

[చేతులతో నొసలు గప్పుకొనును.]

జహానారా—తండ్రీ! సైదోఁడులఁ దనకడుపునఁ బెట్టుకొని మిట్టిపడు నిట్టి కఠిను నా క్షమించుట!—

శాజహాన్—అమ్మా ఊరకుండుము. ఈసమయమందు నాసుఖమునకెట్టి యాఘాతము నొసఁగకుము. గతించినవారలిఁక మగుడిరారు. ఏడేండ్లు బిట్టువగపునఁ గుందితిని! శోకమహాజ్వాలలందు దగ్ధుఁడనైపోతిని. చెప్పలేనిపరితాపంబుననున్మత్తుఁడనైపోతిని. తల్లీ!—చూచుచుండుటలేదా!—ఈ యిహమందుమాత్రము నన్ను నిశ్చింతుని గానిమ్ము. నేఁడొక్కదినముమాత్రము నన్ను సుఖింపనిమ్ము. జననీ! నీవుకూడ నీసోదరుని మన్నింపుము—(కుమారునుద్దేశించి) కొడుకా! నీ తోడంబుట్టినదాని క్షమాభిక్షనుగూడ బడయుము.

(వాయువేగమున జహారతున్నిసా ప్రవేశించును.)

జహారతు——కాని, ఘాతకా! నేను నిన్ను క్షమింపను! సమస్తజగంబు నిన్ను మన్నించినను, నేను మన్నింపను! నీపైనవారి తశాపవృష్టిం గురిపించెదను. భీకరదర్వీకరోదరవినిర్గతోష్ణపవన సన్నిభాభిశాపనిశ్వాసముచే నిన్ను దగ్ధునిగావించి వైచెదను! ఆతంకమువలె నాయభిశాప భైరవచ్ఛాయ ఆహారవిహారములందు నీవెనుక వేజనుదెంచును. సుషుప్త్యవస్థయందాశాప మహీధరభారము నీవక్షమును నేలకణచివైచును. ఆయభిశాప వికటధ్వని నీవిజయవాద్యముల వికృతముగాఁ జేసివైచును! నీవు నాజనకుని జంపి యీసామ్రాజ్యలక్ష్మిని స్వాధీన నొనరించుకొంటివో,—ఆసామ్రాజ్య మపహరింప దాడివెడలు నరాతివర్గంబులచే నిరంతరము బీడితుండవై భూలోకనరకమందుఁ బరోచ్ఛిష్టభోజివై చిరంజీవివై మనుము. ఆసామ్రాజ్యము నీసమ్ముఖమున కాలస్వరూపమై నిలువఁబడి నిజనిశాతనఖములచే నీకాయంబునఁ గాయంబులఁ గావించి నిన్ను గాఢతరకలుష గభీరకూపమునఁ బడ వేయును! భయంకరమృత్యుముఖ గహ్వరాభ్యంతరమందీవు సొచ్చుతఱి, లేశమాత్రపువిలింపు కరుణయైన నీనిటలతలమును స్పృశింపకుండుగాక!

[షాజహాన్, ఔరంగజేబు, జాహానారాలు ముగ్వురు తల వంచి నిలువంబడి యుందురు.]

తెరపడును.

సంపూర్ణము.